
నవంబర్ 26 విడుదల
కృష్ణా పిక్చర్స్ వారి
దేసింగురాజు
కథ......


సంగీతం
పామర్తి
మాటలు పాటలు
శ్రీశ్రీ
శ్రీ ఫిలిమ్స్ రిలీజ్














# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## ఉత్తరాలు

### తెలుగు - వెలుగులు

మీపత్రికయందలి తెలుగు వెలుగులు, తెలుగు ప్రజలను పులకితుల జేయుచున్నవి. 16-11-60 తేదీన పత్రికలో శ్రీ కాశీ కృష్ణాచార్యులుగార్ని గూర్చి చక్కగా వ్రాసిరి. ఎట్టి విమర్శలకు తావీయక, నిష్కల్మష హృదయముతో, రచయించుచున్న, ఆరచయితగారికి నాధన్యవాదములు. శ్రీ కృష్ణాచార్యులుగార్ని గూర్చి వ్రాస్తూ "ఆయన జీవితం గతానికి ఆగతానికి వెలుగువంతెన" అన్న వాక్యము ఒక మణిపూస. ఇట్లే మిగిలిన మహాత్ములను గూడ, పరిచయము చేయుగురని ఆశిస్తున్నాను.

కె. ఆర్. సలాది (విజయవాడ)

* * *

16-11-60 బుధవారం విడుదలైన మీ సచిత్ర వారపత్రికలో "తెలుగు వెలుగులు" శీర్షిక క్రింద ప్రచురించబడిన శ్రీ కాశీ కృష్ణాచార్యులవారి సంగ్రహ జీవితచరిత్ర అత్యంత శ్లాఘనీయము: అది ప్రచురించిన మీ సంస్థకు నా అభినందనలు. కాని యట్టి మహాపురుషుని ఛాయా చిత్రం ప్రకటించుటకు బదులు మరేదో చేసిపఠితలకు అసంతృప్తిని కల్గించిరి. తెలుగు నిండు వెలుగునకది ప్రధానం కాక పోయినా పఠితకు మాత్రం అపచారంచేశారు. కారణం "తెలుగు వెలుగులు" మొదట చదివే పఠితల్లో ఒకణ్ణి అవడం.

సరోజ సంధాన్ (విశాఖపట్నం)

* * *

'ఆంధ్ర సచిత్ర వారపత్రిక'లో 'తెలుగు వెలుగులు' శీర్షికలో సదాశివ బ్రహ్మంగారి సృష్టి గూర్చి ముచ్చటిస్తూ చంద్రకిరణ ప్రసరితమైన సునిశిత హాస్యం పాఠకులకు అందజేసినందుకు మీకు కృతజ్ఞతలు.

రచయితకు నా ధన్యవాదములు.

తాడేపల్లి వెంకటరత్నం (కలకత్తా-26)

* * *

9-11-60 పత్రికలో 'కథాశివబ్రహ్మంను' అంటే సినిమా రంగంలో అత్యుత్తమ కథకుడైన సదాశివబ్రహ్మంగారిని తెలుగు వెలుగులో పరిచయం చేసినందుకు నా ధన్యవాదములు.

యస్. సుచేత (కడప)

* * *

దృష్టిపూర్తి చేసుకొన్న తర్వాత "తెలుగు వెలుగులు" శీర్షికను ఆపివేయగలరని ఆశించుచున్నాము. లేని యెడల ఇంకా కొద్ది వారములలో మా పేర్లు కూడా ప్రచురించెదరేమో యని సందేహము కలుగుచున్నది.

"మిత్రద్వయం" (విజయవాడ)

* * *

### కార్టూనులు

మీ పత్రికలో వేసే కార్టూనులు కొన్ని చాలా అసభ్యముగా ఆడవారిని కించపరచేవిగా ఉంటున్నవి. ఎక్కువగా కార్టూనులు పంపేవారు మొగవాళ్లు అయివుండాలి. అందుకనే ఈ మధ్య ఇలాంటి వెక్కువగా వేస్తున్నారు.

జె. హైమవతీరావు (విజయవాడ)

* * *

2-11-60 పత్రికలో పడిన 'ఉరి సులావుగా తీయబడును' అను కార్టూనునుగురించిన విమర్శ 16-11-60 పత్రికలో చదివి ఆశ్చర్యపోయాను. శ్రీ రంగయ్యగారు కార్టూనుల పోటీ నిబంధనలు చదివినట్లు తోచదు. ఈ కార్టూనులో మాటలనుబట్టి చిత్రమునకుగొప్పదనము వచ్చినది. అసలు ఇది ప్రచురించుటయే సరిగాదేమో!

కృష్ణ (హైదరాబాదు)

* * *

నిజంగా 16-11-60 పత్రికలోని "ఎప్పుడూ ఇంతే" చూస్తే దీనిని చిత్రీకరించు "శంకర్" వనితాలోకం పాలిటి భయంకర్! అనిపించింది.

దొమ్మతమరి విఠల్ రావ్ (మంచిర్యాల)

* * *

కార్టూన్ పోటీలు క్రింద మీరు ప్రచురించేవి కన్న మామూలుగా ఇతర పేజీలలో ప్రచురింపబడేవి చాలా బాగుంటున్నాయి. వీటికి బహుమతి ఇవ్వకుండ ఏవో మీకు తోచే వాటికి బహుమతి ఇవ్వడం పూర్తిగా పక్షపాత మని చెప్పక తప్పదు.

ఎస్. బి. దాసు (కటకం)

### కథలు

16-11-60 తేదీ ఆంధ్ర సచిత్ర వారపత్రికలోని 'సుజాత' కథలో సుజాత-శీనూ ప్రారంభస్నేహాన్ని కాలేజిలో అడుగుపెట్టే సరికి వారిలో మార్పులు వచ్చినను పరోక్షముగా వారిలోని పరస్పర ప్రేమను రచయిత గారు కొన్ని ఘట్టాలలో బాగుగా చిత్రించారు. ఈ సందర్భములో లైలా మజ్నూల కథ జ్ఞప్తికి వచ్చినది.

రాజు (ఆరణి)

* * *

9-11-60 తేదీ సంచికలోని మధురాంతకం రాజారాంగారి "ప్రాణదాత" కథ చాలా చక్కగాఉంది. అంతచక్కని కథను రచించిన రాజారాంగారికి మీపత్రికద్వారా నాహృదయపూర్వక అభినందనలు నందచేయ ప్రార్థన.

ఎం. సుబ్బారావు. (హైదరాబాదు).

9-11-60 వ తేది ఆంధ్ర సచిత్ర వార పత్రికలో శ్రీ కనుపర్తి వరలక్ష్మమ్మగారు వ్రాసిన కన్యాశ్రమం-పూర్తిగా చదివేసరికి నాకండ్లలో రెండు నీటిబింగువులు చేరాయి.

పి. మాణిక్యం. (హైదరాబాదు).

* * *

"ఉపాకన్యకథ" మాకు బాగా నచ్చింది. రచయితకు మాధన్యవాదాలు. కథ ఇంకా పొడిగించినా బాగుండును. ఇటువంటి కథలే ప్రచురిస్తారని నే ఆశించుచున్నాను.

యస్. వి. సుబ్బారెడ్డి. (కదిరి).

* * *

16-11-60 తేదీ పత్రికలో ప్రచురించిన గోరాకుంభార్ కథ చాలా బాగున్నది. ఇటువంటి రసవత్తరమైన కథల్ని ప్రతివారం ప్రచురిస్తూ ఉండగలరని ఆశిస్తున్నాను. రచయితగారికి నామనఃపూర్వక అభివందనములు.

ఆరవల్లి సుదర్శనాచార్యులు.
(బ్రాహ్మణగూడెం).

* * *

ఈవారం (23-11-60) "మన" వార పత్రికలో 'దాశరథి'గారు రచించిన 'వీణ నవ్వు' కథలోని పొరబాటు ఎవరికైనా నిజంగానే నవ్వు తెప్పిస్తుంది.

రామం బొడ్డుమల్లెచెట్టుక్రింద కూచుని, శివాలయం ధ్వజస్తంభంవైపు చూస్తున్నాడు...

శివాలయాల్లో ధ్వజస్తంభాలుండవు. నందీశ్వరుడుంటాడు. ధ్వజస్తంభాలుండేది విష్ణాలయాల్లోనే.

ఈలాంటి తప్పులేనా ఇకముందు సవరిస్తూ ఉంటారని ఆశిస్తున్నాను.

ముక్కోటి. (విశాఖపట్నం-2).

ఒకసారి 'శివాలయం' దర్శించండి. సవరణ స్ఫురిస్తుంది.

* * *

## ఢిల్లీ లేఖ

16-11-60 తేదీగల ఆంధ్ర వారపత్రికలో న్యూఢిల్లీ లేఖను చదివినాను. శ్రీ కృష్ణగారి వ్రాత అసమంజసంగానూ, అసహజంగానూ ఉన్నది. రాష్ట్రపతి హిందీభాషావాదుల అగ్రనాయకుడు కావచ్చును. అది తప్పేమీ కాదు. నిజానికి హిందీని జాతీయభాషగా కాంగ్రెసుపార్టీ ఏనాడో అంగీకరించింది. ఆంగ్ల వ్యామోహంలో కొట్టుకుంటున్న వారికి దేశీయభాషావాదులు దురభిమానులుగానే కనిపిస్తారు. ఇంగ్లీషువలనే భారతదేశం అఖండంగా ఉండగలిగిందన్న వాదం కూడా నిజం కాదు. అశోకుడు, అక్బరు, చంద్రగుప్తులు విశాల సామ్రాజ్యాన్ని పాలించినప్పుడు ఇంగ్లీషు మనదేశానికి తెలియనే తెలియదు. రష్యా, చైనాలు స్వభాషలతోనే విశాల భూఖండంలో ఏక ప్రభుత్వాన్ని నడుపుకుంటున్నారే? మన పొరుగునున్న పాకిస్తాన్ మాటేమిటి? హిందీవాదులవల్ల దేశం ముక్కలౌతుందనటం సహేతుకం కాదు. ఆంగ్లమానసపుత్రులు వైదొలగితే భారతం అఖండంగా తప్పక నిలువగలుగుతుంది. "బ్రాహ్మణ మత పునరుద్ధరణకు శాయశక్తులా రాష్ట్రపతి పాటుపడ్డా"రని సందర్భం లేకున్నా మరొక మాట వ్రాశారు. సెక్యులర్ గవర్నమెంటు చేతబుగుని "2500 వర్థంత్యుత్సవాలు దేశమంతటా జరుపబడటం శ్రీ కృష్ణగారికి తెలియదా? మతకలహాలలో ఎన్నోసార్లు ముస్లింలపట్ల అనుచితమైన ఔదార్యం చూపి హిందువులకు అన్యాయం చేయలేదా? కేరళలో ముస్లింలీగ్‌తో పొత్తు కలుపుకోవటం సెక్యులరిజమా? బ్రాహ్మణ మతాభిమానం చూపించటంమాత్రం మహాపరాధము-కదూ! శ్రీ కృష్ణగారు ఇతర విషయాలలోవలె భాష, మతముల విషయాలలో కూడా నిష్పక్షపాతముగా ఇకముందైన వ్రాయుదురని ఆశిస్తున్నాను.

కె. ఎ. సింగరాచార్యులు (హైదరాబాదు)

* * *

"హిందీ పరీక్షలు ప్యాసయినవాళ్లు చేతులెత్తండి అనగానే వేలకొద్దీ చేతులెత్తారు."

"అలాగే ఇంగ్లీషు పరీక్షలు ప్యాసయినవాళ్లని చేతులెత్తమంటే చాల కొద్ది చేతులు మాత్రం పైకి లేస్తాయి. కాని అలాచేసి మిమ్మల్ని ఇబ్బందిపెట్టటం నాకిష్టంలేదు. దీన్నిబట్టి దేశంలో హిందీ ఎంత బాగా వృద్ధిచెందినదో తెలుసుకోవచ్చు."

స్వాతంత్ర్య దినోత్సవంనాడు 'రాష్ట్రపతి' మద్రాసులో ఈ మాటలన్నారు. కాని నిజం ఆయనకూ తెలుసు దక్షిణభారత హిందీ ప్రచారసభలాగ, ఇంగ్లీషుకి కూడా ఒక ప్రచారసభ ఏర్పాటుచేసి, ప్రభుత్వం సహాయంచేస్తే దక్షిణ భారతంలో రిక్షావాళ్లు కూలివాళ్లు కూడా ఇంగ్లీషులో ప్రాథమిక పరీక్షలు ప్యాసవుతారు.

దీపావళి సంచికలో శ్రీ కృష్ణగారు నిజం చెప్పినందుకుగాను వరంగల్లు గోపిరెడ్డిగారు దాన్ని ఖండించారు. శ్రీ కృష్ణగారు అలా వ్రాయటం అత్యంత సమంజసం. అసలు నిష్పక్షపాతంగా ఉండవలసిన రాష్ట్రపతి హిందీవారి పక్షం తీసుకుని ప్రచారం చేయడం బావుందా?

రామశాస్త్రి (విశాఖపట్టణం)

* * *

## ముఖచిత్రం

2-11-60 తేదీన మీ (మా) సచిత్రవార పత్రిక ముఖచిత్రం "హంస సందేశం" చాలా బాగున్నది. సినీమా తారల ముఖాలతో విసుగెత్తించక ఇటువంటిచక్కని చిత్రములను ప్రచురిస్తుంటే, చిత్రకళ ఎక్కువగా పోషింపబడి చిత్రకారులను అభివృద్ధిలోనికి తీసుకురాగల అవకాశాలున్నాయి.

"హంస సందేశం" చిత్రకారుడు కె. రాం

బాబుగార్కి మా నా హృదయపూర్వక ధన్యవాదాలు.

బి. వి. సత్యనారాయణమూర్తి.
(కాట్రేనిపాడు)

* * *

### కథ కాని కథ

16-11-60 తేది వారపత్రికలోని కథకానికథలు చాలా బాగున్నాయి. కాని వాటిలో "అయ్యా ఒక కాని" అన్న కథలో రచయిత, వారు వేసిన ఒక డ్రాయింగునకు వారి కాలేజీలోని డ్రాయింగు లెక్చరర్ క్రింద 'అయ్యా ఒక కానీ' అని వ్రాసి వారి బొమ్మకు మొదటి బహుమానమిచ్చేగని వ్రాశాగ. కాని. ఆ రచయిత బహుశః కాలేజీలలో డ్రాయింగునకు లెక్చరర్లు ఉండరని ఎరుగరేమో? ఇక పై నుండి అయినా అవిధంగా వ్రాయకుందురని తలుస్తాను.

సి. బి. రామచంద్రమూర్తి,
(కానూరు అగ్రహారం)

మద్రాసు విశ్వవిద్యాలయంలో బి. ఎ. డిగ్రీకి డ్రాయింగ్ కూడా ఒక ఐచ్ఛిక విషయం. ★

## ఉత్తరాలు

# ఆంధ్రసచిత్ర వారపత్రిక



Founder
K. Nageswara Rao

స్థాపితము
1908



సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్



సంపుటము 55
సంచిక 13

30-11-60
బుధవారం

శార్వరి మార్గశిర శుద్ధ ద్వాదశి



విడిప్రతి వెల 25 న. పై.
సంవత్సర చందా 13-0-0



ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీధి,
మదరాసు-1.


# విషయానుక్రమణిక

ముఖచిత్రం:
మంజీరా వారి 'చివరకు మిగిలేది'లో
సావిత్రి, బాలయ్య.



## కథకానికథ

కథకాని కథల పోటీకి రచనలు పంపేవారు కొంతమంది తమ రచనలు కేవలం చిన్న చీటీముక్కలమీద వ్రాసి పంక్తిలో పంక్తిని ఇరికిస్తున్నారు. ఇలాంటివి పరిశీలించటం కష్టం కాబట్టి రచనలు పంపేవారు రచనకుతగ్గసైజు కాగితంమీద పంక్తికీ పంక్తికీ మధ్య బాగా ఖాళీవదలుతూ వ్రాయాలని కోరుతున్నాము. కాగితాలకు ఒకవైపునే వ్రాయడం కూడా అవసరం.

—సంపాదకుడు

## వనితలకు వినతి

'వనితాలోకం' శీర్షికకు రచనలు పంపగోరేవారు కవరుపైన స్పష్టంగా 'వనితాలోకం శీర్షికకు' అని వ్రాయాలి. లేకపోతే అసంఖ్యాకంగా వచ్చే రచనలలో వనితల వ్యాసాలు వింగడించడం కష్టసాధ్యం.

వనితలు పంపే వ్యాసాలు తగుమాత్రపు పరిమితికి — అంటే అచ్చులో రెండుపేజీలకు మించకుండా ఉండాలి.

వ్రాసే రచనగానీ, చేసే సూచనగాని సమకాలీన సాంఘిక పరిస్థితులకు సంబంధించేదిగా ఉండాలి ప్రయోజనాత్మకమైన వ్యాసాలకు ప్రాధాన్యంలభిస్తుంది. కాగితానికి ఒకేవైపున సిరాతో వ్రాసిన రచనలే అంగీకారపాత్రం కాగలవు. డిజైనులు, పంపేవారు అవి పావుతావు సైజు డ్రాయింగు పేపరుమీద ఇండియన్ ఇంకుతో వ్రాసి పంపవలెను. రచయితల చిరునామా లేని ఏ రచన ప్రచురణార్హం కాదు.

—సంపాదకుడు.

## గమనిక

కార్టూన్ పోటీలో పాల్గొనగోరేవారు తగుమాత్రపు సైజు కాగితంపై ఇండియన్ ఇంకుతో కార్టూన్ వ్రాసి పంపాలి. క్రింద చిరునామా స్పష్టంగా వ్రాయాలి. చాలీచాలని కాగితాలపై పెన్సిల్‌తోను, కలంతోను వ్రాసే బొమ్మలు పోటీకి స్వీకరించడం లేదు.

## అధిష్ఠానవర్గానికి చిరాకు

"నిజమే, విరాళాలు స్వీకరించడం తప్పే. కాని అవి లేకపోతే కాంగ్రెసు గతి ఏమికాను?




"ఓనుపెట్టెలో ఉన్న గుట్టు"
పత్రికా విలేఖరుల ఆదుర్దా










!

పాపం,
అవి పగటి
కలలైనాయి!







## గడ్డం, పి,కు మార్

### (మొదటి బహుమతి రు. 10 లు)

మూడు పరీక్షలై స్కూలు తెరచారు. కొన్ని ఆన్సరు పేపర్లుకూడ ఇచ్చారు. ఆరోజు లెక్కల పేపర్లు యిస్తున్నారు. నాకు మా ఫ్రెండ్సుకు బాగానె మార్కు లొచ్చాయి. ఇంతలో మా ఫ్రెండు జి. పి. కుమార్ పేపరు వచ్చింది. లెక్కల టీచర్ వాడ్ని పిలిచి, గడ్డం ముందుకు లాగి, నెత్తిన ఒక దెబ్బవేసి వాడి పేపరిచ్చాడు. వాడు వాడి చోటుకెళ్లి పేపరు చూసుకున్నాడు. మార్కులు బాగానే వచ్చాయి. వాడిని టీచర్ ఎందుకు కొట్టాడో అర్థంకాక పేపర్లన్నీ యిచ్చిన తరవాత టీచర్‌ని అడుగగా టీచర్ వాడిపేపర్ చూపెట్టాడు. అందులో 'గడ్డం పికుమార్' అని వుంది. మాకేమీ అర్థంకాక టీచర్ వైపు చూచాము. టీచర్ వాడి పేపరు చూపెట్టాడు. అందులో వాడి పేరు యిలా వుంది. 'గడ్డం, పికు, మార్' అని కామాలతో వుంద. దానిని టీచర్ వివరించి చెప్పగ మేమంతా ఘొల్లున నవ్వాము. ఈ సంఘటన జరిగినప్పటినుండి వాడు తన పూర్తి పేరు 'గడ్డం ప్రద్యుమ్న కుమార్' అని వ్రాస్తూ వుంటాడు.

కె. గోపోపాల్‌రెడ్డి (కర్నూల్)

* * *

## దశరథుని తండ్రి ఎవరు?

### (రెండవ బహుమతి రు. 5 లు)

ఈ సంఘటన నా చిన్ననాడు అంటే మూడవ తరగతి చదువుతున్నప్పుడు జరిగినది. మాకు తెలుగు పాఠములు జరుగుచుండగా 'నాజరు,' వచ్చాడు. పిల్లలందరు లేచి కూర్చున్నారు. తరువాత పిల్లలిని జనరల్ ప్రశ్నలు అడగసాగాడు. కొన్ని సరియైన జవాబులు చెప్పాము. అందు ముఖ్యమైన ప్రశ్న అడిగాడు. అది ఏమనగా శ్రీరాముల వారికి తండ్రి ఎవరు, అని. ప్రశ్న చాలామందికి తెలుసు కనక 'దశరథుడు' అని జవాబు చెప్పాము.

మరల దశరథుని తండ్రి పేరు ఏమని 'నాజరు' అడిగాడు. అది మహమ్మదీయ పిల్లవాణ్ణి అడిగాడు. వాడువెంటనే 'గ్యారారథుడు సార్' అనేశాడు. క్లాసంతా గొల్లుమంది. నాజరు కూడా నవ్వాపుకోలేక పోయాడు.

వి. గోపాలస్వామి
(పెంటవెల్లి)

* * *

## గాలీ, శబ్దమూ

### (రెండవ బహుమతి రు. 5 లు)

మా బాబ్జీకి రెండు సంవత్సరాలుంటాయి. వాడికో అలవాటుంది. ఎంతచలిగాఉన్నా, బయట ఎంతగాలి వీస్తున్నా ఫ్యానువేస్తేగాని నిద్రపోడు. చలిగా ఉన్నప్పుడు, గాలి బాగా ఉన్నప్పుడు ఫ్యానువేసి కరంటువేస్టు చేయటం మా నాన్నగార్కి ఇష్టములేదు. కాని ఏంచేస్తారు? మా బాబ్జీ పోరుపడలేక ఫ్యాను వేస్తున్నారు. ఒకరోజు ఫ్యాను వెయ్యటం మానేసి, వీడికి కావలసింది గాలి కదా అని విసనికర్ర తీసుకొని విసరటం. మొదలుపెట్టింది మా అమ్మ. కాని వాడు నిద్రపోతేగా? ఆరోజు ఫ్యానువేస్తేగాని నిద్రపోలేదు. మా బాబ్జీకి ఆఫ్యానుకుగల సంబంధము ఏమిటా అని మా అందరికి చాలా ఆశ్చర్యంవేసింది. ఆ మర్నాడు మా అమ్మ దొడ్లో కూర్చుని, తిరగలితో పిండివిసరుతోంది. నేను, మా బాబ్జీని ప్రక్కన పడుకోపెట్టుకొని కూర్చున్నాను. మా బాబ్జీ నిద్రపోతున్నట్లు తెలిసికొని ఫ్యానులేకుండా నిద్రపోతున్నందుకు చాలా ఆశ్చర్యపోయాము. మా అమ్మ ఏదోపని మీద విసరటంమాని, లోపలకు వెళ్ళింది. ఉన్నట్టుండి, మావాడు గభాలున లేచి గోల చేయటం మొదలుపెట్టాడు. మాకేమీ అర్థంకాలేదు. మా అమ్మ మామూలుగావచ్చి పిండివిసరటం మొదలుపెటింది కాస్సేపటికి మా బాబ్జీ మళ్లీ నిద్రపోయాడు. అప్పటికి కాని మా కర్థంకాలేదు. అసలుసంగతి ఏమిటంటే.. మా ఫ్యాను చాలాపాతది. అది తిరుగుతోంటే మిషనులాగ గరగర చప్పుడు అవుతుంది. మా బాబ్జీ ఫ్యానుఇచ్చే గాలికి కాక, దాని గరగరకు నిద్రపోతున్నాడు. ఈరోజు ఫ్యానుచేసే గరగర, తిరగలి చేసేటప్పటికి, ఆ రెండు గరగరలు ఒకలాగే ఉండుటచే నిద్రపోయాడు. ఆరోజునుంచి మా అమ్మ విసరవలసిన పిండివగైరా లేమైనా ఉంటే మాబాబ్జీ నిద్రపోయేముందు విసరటం మొదలుపెట్టేది. ఎప్పుడూ మరకు పంపే పిండ్లు వగైరాలు ఇంట్లోనే విసరటం వల్ల కొంతఖర్చుతగ్గి ఆఫ్యాను కరంటుఖర్చు కూడ తగ్గింది. దానితో ఇటు మాబాబ్జీ గోలకూడా తగ్గింది......

యు. వి. రమణారావు
(నర్సారావుపేట)

* * *

## 'నాతోపాటురా'

### (రెండవ బహుమతి రు. 5 లు)

ఒకరోజు నేనూ, నా స్నేహితుడు హుస్సేనువాళ్ళ ఇంట్లో కూర్చుని మాట్లాడుకుంటున్నాము. ఇంతలోనే ఒక ముష్టివాడొచ్చాడు. "అల్లాకే నామ్‌పర్ కుచ్ దేనా భాయి" అంటూ. (అంటే "భగవంతుని పేరు మీద ఏమైనా ఇమ్మని" అడిగాడు) హుస్సేను మాటల సందడిలో ఉండి "అరే! జా! జా!" అన్నాడు. కాని బిచ్చగాడు కదల్లేదు. మళ్ళీ కొంచెంసేపాగి "అల్లా కే నాంపర్ కుచ్ పైసా దేవ్ భాయి" అన్నాడు. మా స్నేహితుడు 'అరె! పైసానై, జావ్' అన్నాడు. (డబ్బుల్లేవు; పొమ్మన్నాడు) ముష్టివాడు వదల్లేదు "అల్లాకే నాపలర్ కుచ్ కపడా దేవ్ భాయి" అన్నాడు. (బట్ట అయినా ఇమ్మన్నాడు) "అరె! కపడే గిపడే నయి జా! జా!" అన్నాడు హుస్సేను. ఇంకా ఊరుకోలేదు, ముష్టివాడు. "అల్లాకే నాంపర్ కుచ్ ఖానేకు దేవ్ భాయి" అన్నాడు (కొంచెం తిండయినా పెట్టమని అర్థం). మా హుస్సేనుకు చిరాకు ఎక్కువైపోయింది. "ఖానా! గీనా! నై! తూ పహిలే జా నైతో మార్‌దూంగా!" అన్నాడు. ("తిండీ గిండీ ఏమీలేదు నువు ముందు ఇక్కడ్నుంచి పో! లేకపోతే తంతాను" అని.) ముష్టివాడికి కోపం వచ్చింది. వాడూ కొంచెం శ్రుతి హెచ్చించి "అరె! కపడే నయి! పైసానహి ఖానా, నహి, తో తూ ఉధర్ క్యోం బైటా? మేరాసాథ్ చలోనా" అన్నాడు. ("తిండిలేదు. బట్టా లేదు, డబ్బూలేదు కదా అక్కడెందుకు కూర్చున్నావు నాతోకూడా వచ్చేయ్" అని.)

ఎ. డబ్లియు. ఖాద్రీ
(బందరు) ★

(ఆంధ్ర సచిత్ర వారపత్రికకు ప్రత్యేకం)

# నేనూ - నా పాప

## పర్షియా మహారాణి ఫరాపహ్లావీ స్వీయకథ

పర్షియా సామ్రాజ్య సింహాసనానికి ఇన్నాళ్ళకు ఒక వారసుడు కలిగాడు. నేనే ఆ వారసుడి కన్నతల్లిని.

నా కలలు నిజమైన ఈ ఆనంద సమ ఎందుకో పరవశిస్తున్నాను. ఈ పాపని యంలో ఒక్కసారి నేను తిరిగి చూసుకుంటే చూసుకుంటే నాకు కలిగే ఆనందం




పర్షియన్ మహారాజు షా

అపూర్వం ఇంతకీ కలిగేది మగశిశువా ఆడపిల్లా? అనే చింత మా రాజకుటుంబమంతా నిండింది. కాని నాకుగాని, నా భర్త పర్షియా మహారాజు షాకుగాని ఆ చింత కలుగనే లేదు.

కడుపు పండే కలలుపండే కమ్మని మధురానుభూతిలో భగవంతుడు ఎవరి నిచ్చినా నాకు ఆనందమే అనుకున్నాను షా కూడా అంతే భావించారు ఈ మహాసింహాసన వారసత్వం వమ్ము కాకుండా ఎవరి ననుగ్రహించినా భగవంతుడికి కృతజ్ఞుల మేఅనుకున్నాము.

ఈ చింత మా దంపతులకు అందుకే రాలేదు. క్రితం సోమవారం ఇక అసలు ఘడియ చేరవయిన సమయంలో ఒక్కటే నేను చేసిన పని ప్రసూతి చికిత్సాలయంలో కాలు పెట్టగానే "నాకు కలిగే శిశువు ఆరోగ్యవంతుడై బుద్ధిమంతుడై వర్ధిల్లాలి" అని మాత్రం భగవంతుని ప్రార్థించుకున్నాను

ఈనాడు నేను సహజంగానే చాలా అదృష్టవంతురాలననీ, తల్లిననీ గర్విస్తున్నాను. సంతోషపడుతున్నాను. ఒక వేళ ఆడపిల్ల పుట్టినా నాయీ ఆనందానికి లోటు ఉండేది కాదు. ఇంకా ముగ్గురు బిడ్డలను కనాలని నా కామితం. అందులో ఏ ఒక్కరైనా మగశిశువు కాకపోతారా! అందుకే ఆ చింత నాకు ఉండేది కాదు. నేను ఈ మహారాజు అర్ధాంగిని అయిన పది నెలలకే మా చిరకాల వాంఛ ఫలించింది. నా జన్మ సఫలమైనది. సార్థకమైనది.

పర్షియా మహారాజును నేను కలుసుకొని సంవత్సరమే అయినా, ఈ సంవత్సరంలోను నాకు కలసివచ్చిన అదృష్టం నాకే ఆశ్చర్యం కలిగిస్తుంది. ఒక స్త్రీ జీవితకాలంలోనే అపేక్షించలేని అదృష్టం నాకు కలిగింది

విధి నాకు అనుకూలించింది. నామీద అమితవాత్సల్యం చూపింది. ఇది బయటకి నేను చెప్పడానికి వరచే విషయం.

నా యెడల నా భర్త ప్రదర్శించే దయ, అనురాగం, గాఢమైన ప్రేమ నాకు మూడు వరాలు. అనేక అసాధారణ పరిస్థితులలో జరిగిన మా వివాహానికి ఈ వరాలే అంశగా నిలిచినాయి.

మరొక స్త్రీని షా వివాహం చేసుకోవలసి వచ్చినప్పుడు కొద్దిపాటి పరిచయముయినా ఆయన నన్ను అడుగగానే నా చెవులను



పర్షియా రాజ్యసింహాసనానికి వారసుడైన
నెలబాలుడు

నేనే నమ్మలేకపోయాను. నేనేమిటి? పర్షియన్ మహారాజ్య సింహాసనమేమిటి ?

కేవలం మానవతాదృష్టితో నే తాను నన్ను వివాహం చేసుకుంటానన్నారు షా. రాజ కుటుంబసిద్ధాంతాలకు తావు లేదన్నారు. అప్పుడు నాకు అసలు విషయం తెలిసింది.

చాలా భయభ్రాంత నయినాను. నాలో నేనే అనేకవిషయాలు తర్కించుకున్నాను. నేను సఫలురాల నవుతానో లేదో, విధి నిర్వహణలో నేను నెగ్గుతానో లేదో ఇదే నా భయం.

ఈ భయాలన్నీ విని చక్రవర్తి, నాయందు తమకుగల అనురాగం తొలిసారిగా వెల్లడించే వరకు, నన్ను నేను సమాధానపరచుకొనలేక పోయాను. ఆయన నన్ను ప్రేమించినసంగతి అంతవరకు నాకు తెలియదు.

తాను కేవలం నన్నే ఎందుకు ప్రేమించాలో తెలుసుకోమన్నారు షా అనేక మంది అప్సరసల సరసన మెలగే మహారాజు నాబోటి వనితను ప్రేమించడం ఎందుకు అని ఆలోచించాను. నిజమే నావంటి వనిత ఆయనకు కావాలి. ఆయన అర్ధాంగిగా మెలగాలి. ఆయన గుండెలో ఆశాదీపం వెలగాలి అదే ఆయన వాంఛ

వాస్తు నిర్మాణశాస్త్రం చదువుతున్న విద్యార్థినిని నేను. నాకు ఈ ఆహ్వానం అపూర్వంగా వినిపించింది ఆ చదువు అంతటితో ముగించాను

అయితే నేనిలా అంగీకరిస్తానని చక్రవర్తి కూడా గట్టిగా అనుకోలేదు. ఇదివరలో ఆయన రెండువివాహాలు చేసుకుని వారసుడు కలగలేదనే నిరాశతో ఆ వివాహాలు రద్దు చేసిన సంగతి నాకు తెలియదనుకున్నారు. నాకు ఆ విషయం తెలియచేశారు. 'నీసంగతి అంతే అనుకుని బాధపడకు. ఆ వాంఛతో నిన్ను చేసుకుంటా ననుకోవద్దు' అన్నారు.

షా చేసుకుంటున్న వివాహాలు రాజధర్మం ప్రకారం చేసుకుంటున్నవేనని అంతా చెప్పారు. కొన్నిచోట్ల నేనూ చదివాను.



వారసుని కన్నతల్లి, షా మూడవభార్య మహారాణి ఫరా

అది నిజం కాదని నాకు తెలుసు. ఆయన నన్ను ప్రేమించారని తెలుసు. రాజ నిబంధనలే మళ్ళీ పెళ్ళి చేసుకోమని బంధిస్తే ఎప్పుడో మళ్ళీ ఆయన చేసుకుని ఉండేవారని నేను తెలుసుకున్నాను.

ఇక పెళ్ళికిముందు ఒకరోజు నాతో రహస్యంగా చక్రవర్తి ఇలా అన్నారు. "అనవసరంగా భయాలేమీ పెట్టుకోవద్దు. రేపటిచింతలు మాను. మన ఈ వివాహం నాకు ఆఖరుది."

ఆ మాటలు ఇంకా నా చెవుల్లో రింగుమంటూనే ఉన్నాయి మళ్ళీమళ్ళీ ఆయన అంటున్నట్లు అవి నాకు ఆనందం కలిగిస్తున్నాయి

"నా ప్రజలకి, నా ప్రభుత్వానికి వారసత్వ భయం లేదని అనేకసార్లు చెప్పాను. ఇది ఇంకా సాగదు. మనం వారసుడు కలగాలని ఆశిస్తున్నాం. భగవత్ప్రార్థన ఒక్కటే మనం చేయగలిగింది. భగవదుద్దేశ్యం అది కాకపోతే రాజ్యం పోతుంది. అంతేకదా. మన మనస్సుల సాక్షిగా ఇదే నా ఆఖరు వివాహం.

నీవు నిశ్చింతగా ఉండు' అన్నారు. చక్రవర్తి.

కళ్యాణ శుభఘడియలకు ముందు ప్రియుని ముఖతః ఇంతకన్న మధురమైన మాటలు ఎవరైనా విన్నారా?

ఈ మాటలు మా వివాహానికి కొద్ది రోజులు ముందు ఆయన అన్నవి. ఆ నాడు రాజధానీ నగరమంతా ప్రపంచం నలుమూలల నుండీ వచ్చిన పత్రికారచయితలతో నిండిపోయింది. మా ఆప్త మిత్రులు కొందరు, తెలిసినవారు మరికొందరు అందులో ఉన్నారు.

ప్రపంచమంతా నా నిర్ణయం తెలియాలి. నాకు అంతరంగికంగా చెప్పిన మాటలు వారందరికీ వెల్లడించాలని చక్రవర్తి నిర్ణయించారు.

నమ్మలేని ఆనందం నాకు కలిగింది.

ఇంకో ముఖ్య విషయం కూడా మా ప్రకటించారు. అనూచానంగా వస్తున్న సంప్రదాయం ఎలా వున్నా, తన ఇష్ట ప్రకారం మరొకరిని వారసుడుగా నియమించే అధికారం తనకు ఉన్నదని ఆ ప్రకటన. కాని తన కన్న కొడుకు తనకు వారసుడు కావాలనే ఆశ మాత్రం ఉందన్నారు.

వివాహం అయిన తర్వాత దాంపత్య జీవితంలో ఎన్ని స్వర్గ సుఖా లనుభవిస్తున్నా ఎందుకో నా మనస్సు పుత్రవాంఛతో అల్లాడింది. అల్లా కృప కలిగింది. నా తపస్సు ఫలించింది.

నా పాప జన్మించినరోజు నేను తరించిన రోజు. ఆనందానికి అవధులంటూఉంటే ఆనాడు నేనందుకున్నవే అనుకుంటాను. ప్రసూతి గృహంలో ప్రవేశించిన మూడు గంటల్లో నాకల ఫలించింది. నేను కళ్లు తెరచీ తెరవగానే నాముందు నిలచిన డాక్టర్ సాలీ "అభినందనలు మహారాణీ-మగశిశువు" అన్నారు. "నేను ఎరుగున్నంతలో చాలా సుఖంగా ప్రసవమైన కేసుయిదే" అని కూడా ఆయన అన్నారు.

అదొక మధురానుభూతి. అంతకన్న ఏం చెప్పను?

కాని అక్కడఉన్న దీపాల వెలుగులో డాక్టర్ సాలీని నేను సరిగా చూడలేకపోయాను. నా చుట్టూ ఇతర నర్సులూ వాళ్ళూ వున్నారు. అయినా అది రాజభవనం కాదు.

ఒకసాధారణ ప్రసూతి కేంద్రంలో నేను కావాలని కోరిచేరాను. దానికి పోషకురాలను కూడా నేనే. నేను మహారాణిని. ఒకసామాన్యస్త్రీని కాదుకదా. అయివుంటే ఏ సామాన్య చికిత్సాలయంలో చేరినా అదొక విషయంక్రింద పరిగణింప బడేది కాదు. ఆ క్షణంలో నామటుకు నాకు నేను సామాన్యురాలనైన వెనుకటి ఫరాడీగా నే అనిపించింది. కాని ఆభావం ఎక్కువసేపు నిలవలేదు.

★

(ఇంకా ఉంది)



సింహాసన వారసత్వం నిలబెట్టలేక విఫలురాలైన సురయా.



కేంద్ర ఆరోగ్యమంత్రి శ్రీ డి పి కర్మార్కర్ ఈ నెల 7 తేదీన బెంగుళూరులో ఏర్పాటైన రాష్ట్రీయ గృహనిర్మాణ మంత్రుల ప్రథమసమావేశంలో ప్రసంగించారు

**న్యూఢిల్లీ లేఖ** — **శ్రీకృష్ణ**

# ఎలిజబెత్ రాణి భారతయాత్ర: రాష్ట్రపతితో సమంగా లాంఛనాలు

ఢిల్లీలో బాగా సందడిగా ఉండే కాలం ఇప్పుడిప్పుడే ప్రారంభమైనది ఉత్సవాలకు, విదేశీ అధినేతల ఆగమనానికి ఇదే సమయం పశ్చిమ జర్మనీ మాజీ ఉపాధ్యక్షుని రాకతో ఈ ఏడు ఆ సందడి కాలం ప్రారంభమైనది జపాన్ యువరాజు ఈ నెలలో వస్తాడు అసలు హడావిడి అంతా జనవరి 21 వ తేదీన రెండవ ఎలిజబెత్ రాణి వచ్చినప్పుడు జరుగుతుంది

ఇప్పుడు కొంత చరిత్రను సింహావలోకనం చేద్దాం తూర్పు ఇండియా కంపెనీని భారతదేశంతో వాణిజ్యం చేసుకొనడానికి అనుమతిస్తూ, ఒకటవ ఎలిజబెత్ రాణి 1600 డిసెంబరు 31 వ తేదీన అధికార పత్రం జారీచేసింది విక్టోరియా రాణి 1858 నవంబరు 1 వ తేదీన భారత ప్రభుత్వాన్ని తమ ఆధిపత్యం క్రిందకు తీసుకున్నారు ఆమె తరువాత రాజ్యానికివచ్చిన ఆమె జ్యేష్ఠకుమారుడు ఏడవ ఎడ్వర్డురాజు వేల్సుయువరాజుగా ఉన్నప్పుడు భారతదేశాన్ని దర్శించారు ఆమె రెండవ కుమారుడు కన్నాట్ ప్రభువు, అనేకసార్లు భారతదేశం రావడమే కాక, బొంబాయిలో నౌకాబల ప్రధానాధికారిగా వ్యవహరించారు కూడాను ఆమె మనుమడు ఐదవ జార్జి రాజు వేల్సు యువరాజుగా ఉన్నప్పుడు, ఆ తరవాత 1911 లో భారతదేశ చక్రవర్తిగా పట్టాభిషేకమహోత్సవం జరుపుకునేందుకు మనదేశం వచ్చారు అప్పుడే ఆయన భారతరాజధానిని కలకత్తానుంచి న్యూఢిల్లీకి తరలించారు ఆయన జ్యేష్ఠకుమారుడైన ఇప్పటి విండ్సర్ ప్రభువు 1921 లో భారతదేశం దర్శించారు ఈయన ఆగమనాన్ని వ్యతిరేకిస్తూ జాతీయకాంగ్రెసు అప్పుడు మహాత్మా గాంధీనాయకత్వాన బహిష్కరణోద్యమం నిర్వహించింది ఇప్పటిరాణితండ్రి కూడా యార్క్ ప్రభువుగా ఉన్నప్పుడు మనదేశాన్ని సందర్శించారు ఆమె తండ్రి ఆరవజార్జి రాజు 1947 ఆగస్టు 15 వ తేదీన భారతదేశానికి స్వాతంత్ర్యం లభింపజేశారు 1950 జనవరి 26 వ తేదీన భారతదేశం రిపబ్లిక్‌గా అవతరించినా కామన్వెల్త్‌లో సభ్యత్వం వదులుకోలేదు ఎలిజబెత్ రాణి కామన్వెల్త్‌కు అధిపతి

రాణిగారి రాకను ప్రజలు ఆసక్తితో నిరీక్షిస్తున్నారు ఇటీవల కాలంలో ఎన్నడూ రానంతటి జనం ఆమెను చూచేందుకు ఢిల్లీ వస్తారు ఇతర విదేశీ అధినేతల పర్యటనల మాట ఎలా ఉన్నా ఆమె పర్యటనలో కొన్ని ప్రమాదాలకు ఆస్కారం కనిపిస్తోంది ఇతర విదేశీ అధినేతలవలె కాక, ఆమె కామన్వెల్తుకు అధిపతి భారతదేశం కామన్వెల్త్‌లో సభ్యత్వం కల రాజ్యం అంటే, ఆమె భారతదేశానికి కూడా సభ్యత్వం ఉన్న ఒక క్లబ్‌కు అధ్యక్షురాలు అన్నమాట అందువల్ల ఆమెను, కేవలం కొత్తగా పరిచయమైన వ్యక్తిగా గాని, ఒక విదేశీ అధినేతగా గాని చూచేటందుకు వీలులేదు ఆమెకు విశిష్టమైన మర్యాదలు జరగాలి

ఉన్న ప్రమాదమల్లా ఇక్కడే ఉన్నది. అది కమ్యూనిస్టుల రూపంలో వస్తుంది ఈ సందర్భంలో తాము ఏమి చేయదలచిందీ వారు (కమ్యూనిస్టులు) దాపరికం లేకుండానే చెప్పారు రాణిగారి ఆగమనానికి వారు సుముఖంగా లేరు అందుచేత బహిష్కరణోద్యమం తలపెట్టారు అమెరికా అధ్యక్షునకు జపానీయులు ఏవిధమైన

స్వాగతం ఇచ్చారో, ఎలిజబెత్ రాణికి మనం అలాంటి స్వాగతమే ఇవ్వాలని దేశీయ భాషలో వెలువడే ఒక కమ్యూనిస్టు పత్రిక వ్రాసింది.

ఇక్కడ కొంత వివరణ అవసరమవుతోంది. ఢిల్లీ కార్పొరేషన్ (నగరపాలక సంఘం) ఏర్పాటైన తరువాత మొదటి రెండు ఏళ్లు కాంగ్రెసేతరవ్యక్తి ఒకరు మేయరుగా (నగరపాలక సంఘాధ్యక్షుపదవి) వ్యవహరించారు. పైనా వ్యవహారంపై, కాంగ్రెసేతర పక్షాలు, కమ్యూనిస్టేతరపక్షాలు కమ్యూనిస్టులతో తమకుగల సంబంధాలను రద్దుచేసుకున్నారు. ఈ చీలికను ఆసరాగా చూచుకొని, కాంగ్రెసుపార్టీ, కమ్యూనిస్టులసహాయ సహకారాలతో కాంగ్రెసువాది నొకరిని ఢిల్లీ కార్పొరేషన్ మేయరుగా ఎన్నిక చేయించింది. మరోవిధంగా చెప్పాలంటే, కమ్యూనిస్టులు పైనాకు అనుకూలమైన విధానాన్ని అనుసరిస్తున్నారని ప్రధానమంత్రి ఒకవైపున బల్లగుద్ది చెబుతుంటే, అదేసమయంలో ఢిల్లీ కాంగ్రెసుపార్టీ మేయరుపదవిని చేజిక్కించుకునేందుకు వారితో (కమ్యూనిస్టులతో) మైత్రి నెరపిన దన్నమాట.

కార్పొరేషన్‌కు సంబంధించిన మరొక ఉదంతంకూడా ఉన్నది. కాంగ్రెసుపార్టీలోని మురాతత్వంమూలంగా అనేకమందికి టక్కెట్లు లభించలేదు అయినా వారు కాంగ్రెసును ఎదిరించి ఎన్నికలలో పోటీ చేశారు. ఇట్లా పోటీచేసిన వారిలో చాలామంది కాంగ్రెసు అభ్యర్థులను ఓడించి, గెలుపొందారు. వీరు ప్రత్యేక వర్గంగా ఏర్పడి, జనసంఘంతోను, కమ్యూనిస్టులతోను పొత్తుకలిపి, కాంగ్రెసుకు పరాజయాలు కలిగిస్తున్నారు. వీరిలో కొందరిని మళ్ళీ కాంగ్రెసుపార్టీ కూడగట్టుకు వచ్చినంగువల, దానికి అధికసంఖ్యాబలం సమకూరింది కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ ఎన్. సంజీవరెడ్డి ఇటీవల కటక్‌లో మాట్లాడుతూ, భారత భూభాగంలోని 12 వేల చదురపు మైళ్ళ వైశాల్యంగల ప్రాంతం ఆక్రమింపబడినప్పటికి, విదేశీయులెవరు గురాక్రమణ జగుపలేదని విశ్వసించేవారినిగూర్చి, ప్రజలకు హెచ్చరిక చేశారు శ్రీ సంజీవరెడ్డి ఈ హెచ్చరికను బుద్ధిపూర్వకంగానే చేసిఉంటే, ఢిల్లీ మేయరు ఏవిధంగా, ఎవరి సహాయంతో ఎన్నికైంది విచారించాలి. గాంధీజీ సిద్ధాంతాలననుసరించి దేశంలో ఖాదీ విక్రయాలు సాగుతున్నాయి మద్యనిషేధం అమలు అవుతోంది కేవలం మేయరుపదవిని దక్కించుకునేందుకు, కమ్యూనిస్టులతో రాజీ పడటం కూడా గాంధీజీ సిద్ధాంతానికి అనుగుణమైన పనేనా? పార్టీకి అధికసంఖ్యాబలం లభిస్తుంది కదాఅని, ఒకసారి కాంగ్రెసు ఆదేశాన్ని తిరస్కరించిన వారిని కూడా మళ్ళీ కాంగ్రెసులో చేరనిస్తే క్రమశిక్షణను అమలు

# న్యూఢిల్లీ లేఖ

చేయటం ఎలా సాధ్యమవుతుంది? దీపంకింద నీడ ఉంటుందని నానుడి. శ్రీ సంజీవరెడ్డి ఢిల్లీలో ఉంటున్నారు కాబట్టి, ఢిల్లీ నగర పాలకసంఘంలో ఏమి జరుగుతోందో ఆయన చూడకపోవచ్చు.

అసలు విషయానికి వద్దాం. రాణిగారు ఢిల్లీకి వచ్చినప్పుడు, కార్పొరేషన్ కాంగ్రెసు పార్టీకి మిత్రులైన కమ్యూనిస్టులు ఏవిధంగా ప్రవర్తిస్తారు అన్నదే చర్చనీయాంశం. మేయరు ఈ విషయమై తమ కమ్యూనిస్టు మిత్రులతో ప్రస్తావించి చూచారా? రష్యా ప్రధాన మంత్రికి కాంగ్రెసువారు, కమ్యూనిస్టులు ఇచ్చినంతటి స్వాగతమైనా రాణిగారికి ఇవ్వడానికి ముందు జాగ్రత్తకోసం తీసుకుంటున్న చర్యలేమిటి? ఆమె రాకసందర్భంలో జుగుప్సాకరమైన సంఘటనలేవైనా సంభవిస్తే, మేయరును ఆయన అనుయాయులను సంజాయిషీ అడగాలి.

* * *

ప్రణాళికా సంఘం తాలూకు మద్య నిషేధ ఉపసంఘం ఇక్కడ సమావేశమవుతోంది. దేశంలో మద్యం అంటూ లభించకుండా చేసేందుకు, ఈ ఉపసంఘం అధ్యక్షుడు శ్రీ శ్రీమన్నారాయణ శాయశక్తుల పనిచేస్తున్నారు.

నిజం నిష్ఠురంగానే ఉంటుంది. నీతి నియమాలను శాసన రీత్యా అమలు చేయటం సాధ్యంకాదు. బొంబాయిలో మద్యనిషేధం అమలులో ఉంది. కాని త్రాగదలచుకున్న వారికి ఏ ఇబ్బంది లేదు. బొంబాయిలో మద్యనిషేధం విజయవంతంగా అమలు అవుతోందని భావించటం కేవలం భ్రమమాత్రమే. ఇటీవల ఒకగొప్ప కాంగ్రెస్ నాయకుడు మాట్లాడుతూ, కమ్యూనిస్టులు అధికారంలోకి వచ్చినా బొంబాయిలో మద్యనిషేధం అమలుచేయడానికి సాహసించలేరని అన్నారు. వారు తెలివి తక్కువగా ఆపని చేసినట్లయితే మద్యనిషేధంవల్ల డబ్బు చేసుకుంటున్న వారి ఓట్లు కోల్పోవలసి వస్తుంది రాజ్యాంగంలోని ఆదేశిక సూత్రాల మాటఎలా ఉన్నా బహిరంగ మద్యపానాన్ని -ముఖ్యంగా క్లబ్బులు మొదలైనవాటిలో- ద్వితీయ పంచవర్ష ప్రణాళికక్రింద నిలిపివేయాలని మద్యనిషేధాన్ని బలపరచేవారు, ప్రధానంగా శ్రీ శ్రీమన్నారాయణ వాదిస్తున్నారు.

ఇక్కడ కొన్ని వ్యాఖ్యలు అవసరమవుతున్నాయి మొదటివిషయమేమంటే ప్రణాళికాసంఘం ఈ సందర్భంలో ఒక సూచన చేసిందేగాని, లక్ష్యాన్ని నిర్దేశించలేదు. ఒక వేళ ఇది లక్ష్యమే ననుకున్నా, ప్రణాళికా సంఘం చేసిన మిగతా సిఫార్సులన్నీ యథాతథంగా అమలు అయ్యాయా? అనే ప్రశ్న ఉదయిస్తుంది.

* * *

దేశంలోని వివిధ ప్రాంతాలలో ఆహార ధాన్యాలను నిల్వచేసేందుకు గిడ్డంగులు నిర్మించే కార్యక్రమాన్ని చురుకుగా కొనసాగించే నిమిత్తం, ఆహార, వ్యవసాయ, నిర్మాణాల శాఖలతో సమిష్టిసంస్థ ఒకటి త్వరలో ఏర్పాటు కాబోతోంది.

గిడ్డంగులపథకాలు తయారుచేసి, నిర్మించేందుకు కేంద్ర పబ్లిక్ వర్క్స్ శాఖలో ప్రత్యేకవిభాగం ఒకటి అదనపు చీఫ్ ఇంజనీర్ ఆధ్వర్యంక్రింద ఏర్పాటైంది. అవాంతర పరిస్థితులను ఎదుర్కొనగలిగేందుకు నిల్వచేయదలచిన 50 లక్షల టన్నుల ఆహారధాన్యాల కోసం గిడ్డంగులను నిర్మించే కార్యక్రమాన్ని, వీలైనంత తొందరలో పూర్తిచేసేందుకే పైనిర్ణయానికివచ్చారు. ప్రభుత్వానికిచెందినవైతేనేమి, అద్దెకు తీసుకున్నవైతేనేమి ఇప్పుడున్న గిడ్డంగులలో 2 లక్షల టన్నుల ఆహార ధాన్యాలను నిల్వచేయవచ్చు. మరో 80లక్షల టన్నుల గింజలను నిల్వచేయడానికి తగు గిడ్డంగులను నిర్మించే కార్యక్రమాన్ని ఆహార శాఖ రూపొందించింది. ★




“సహనావవతు సహనౌ భునక్తు
సహవీర్యం కరవావహై
తేజస్వినా వధీతమస్తు
మా విద్విషావహై
ఓం శాంతి శ్శాంతి శ్శాన్తిః”

ఆశ్రమ ముఖద్వారం వద్ద కూర్చొని శిష్యులు శాంతి పాఠాలను పలుకుతున్నారు. ఉపనిషత్తులను వారు వల్లెవేస్తున్నారు. పద్మాసనాసీనులైన ఆ విద్యార్థులు శాటలను ధరించి ఉన్నారు. నడుములకు ముప్పేటతో దర్భ త్రాళ్ళు ఉన్నవి. ఆ సుస్పష్టవైదికవాక్కు ప్రశాంత వనభూమిలో చాలదూరం వఱకు వినిపిస్తున్నది.

“ఆనందదేవుల ఆశ్రమమిదేనా” ఒక కంఠం ప్రశ్నించింది. ఆ ఛాత్రుల కంఠధ్వనులలో ఆ ప్రశ్న ఎవరికీ వినిపించలేదు. రెట్టించిన కంఠస్వరంతో ఆ ప్రశ్న వినిపించేసరికి వారి దృష్టులా ధ్వని వచ్చిన వైపు మళ్ళినవి. నిశ్శబ్దత అంతట ఆవరించింది.

“మీది ఏ ఊరు? ఎందుకు ఇక్కడికి వచ్చారు?” ఛాత్రులలో పెద్ద అనుకూలుడు ప్రశ్నించాడు.

“నందపురం నా నివాసం. మీలో ఒకడిగా ఉండి విద్య నభ్యసింప వచ్చాను. ఆచార్యదేవులు అనుష్ఠానంలో ఉన్నారా?” ఆ వ్యక్తి ప్రశ్నించాడు.

“ఇలా తాటాకుల చాపమీద కూర్చో. గురువుగారు ఇప్పుడే బయటకు వస్తారు” అనుకూలు డన్నాడు. మళ్ళీ వేదఘోష మొదలైంది. విద్యార్థులు వల్లెవేయటంలో మగ్నులైనారు.

ఆశ్రమం చుట్టూ చాలా పరిశుభ్రంగా ఉన్నది. వర్షపు నీరు చొరనంత దట్టంగా కొన్ని చెట్లున్నవి. వృక్షాలలో ఒక చెట్టు మొదట చక్కని అరుగు ఉన్నది సమీపాన ఇంకా కొన్ని ఆశ్రమాలున్నవి. క్రోశద్వయ దూరంలో వింధ్య పర్వతాలున్నంతగా కన్పిస్తున్నవి. ఆ వ్యక్తి ఆ ప్రాంతాలను పరిశీలించాడు. లోపలినించి ఆచార్యులు రావటం గమనించి విద్యార్థులంతా లేచి వేదిక సమీపానికి వెళ్ళి నిలుచున్నారు. ఆనందదేవులు ఆసనాన్ని అధిష్ఠించారు. శిష్యులంతా ప్రవరలు పలుకుతూ గురువందనం చేసి తమ అర్హతననుసరించి కూర్చున్నారు. నూతనవ్యక్తి ఈ విషయాలను గమనిస్తూ దూరంగా నిలుచున్నాడు.

“అనుకూలా! అతనెవరు?” ఆనంద గురుదేవులు ప్రశ్నించారు.

“అతడు నందపురంనుండి విద్యాభ్యాసానికి తమవద్దకు వచ్చాడు” అనుకూలుడు వినయంగా సమాధానం పలికాడు.

“ఇటు రా నాయనా!”

ఆ వటువు తన ప్రవర చెప్పి గురువులకు సాష్టాంగ నమస్కారం చేశాడు.

“నీ పదివఱకు ఏం చదువుకున్నావు” ఆనందులు ప్రశ్నించారు

“కృష్ణ యజుర్వేదం పితృపాదుల సమీపాన అధ్యయనం చేశాను. ఉపనిషద్భాగం సరహస్యంగా మీవద్ద అభ్యసింపవలసిందని జనకుల ఆదేశం అందువలన తమ శుశ్రూషకై వచ్చాను భగవన్!” అతడు చేతులు జోడించి మనవి చేశాడు.

“మీ పితరులు మాకు మాన్యులు. నీవు దీక్షగా నిర్మల చిత్తంతో విద్య నభ్యసించు. ఏదీ ఒక పనస చెప్పు వింటాను” ఆనందుల పరీక్ష ఛాత్రులకు కుతూహల జనకమైంది.

సుస్పష్టమైన, శ్రావ్యమైన అతని కంఠధ్వని గురువులకు ఆదరాన్ని సతీర్థులకు అభిమానాన్ని కలిగించినవి. తరువాత కొంతసేపు ఆనందులు ప్రవచనం చేశారు. మాధ్యాహ్నికానుష్ఠానం కొఱకు గురువుగారు లేవటంతో శిష్యులు గూడ లేచారు.

“అనుకూలా” ప్రియవ్రతుని మధ్యాహ్న భోజనానికి ఆశ్రమానికి తీసుకురా” ఆనందులు ఆజ్ఞాపించి వెళ్ళినారు.

ప్రియవ్రతుని జ్ఞాపకశక్తి, ఏకాగ్రత, గురుబోధమీద ఉండే లక్ష్యము, ఆచార్యుల నానందపఱచినవి. జపసమయంలోని అతని నైశ్చల్యము శిష్యులకు మార్గదర్శకమైంది. ఉపనిషద్విద్యలో అతనికున్న ఆసక్తి ఆయనకు చాల తృప్తిని కలిగించింది.

“ఆర్యా! మోక్షపథ గాములకు ఈ ఆశ్ర

మూలు అభ్యంతరకములు అవుతవనుకుంటాను. బహుకాలం అయిన తిరువాత గాని సర్వసంగపర్జనం జరుగదు గదా!" ఒకనాడు గురుదేవుల పాద సంవాహనం చేస్తూ ప్రియవ్రతుడు ప్రశ్నించాడు.

"అవును నాయనా! కాలం ఎక్కువ పడుతుంది. కాని పూర్వులు మోక్షప్రయాణాన్ని రెండు విధాలుగా విభజించారు. మొదటిది పిపీలికాగమనము. ఇది సులభము, సామాన్యంగా అందరికీ యోగ్యము. రెండవది విహంగమ గమనము. ఇది కష్టసాధ్యము. ఇది మహాత్ములకు యోగ్యము ఈ మార్గమున వెళ్లువారు పథభ్రష్టులగుటయు కలుగును. ఒకసారి సర్వసంగ సన్యాసం కష్టం, కాబట్టి దానిని క్రమంగా సాధించటం యోగ్యం. కాబట్టే "ఆచార్యాయ ప్రియంధన మాహృత్య ప్రజాతన్తుం మా వ్యవచ్ఛేత్సీః" అని వేదపురుషుని ఆజ్ఞ. "పద్మపత్ర మివాంభసా" అన్నట్లు ప్రపంచంలో కష్ట సుఖాలనుభవిస్తూ సుఖ దుఃఖాలయందు సమభావం కలిగి ఉండటం ప్రధానం" ఆచార్యులు అతని ప్రశ్నలకు సమాధానా లిచ్చారు.

సదూరంగా వింధ్య పర్వతాలలో పుట్టి కుభినీ నది క్రమంగా విస్తరించింది. మోక్షపలమనే స్థానంలో పుట్టింది కాబట్ట దాని పావిత్ర్యం విశిష్టమైనది ఆ నది ఆశ్రమానికి రెండు వందల హస్తాల దూరంలో వేగంగా ప్రవహిస్తుంటుంది. ఆశ్రమవాసులంతా అక్కడే స్నానాదికం చేసుకొని వస్తుంటారు. ఆశ్రమానికి రెండువైపులా నలభై హస్తాల దూరంలో చిన్న వాగులు రెండు ప్రవహిసుంటవి. అవి వేసవికాలంలో గూడ ఆశ్రమవృక్షాలకు ఆధారమవుతుంటవి.

ప్రియవ్రతుడు అక్కడి విశేషాల నన్నిటినీ చూస్తూ సమీపంలో ఉన్న ఒక చిన్న కొండవద్దకు వెళ్ళినాడు. అక్కడ ఒక చక్కని లోయ ఉన్నది. ప్రకృతి దేవత అక్కడ విశ్రాంతి తీసుకొంటున్నట్లున్నది. రెండు సెలయేళ్ళు గలగలమని సన్నని కంఠంతో గానం చేస్తూ ప్రవహిస్తున్నవి. ఆ సెలయేళ్ళు రెండు కలిసి కొద్దిదూరం ప్రవహించినవి. ఆ ప్రవాహంలో చొచ్చుకుపోయి ఒక నల్లని బాయి ఉన్నది. ఆ ప్రశాంత వాతావరణం ప్రియవ్రతుని కవ్యక్తానందాన్ని కలిగించినది. అతడా బండమీద కూర్చున్నాడు. మలుపులు తిరుగుతూ కులుకుతూ ప్రవహించే సెలయేరు ఆ బండమీది నించి చూస్తే అర్ధక్రోశం వఱకు కన్పిస్తుంది ప్రతి దినమూ ప్రియవ్రతుడు అక్కడకు వెళ్ళేవాడు.

కార్తీక మాసంలో శుక్ల షష్టినాడు అనందులు అలవాటు ప్రకారం శిష్యులు వెంట రాగా తెల్లవారు జామున నదీ స్నానానికి బెళ్ళినారు. చీకటిగా ఉన్నందున చెట్లు గుబుగా ఉన్నందున దారి బాగా కన్పించటం లేదు. వారందఱు నడుములకు కొల్లాయిలు బిగించి అఘమర్షణ సూక్తాలు పఠిస్తూ స్నానాల కుపక్రమించారు. అనుకూలుడు ఓరంక స్నానం చేయక నాలుగు హస్తాలదూరం ఈదినాడు. "బాబోయ్" అని కేక వేసి రెండు బారలలో తీరానికి వచ్చాడు.

"ఏమిటి అనుకూలా!" గురువుగారు ప్రశ్నించారు.

అతడు అటువైపు చూపిస్తూ "అదుగో" అన్నాడు. కొద్దిదూరంలో ఏదో ఆకారం నీళ్ల మీద తేలిపోతూ కన్పించింది అనుకూలుడు భయంతో చలితో వణికిపోతూ "మనుష్యశవం" అన్నాడు. వెంటనే ప్రియమిత్రుడు ఈదుతూ వెళ్లి ఆశవాన్ని ఒడ్డుకు చేర్చాడు.

"ఈ వ్యక్తి మరణించినట్లు లేదు. ఆశ్రమానికి చేర్చండి" నాడి పరీక్షించి గురువుగారన్నారు. శిష్యులా ఆజ్ఞను నిర్వర్తించారు.

శిశిరంలో ఆకురాలిన వృక్షాలు వసంతానుగ్రహంతో మృదుల కిసలయ రాగరంజితాలవుతవి వసంతసఖుని అనుగ్రహంతో మానవ జీవితాలు కూడా ఒకప్పుడు రాగరంజితాలవుతవి. కాని అక్కడ ప్రకృతి మరో రూపంలో ప్రత్యక్షమవుతుంది. ప్రియవ్రతు డేకాంతంలో ఆ నల్లని బండమీద కూర్చుని ప్రకృతిని పరిశీలిస్తున్నాడు. "ప్రియవ్రతా!" దూరాన్నించి ఒకమధురస్వరం వినిపించింది. ఆ వ్యక్తి అతనికి బాగా తెలుసు.

"మమతా! నీవు ఇక్కడకు రావడం చాల ఆశ్చర్యకరంగా వుంది."

"ఏం నీవు ఒక్కడివే ప్రకృతి సౌందర్యం చూచి సంతోషిద్దామనుకున్నావా?"

"అది కాదు, ఈ చోటు నా సహాధ్యాయులకే తెలియదే నీకెట్లా తెలిసింది?"

"ప్రియవ్రతా! నీవు ఎప్పుడెక్కడ వుంటావో, ఏం చేస్తుంటావో నీకంటేముందు నాకే తెలుస్తుంది" మమత బండమీదికెక్కి కూర్చొని అన్నది.

"నీవు ఒంటరిగా ఇంతదూరం రావటం మంచిది కాదు మమతా."

"నీవు రావటం మంచిదైతే నేను రావటం మంచిదేలే. దీకాక ఇంతదూరం అధైర్యంగా వచ్చినందుకు నన్నభినందించక మంచిది కాదంటావేం." మమత అతనితో ఉత్సాహంగా చనవుగా మాట్లాడుతుంది. ప్రియవ్రతు డేవిధంగా మాటాడినా సమాధానం చెప్పి నిరుత్తరునిగా చేసుంది. చివరకు ఇద్దరూ నవ్వుకుంటారు. అది వారి అలవాటు, సరదా.

"ప్రియవ్రతా! గురువుగారు ఇవ్వాళ పూల చెట్లపాదులు బాగుచేసి నీరుపెట్టమని ఉదయాన చెపితే అది మానేసి ఇక్కడ గడ్డం క్రంద చేయిపెట్టుకొని ఆలోచిస్తూ కూర్చున్నావా?" ఆకాశంలోకి చూస్తున్న ప్రియవ్రతుడు ఆమె మాటలను విని ఉలిక్కిపడి- "మరచిపోయాను మమతా!" అంటూ బండమీదినించి క్రిందకు దూకి పరుగెత్తుతున్నాడు అతని తొందరపాటుకు మమత కిలకిల నవ్వుతున్నది. సెలయేరు ఆమెతో శ్రుతి కలిపింది

"ప్రియవ్రతా! ఇటురా" ఆమె పిలుపుకు వెనుదిరిగి వచ్చాడతడు. ఆమె యింకా నవ్వుతూనే ఉంది ఆమె కన్నులలో చిలిపితనం కనిపించింది.

"ఎందుకు పిలిచావు?"

"ఇటురా, ఇక్కడ కూర్చో. నీ బదులు నేనాపని చేసివచ్చాను."

"కృతజ్ఞుడిని మమతా!" అతడు స్వస్థానంలో కూర్చుంటూ అన్నాడు.

"నీవు మరచిపోయిన పనులన్నీ నేనుసర్దుకు రావలసి వస్తున్నది." మమత అన్నది.

"దీనికి కారణం నీవే అయినా ఈ కష్టం కొద్దిరోజులవరకే. తరువాత నీకు నా పనుల బాధ్యత ఏమీ వుండదు" ప్రియవ్రతుడన్నాడు.

"ఏం తరువాత ఈ బాధ్యత ఎవరికైనా అప్పగిస్తావా?" ఆమె కుతూహలంతో అడిగింది.

"ఇక్కడినించి వెళ్లిపోయిన తరువాత ఏమవుతుందో చెప్పలేను."

"అయితే నీవు అప్పుడే వెళ్లిపోతావా" ఆమె ఉదాసీనంగా అన్నది

"నా అధ్యయనం పూర్తయింది. ఇంక కొద్ది దినాలలో నే సమావర్తనం చేయవలెనని గురుదేవుల ఆదేశం." మమత నీళ్లలో కాళ్లు ఆడిస్తున్నది.

"నీకంటే నేనే ముందు వెళుతున్నాను ప్రియవ్రతా!"

"ఎక్కడికి మమతా?" అతడు ఆదుర్దాగా ప్రశ్నించాడు.

"నేనిక్కడ ఆశ్రమంలో వున్నానని మా జననీజనకులకు తెలిసింది. ఇంతకుపూర్వమే మా నాన్న వచ్చారు రేపు ప్రభాతకాలంలో మా ప్రయాణం."

"నేను గుర్తుంటానా మమతా?" ఆమె కన్నులలోకి చూస్తూ అడిగాడతను.

"ప్రియవ్రతా! నా మనస్సు స్వతంత్రమే. కాని శరీరం. "

"అంతే చాలు మమతా! నా జన్మధన్యం. నీవు నా మనస్సులో ప్రత్యక్షమవుతూనే

(62వ పేజీ చూడండి)

ఉపాధ్యాయుడు—పరస్త్రీలను తల్లులుగా, అక్కా చెల్లెళ్లుగా చూడవలెను.

విద్యార్థి—అయితే నాకీ జన్మలో పెళ్ళి కాదండి.

—క. రమేష్ (విజయనగరం)



# తెలుగు వెలుగులు 61

బుద్ధికీ ఆలోచనకీ చాంచల్యం తీసుకొచ్చే గుణం చూపులకు సహజం. చూడని వాడు అంతర్ముఖు డౌతాడు. అటువంటి వ్యక్తి శ్రీ మారెళ్ళ కేశవరావు.

మొదటిశ్లోకం క్రౌంచ మిథునంమీద కలిగిన కారుణ్యంచేత వాల్మీకి పెదవులనుండి ఉట్టిపడింది. ఆంధ్రావనికి ఏకైక వ్యవస్థఅని, కీర్తి తెచ్చుకున్న విజయనగర సంగీత కళాశాల కరుణారసంలోనే రూపుగొన్నది. శ్రీ విజయరామ గజపతిరాజావారికి దృష్టి పోవడం సంభవించింది. తమ ఆశ్రితుల్లో చాగంటి గంగరాజనే అంధబాలుడు ఉన్నాడని తెలిసింది అతనికి సంగీతం చెప్పిస్తే వస్తుందని తెలిసి వారికి కారుణ్యం వెల్లివిరిసింది. ఆ బాలునికోసం అమితధనం ఖర్చు పెట్టి సంగీత కళాశాలను స్థాపించారు.

శ్రీ ద్వారంనాయుడుగారు అనేకమంది అంధగాయకులకు సంగీతం చెప్పడమే కాకుండా వారు ఆంధ్రదేశానికే ఒక ప్రత్యేకత, కీర్తి తెచ్చే అంధగాయకులను తయారు చేశారు. ఈ విషయంలో శ్రీ నాయుడుగారు స్త్రీ పురుష వ్యత్యాసం కూడా చూపించ లేదు. యువకుల్లో శ్రీ మారెళ్ళ కేశవరావు విశిష్టుడు ఆగాన పాఠశాల పాత విద్యార్థి.

శ్రీ కేశవరావు బరంపురంలో పుట్టి పెరిగాడు. బరంపురంలోనే అంధుడైన ఒక వాయులీనవిద్వాంసునివద్ద కొంతకాలం వాయులీనం అభ్యసించాడు. తదుపరి విజయనగరంవచ్చి శ్రీ విజయరామ గానకళాశాలలో విద్యార్థిగా చేరి శ్రీ ద్వారం నాయుడుగారి శిష్యరికంచేసి విద్వాంసులలో మేటి అయినాడు.

శ్రీ కేశవరావు ఇంకా చిన్నవయస్కుడే. ఉజ్వలమైన వర్ణంలో సన్నగా బంగారు తీగెలా పొట్టిగా ఉంటాడు. మాటాడే టప్పుడు చిరునవ్వు తొణుకుతుంది. మాటల్లో మిన్నతనం.

అల్పవయస్సులోనే అతని జుత్తు నెరసిపోయింది. మిత్రులు హాస్యానికి "సంగీతంతో కేశవరావు బుర్ర పండిపోయింది" అంటే అందుకు జవాబుగా అతను—బోడిగా బుర్ర వాడిగా కట్టేసి చుల్కనగా మీపోటి పెద్దలు చూడకుండా ఉండేందుకు నెరసిందంటాడు.

సంగీతానికి తండ్రి లయ. తల్లి శ్రుతి. ఈ మధ్య పెద్దవిద్వాంసులు పితృవాత్సల్యం అధికం చేసుకుని తల్లిని నిరాదరించడం జరిగింది. అందుకే శాస్త్రీయసంగీతానికి ప్రజల్లో పలుకుబడి సన్నగిల్లింది. యువకులయిన సంగీత విద్వాంసులు ఈ విషయం తెలుసుకుని తల్లి మీద ప్రేమ చూపేందుకు తహ తహ పడుతున్నారు. అటువంటివారిలో కేశవరావు అద్వితీయుడు. కేశవరావు సంగీతానికి ప్రాణం, ఆత్మకూడా సుస్వరమే. కర్ణాటక సంగీతానికి గమకం వెన్నెముకలాంటిది. శ్రీ కేశవరావు సంగీతం గమక భూయిష్ఠమైనది. గమకాన్ని విస్మరించిన కర్ణాటక సంగీత విద్వాంసులు కూడా కేశవరావు సంగీతానికి విభ్రమం చెంది వేనోళ్ల పొగడుతారు.

కళాద్రష్ట అయినవాడు తన కళాపరిమితి, పరిమాణం, పరిధులు గ్రహించి తన కళను వినియోగించేవాడని పెద్దలంటారు. ఈ సూక్తిని మనోవాక్కాయ కర్మల తెలిసి కాని అక్షరాలా ఆచరణలో పెట్టినవాడు శ్రీ కేశవరావు.

'రవ' వాయించడంలో శ్రీ కేశవరావుది అద్వితీయప్రతిభ. అసాధారణుడు అయితే నే గాని అంతటి 'రవ' వాయించడం అసాధ్యం.

అఖండ మేధాసంపన్నుడైనవాడి సంగీతం వింటే అనిర్వచనీయమైన అంతులేని సౌఖ్యాన్ని పొందటమే కాకుండా మర్త్య జీవిత అసంపూర్ణత గోచరించి విషాద చ్ఛాయ అలముకుంటాయి. సుఖోదయ వ్యథాభంగాలలో తేలిపోతాం. శ్రీ కేశవరావు సంగీతం కన్నెవలపులా కౌముదీజ్యోత్స్నలా విన్నవారిని సుఖపెడుతుంది హృదయానికి పన్నీరై, పచ్చకర్పూరమై చల్లదనాన్ని, పరిమళాన్ని ప్రసాదిస్తుంది శ్రీ కేశవరావు సంగీతం మల్లెపూవుల వాసనలా, మంచి గంధంలా, మలయమారుతంలా, మరికొంచెం ఉంటే బావుండుననిపిస్తుంది.

బాహ్య ప్రపంచాన్ని చూడలేకపోయినా అంతరంగంలో నాదబ్రహ్మను సాక్షాత్కరింప చేసుకున్నవాడు శ్రీ మారెళ్ల కేశవరావు. 




రాముడంతటివాడు రమణి సీతను బాసి పామరునిలాగా ఏడవగాలేంది; శంకరం తనభార్యకోసరం అంతకంటే ఘోరంగా ఆవురావురుమని ఏడవడంలో ఆశ్చర్యం లేదనుకొంటాను. అయితే; ఆనాటి రాముడు అలా ఏడవడానికీ; సీత అలా మాయం కావడానికీ—అల్లాగే రావణాసురుడు చెఱపట్టడానికీ—ఏవో కొన్ని కారణాలున్నాయనీ; అంచేతనే అదంతా అల్లా జరిగిందనీ అన్నారు; అంటున్నారు గనుక, మనమూ సరేననేశాం; మనముందు తరాలవాళ్ళు కూడా అల్లాగే అంటారు; (దేవుడు మేలుచేస్తే) అనాలి కూడాను.

అయితే ఈ శంకరం అంతటి ధీరోదాత్త నాయకుడూ కాదు; అతనిభార్య (పేరు తరువాత చెప్తాను) సీత అంత—కాదు. అయితే ఈకథకూ రామాయణకథకూ పోలిక ఎందుకు పెట్టాలనీ—ఆ ప్రసక్తి ఎందుకు తేవాలనీ—మీరు నిలవేస్తారనీ నాకు ముందుగా తెలుసు గనుకనే—అసలు జరిగిందేమిటో వున్నదున్నట్టు చెప్పేస్తాను.

అసలేం జరిగిందంటే: తెలుగుదేశపు ఒక బస్తీలో ఒకానొక శుభదినాన, మధ్యాహ్నం రెండున్నరగంటలవేళ, ఒక నవదంపతుల జంట 'సినిమా' చూడ్డానికని బయల్దేరింది. యిద్దరికీ పెళ్ళయిన కొత్తరోజులు. ఎటు చూచినా పగలైనా, ఎండైనా, అంతా వెన్నెలగానే కనిపిస్తుంది వాళ్ళకు. అల్లా కనిపించడంగూడా తప్పేమీ కాదనుకుంటాను. అందులోనూ అతగాడు స్వతంత్ర జీవి. అంటే తన సంపాదన తాను సంపాదించుకోగలిగిన ఉత్తముడు. దానికితోడు—అత్తగారిల్లు కూడా యింతవున్న కొంప దొరికిందేమో,—అతగాడిపని మరీ కమ్మగా వుంది. అంచేత యింతకంటే శుభ ముహూర్తం దొరకదనో—లేక రాత్రిలో కొంతభాగం 'సినిమా' హరించేస్తుందనో—ఏమో—మిట్టమధ్యాహ్నం రెండు గంటల ప్రాంతాల్లో భార్యను వెంటబెట్టుకొని మహా

హుడావుడిగా సినిమాకు బయల్దేరాడు. అసలే పెళ్ళయినకొత్త; అంచేత, విచ్చీ విచ్చని పువ్వులాగే—ఆ దంపతులమధ్య సిగ్గుకూడా ఆరీ ఆరకుండా వుంది. అట్లాభార్యను వెంటబెట్టుకుని తలొంచుకొని; నోరెత్తకుండా, ఒకరివెంట ఒకరు పోతూనేవున్నారు. పోగా పోగా, కొంతదూరం గడిచేసరికి; ఎదురైన రిక్షాలను ఆపి—ఒకదాన్ని చూపించి; "ఇందులో ఎక్కు" అన్నట్టు రిక్షావేపు చూపించాడు భర్త. "మరి మీరో" అన్నట్టు కళ్ళతోనే భాషించింది వనిత.

"నా కదీ!" అన్నట్టు తలతోనే సమాధానం చెప్పాడు అతగాడు.

ఏమైతేనేం—రిక్షాలు ఒకదానివెంట ఒకటి ఝామ్మని పరిగెడుతున్నయ్. ముందు రిక్షాలో మొగుడు; వెనుకరిక్షాలో భార్య.

కాని ముందురిక్షా తొక్కేవాడు బలవంతుడు కావడంచేతనో ఏమో—తనముందు పోయే రిక్షాలను సాధ్యమైనంత ఎక్కువగా 'ఓవర్ టేక్' చేసుకుంటూ పోతున్నాడు. వెనుకరిక్షావాడు చిన్నవాడూ బలహీనుడవడంచేత ననుకుంటాను వాడు మరీ మరీ వెనుక పడిపోతున్నాడు. దానికితోడు వాడా రిక్షాను ఎంత ప్రమాదకరంగా నడుపుతున్నాడంటే—ఏక్షణాన్నైనా ఏ కారుకో, గోడకో గుద్దేసేట్టున్నాడు. ఈ ప్రమాదావస్థను పసిగట్టిన ఓ పోలీసు; గిర్రున తన సైకిలును వెనక్కుత్రిప్పి ఈ రిక్షాను (ఫాలో) అనుసరించడం ప్రారంభించాడు. నిప్పంటేనే తప్ప పొగరాదన్నట్టు, ప్రమాదముంటేనే తప్ప పోలీసులుకూడా వెంటబడరనేది కూడా నిజమే అయ్యింది. ఇంతలో ముందురిక్షా—అలా 'ఓవర్ టేక్' చేసుకుంటూ చాలా దూరం పోయింది. సాధ్యమైనంతవరకు వెనుకరిక్షాలోని భార్య—తనభర్త రిక్షాను గుర్తెట్టుకుంటూనే వుందిగానీ; మధ్యలో కొన్ని రిక్షాలొచ్చి కలిసేసరికి; ఏది తన భర్తదో—ఏది కాదో గురించలేక—యిహ మానేసింది. కాని వెనుకవున్న పోలీసు మాత్రం తన 'అనుసరణ' మానలేదు. ఇహ ప్రమాదం సంభవించబోతున్నదనగా ఆ రిక్షాను నిలవేసాడు. కాని ముందుపోయే రిక్షా యిదేదీ పట్టించుకోకుండానే తిన్నగా తనగమ్యస్థానమైన సినిమాహోలు దగ్గర ఆగింది. అందులోంచి ఆయన దిగి, రిక్షావానికి డబ్బులిచ్చేసి, తన భార్య రిక్షాకోసరం వెనక్కు తిరిగి చూడడం ప్రారంభించాడు.

అతని పేరే శంకరం.

ఎంతసేపు చూసినా రిక్షారాదు. వచ్చే ఏ రిక్షాల్లోనూ-తన భార్యా కనిపించదు! నల్లచీర గట్టిన ఆడదల్లా తన భార్యేనని భ్రమపడ్డ పక్షిలాగే-యితనుకూడా చీర కనుపించిన చోటల్లా రెండు కళ్ళతోనూ తీవ్రంగా చూసేవాడు. కాని ఫలితం శూన్యం.

# సతీవియోగం

మొదటి పావుగంటలోనూ, అతనిలో ఏమార్పు రాలేదు గానీ, సిగరెట్టు వెలిగించి నాలుగు అడుగులు మళ్ళీ వెనక్కు బాగా రోడ్డు మీద కొచ్చి మరింత బాగా పరకాయించి చూడ్డం మొదలుపెట్టి నప్పట్నుంచీ-అతనిలో 'వికారం' ప్రారంభమైంది. ప్రాథమికదశలో నెత్తురు చల్లబడిపోతున్నట్టుగానూ, ఆ తరువాత కాళ్ళలో, కళ్ళలో సత్తువ ఉడిగిపోతున్నట్టుగానూ, ఆపైన తల దిమ్మెక్కినట్టుగానూవుంది, "ఏమిటీ రిక్షా ఎంత వెనకబడితేమాత్రం యింతసేపా?" అని ఆలోచించడం ప్రారంభించినప్పట్నుంచీ-అతనికి చెవుల్లోనుంచి అదేదో సముద్రపు హోరులాగా అయోమయశబ్దాలు వినబడడం తప్ప ఏదీ స్పష్టంగా వినపడటం లేదు. అంచేతనే—ప్రక్కగాపోయే పాదచారుల మందలింపులూ — మరోదశలో — బండ్లవాళ్ళ హెచ్చరికలూ అతను పొందవలసి వచ్చింది. ఇహనిరీక్షించి లాభం లేదనుకొని—వెంటనే మరో రిక్షాచేసుకొని-రాబోయేరిక్షాకు ఎదురు ప్రయాణమయ్యాడు. ఎంత దూరంపోయినా, వొచ్చేరిక్షాలు వొస్తూనేవున్నయ్ గానీ, ఎందులోనూ తనభార్య కనుపించదు. భూమి గుండ్రంగా వున్నట్టే—మొదట బయల్దేరిన-చోటువరకు-అంటే రిక్షాఎక్కినచోటువరకు వచ్చాడు. అక్కడా కనిపించలేదు. ఇకలాభం లేదని సరాసరి ఇంటికే వెళ్ళాడు. కాని వేసిన తాళం వేసినట్టే వుంది. ఆ తాళాన్ని చూసేసరికి అతని గుండె అకస్మాత్తుగా బ్రద్దలవలేదుగానీ-దాదాపు బీటలువారిందని ఖచ్చితంగా ఒప్పేసుకోవచ్చు. సరిగ్గా అట్లాంటి స్థితిలోనే మళ్లీ మరో రిక్షా చేసుకొని తిరిగీ సినిమాహోలుదగ్గరకు రయ్యమని చేరాడు. కాని అక్కడ గాలించినా ఆ భార్య కనిపించలేదు. సరిగా అప్పట్నుంచే సరయిన—మానవ సహజమయిన మానసిక ఆందోళన పెద్దపెట్టున ప్రారంభమైంది. మనస్సు అనబడే క్రూరమృగం—తన జాంతవిక లక్షణాన్ని ప్రదర్శించడం ప్రారంభించింది. ఒకదశలో భార్యపట్ల నిర్దాక్షిణ్యమైన కసి మరోదశలో తనపట్ల తనకే ఏహ్యాభావం కలగడం ప్రారంభించింది. మనస్సులో తుఫాను బయల్దేరింది తరవాత సహజమైన యుక్తాయుక్తవిచక్షణాజ్ఞానం లుప్తమైపోతుందనేది కూడా నిజమే! అంచేతనే అతను ఏ నిర్ణయానికి రాలేకపోతున్నాడు. అసలు రిక్షా ఏమైనట్టు? ఆవిడ ఎక్కడ ఎందుకు ఆగినట్టు? ఈ ప్రశ్నలకు అతనికి సమాధానం లభించలేదు. దానితో అతని అంతరాత్మలో మరింత ఘర్షణ ప్రారంభమైంది. అదీగాక ఈ ఊళ్లో ప్రయాణాలు, అందునా, రిక్షాల్లో ఆడవాళ్ళ ఒంటరి ప్రయాణాలు-తత్కారణంగా, అక్కడక్కడ చెదురుముదురుగా జరిగిపోయిన ఘోరాలు అతనికి బాగా తెలుసు. "అమ్మగారూ! దగ్గర దారిన పోదాం" అని చెప్పి రోడ్డు మార్చేసి, - ఆడవాళ్ళను అడ్రసులు లేకుండా హతమార్చేసిన సంఘటనలు మొన్న మొన్నటిదాకా జరుగుతూనే వున్నయ్. అందులోనూ ఆడవాళ్ల వొంటిమీద విలువైన నగలున్నా - నగలున్న చిన్నపిల్లలైనా ఒంటరిగాబయటికెళ్లి తిరిగి ఇంటికి రావడం అంటే-దక్షయజ్ఞం చేసినంతఘనంగా మొన్నీమధ్య వరకూ చెప్పుకుంటూనే ఉన్నారు. అట్లాంటి ఈ ఊళ్లో-ఏక్షణాన్న ఏం జగుగుతుందో ఎవరు చెప్పగలరు? అంచేతనే అతనికీ ఏమీ తోచడంలేదు. జేబులో పర్సు పోగొట్టుకొన్నవాడిలాగా; రైల్లో పెట్టె మర్చిపోయినవాడిలాగా; జూదంలో సర్వస్వం పోగొట్టుకొన్నవాడిలా - దిగాలు పడిపోయి హోలుదగ్గర కొయ్యబొమ్మలాగా నిలబడ్డ శంకరాన్ని-అతని మిత్రులు సూరి; గిరి; జాన్‌లు ఒక్కసారే చూశారు. అతన్ని చూడ్డంతోనే వాళ్లకెంత సంతోషం కలిగిందంటే- అకస్మాత్తుగా ఆడది కన్నుగీటినా అంత ఆశ్చర్యపడి వుండరు. అసలే సూరి విఫలనటుడు. బాగా చదువున్నా; నాటకాల వ్యామోహంలోపడి - హాస్యపాత్రల్లో రాణించాలని-రాణించలేక ఆగిపోయినవాడు. దాని తాలూకు ఛాయలు నిత్యజీవితంలో అక్కడక్కడా ప్రదర్శిస్తూనే వుంటాడు.

గిరి, కేవలం నిత్యశంకితుడు. ఎందులోనైనా ఏదో ఒక ప్రమాదం నిహితమై వుంటుందంటాడు. ఇహ జాన్, జన్మతః ముస్లిమ్ అయినప్పటికీ - హిందూవిద్యాలయాల్లో ఎంత చదివినప్పటికీ-ఉభయభాషలకూ మధ్య యిరుక్కుపోయిన మనిషి. మానవత్వం దృష్ట్యా చూస్తే తెలుగువాడికున్నంత కుట్ర కుళ్లూ యితనిలో లేవు ప్రతీకారానికున్నంత తీవ్రతే - పరోపకారంపట్ల కూడా ప్రదర్శించే వ్యక్తి. ఈ ముగ్గురూ, - శంకరాన్ని అమితంగా అభిమానిస్తారు; ఆదరిస్తారు; అవసరమొస్తే తంతారు. శంకరాన్ని చూడ్డంతోనే "హాల్లో మిస్టర్ హసాడుయు

ఉపాధ్యాయుడు - గడియారం 13 గంటలు కొట్టితే ఏ సమయం సూచించినట్టు?

విద్యార్థి - దానిని మరమ్మతు చేసే సమయమండి.

—పి. శివానందం (పాదిర్వేడు)

డూ?" అంటూ తెలుగు సినిమా పాటలా పాడడం మొదలెట్టాడు సూరి.

శంకరం నోరెత్తలేదు.

"ఏం రా? బెల్లంకొట్టినరాయల్లే నిలబడ్డావేం? ఏం జరిగింది?" అనడిగాడు నిత్యశంకితుడు గిరి.

అయినా శంకరం మాట్లాడలేదు. అటూ ఇటూ చూడ్డం మొదలెట్టాడు.

"అరె మిస్టర్ షెంకరం; హింతకుముందే గదయ్యా నీ పేరూ అన్కున్నాం. పెళ్ళీ అయ్యిం తరవాత షెంకరం గాయబ్ అయ్ పొయ్యాడని ఏంవయ్యా - పత్థర్ లాగా పలకవ్?" అన్నాడు జాన్.

మరోక్షణం తర్వాత దీర్ఘంగా నిట్టూర్చి; నెత్తి మీద చేత్తో కొట్టుకొని, "నా ఖర్మ-అంతా నా ఖర్మ!" అన్నాడు శంకరం.

ముగ్గురు స్నేహితులూ ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు.

"అది కాదురా? ఏమిటి? ఏమైంది?" అనడిగాడు సూరి.

"ఏమీ కాలేదు!"

"మరైతే పద; సినిమాకుపోదాం"

"నా బతుకే సినిమాగా తయారైంది."

"ఏం భార్య విడాకులిచ్చేసిందా?" అనడిగాడు గిరి నవ్వుతూ

వాడి ముఖంలోకి అదోలా చూసి; నిస్సహాయంగా; పులి మేకను క్షమించినట్టు క్షమించేశాడు.

జాన్ ధైర్యంచేసుకుని; "చూడుభాయ్! నీకూ వొచ్చిందీ - ఖష్టమా; మతిభ్రమణమా?" అన్నాడు

"రెండూ ఒక్కసారే వొచ్చినయ్!" అన్నాడు శంకరం.

"అయితే కష్టమేమిటో చెప్పు; మతిభ్రమణానికి ఆ తరువాత తాపీగా విశాఖపట్నంపో వచ్చు." అన్నాడు సూరి.

"అవునవును. ఎగుటివాడి వేదన పక్కవాడికి ఆటగానే వుంటుంది. మీకు పుణ్యం వుంటుందిగానీ-ఈ ఒక్కరోజుకు నన్నిలా వొదిలెయ్యండి; నాకేమీ మనస్సు బావు లేదు" అన్నాడు శంకరం వైరాగ్యంగా.

"నువ్వలాటి గాదురా! వున్న సంగతేమిటో చెప్పకుండా అట్లా ముఖం ముడుచుకుంటావేం?" అన్నాడు సూరి.

"మా ఆవిడ కనుపించడం లేదు రా?" అన్నాడు అర్ధాంతరంగాను.

గిరి; జాన్ వేపు ప్రశ్నార్థకంగా చూశాడు.

మరో క్షణం తర్వాత, "కనిపించకపోవడమేమిటి? అంటే లేచిపోయిందనా నీ భావం?" అనడిగాడు గిరి

శంకరం పిడికిలి అనవసరంగా బిగించి; "అది కాదురా పక్షీ." అని సంబోధిస్తూ-వున్న సంగతేదో వివరంగా చెప్పాడు.

అంతా విని, "యాఖుదా. క్యాముసీబత్ ఆయారే." అన్నాడు జాన్ మనస్ఫూర్తిగా.

"ఏమై వుంటుందీ?" అన్నాడు సూరి అదేదో తెలివిగా.

"అది తెలిస్తే నాకీ ఏడుపెందుకు" అన్నాడు శంకరం.

ఆ క్షణాన అతని కళ్ళల్లో నిజంగానే నీరు తిరిగింది

"వొరే! యిట్లాంటి విషయాలకు మనమూ యిట్లా జావ జావ అయిపోతే-మనకే కాదు, దేశానికే అప్రతిష్ఠ. ఆడదంటే రెండు వేపులా పదునున్న కత్తి! దారితప్పితే-మనం చేరుకోలేంగానీ, - వాళ్ళకేమీ భయంలేదు; అందులో ఈ రోజుల్లో, అంతగా అయితే ఆడవాళ్ళు యిట్టే "ఆశ్రయాన్ని" సంపాదిస్తారు." అన్నాడు సూరి.

శంకరాని కెందుకో మనస్సులో భగ్గుమంది "అలా అనకురా సూరీ! నే భరించలేను! ఆవిడఅనాథ అయి,ఏ చెట్టుక్రిందో,పుట్టమీదో పడి వుంటుందను; నా మనస్సుకు శాంతి వుంటుంది." అని మరో క్షణం ఆగి; ఆవిడ వొఠ్ఠి అమాయకురాలు రా సూరి? ఎవరేం చెప్పినా నమ్మేస్తుంది. అంగునా ఆవిడకు యింటినంబరూ, వీధిపేర్లూ కూడా సరిగ్గా తెలియవురా!" అన్నాడు శంకరం.

"అయితే ప్రమాదమే! ఆ రిక్షావాడు బాగా బలంగా వున్నాడా? నల్లగాబొద్దుగా వున్నాడా? చారల బనీనుందా?" అని ప్రశ్నలు మొదలుపెట్టాడు గిరి.

శంకరం నిట్టూర్చి నీ ప్రశ్నలకు నే సమాధానం చెప్పలేను. ఇవన్నీ పరీక్షించాల్సిన అవసరం అప్పుడు నాకెందుకు కలుగుతుందీ?"

"పోనీ వాడి రిక్షానెంబరు తెలుసా?"

శంకరం చెప్పలేకపోయాడు.

"అంతా జాదూలాగే వుందే!" అన్నాడు జాన్ తీవ్రంగా ఆలోచిస్తూనే

"సరే యిట్లా నిలబడి ఆలోచిస్తే ప్రయోజనంలేదు. ముందా హోటలుకుపోయి కాస్త కాఫీ త్రాగి ఆ తరువాత ఆలోచిద్దాం" పదండి అని దారితీశాడు సూరి.

కాఫీ త్రాగింతరువాత; ఏదో గొప్ప ఐడియా వొచ్చినవాడిలాగా; "ఒరే! ఆమె మెళ్లో ఏమన్నా జ్యూయలరీ వుందా?" అని అడిగాడు గిరి

"ఆ మాట నెమ్మదిగా అంటావేంరా? నా ప్రాపర్టీ అంతా ఆవిడ మెళ్లోనే వుంటేనూ! అంగుకొక్కదూ, నాకీభయం - ఏడుపూనూ! ఆ నగలే లేకపోతే, ఆవిణ్ణి గురించి, - మరింత నిశ్చింతగా ఆలోచిద్దును. ఆ ప్రాణాని కెంత కష్టం కలుగుతుందోగదా అనే నా ఏడుపు!" అన్నాడు శంకరం.

మరోక్షణం ఆగి; "చూడు శంకరం; పోనీ ఏదైనా డైలీకి ప్రకటన పంపేసే! 'సంచిపోయినది,' "దూడ కనుపించడం లేదు" అనే ప్రకటనల్లాగా!" అన్నాడు సూరి.

# సతీ వియోగం

"అట్లా అయితే నగలవిలువ తెలిసిపోదూ? అప్పుడు మరీ ప్రమాదం. ఎవడికన్న నిజంగా కనిపించినా మనదాకా ఆ విణ్ణి తీసుకొస్తాడన్న నమ్మకమేమిటీ? అంత మంచివాళ్ళు కూడానా ఈ రోజుల్లో!" అన్నాడు నిత్య శంకితుడు గిరి.

"దేఖో భాయ్! యహ్ తో బడే ముష్కిల్ కీ బాత్ హై! లైకిన్. చూడు షెంకరం. కాలం యిట్లా ఖర్చుపెట్టి ఫాయదా లేదూ! జైసా నసీబ్ మే లిఖా హై—వైసే హీ హోగా! పరేషాన్ హోనేకీ కోయీ జరూరత్ నహీ హై!" అగర్ కోయీ కామ్ కర్ నాచాహే, తో ధీరజ్ కీసాత్ కరేంగే!" అన్నాడు జాన్

ఆ బాష వినేసరికి నూరికి మండింది. "ఒరే సాయిబూ! మాట్లాడితే పూరిగా వుర్దూలో మాట్లాడు; మానేస్తే—తెలుగులో మాట్లాడు. అంతేగానీ—ఉభయ భాషల్లోనూ వాగావంటే పళ్ళూడదంతాను!" అన్నాడు నూరి; తనకున్న చనువుకొద్దీ.

నూరి అంటే జాన్‌కు కొంచెం జంకు. శంకరం శరణుజొచ్చిన వాడిలాగా; "చూగు భాయ్ షెంకరం; మాటకూ ముంగూ, జాతిపేరు హేంగుకూ? మైహరగిజ్ నహీమానతా!" అన్నాడు జాన్

"అఘోరించావులే వూగుకో! వాడసలే భార్యపోయి ఏడుస్తుంటే—ఖుదా అంట గోంగూరంట" అన్నాడు నూరి.

"అరె—మాట—భేదంకానీ—మతలబ్ ఒకటేనోయ్!" అన్నాడు జాన్.

"మతలబో, గితలబో, నువ్వూరుకో కాస్సేపు! అంతగా స్నేహధర్మంగా నువ్వేదైనా సాయం చెయదలిస్తే శారీరకంగా చేద్దువుగానీ,—భాషతో మాత్రం చెయ్యకు" అన్నాడు నూరి

ఇంతలో ఏదో పెద్ద ఆలోచన తోచిన వాడిలాగా; "శంకరం నువ్వేమీ అనుకోకుండావుంటే, మనం ఒక ప్రయత్నంచేసి చూద్దామని వుంది 'చిట్కా' ఏ అనుకో—ప్రమాదం లేంది!" అందరూ ఆశగా వినడం సాగించారు జ్యోతిష్యం మీద నమ్మకం అని కాదుగానీ—వూరికే ఒక్క ప్రయత్నంచేసి చూద్దాం. ఏమిటంటే—ఆ చెట్టు క్రింద "చిలక ప్రశ్న" ఒకటి తీసి చూద్దాం. అంతగా అయితే అఖర్చునే పెట్టుకుంటాను ఇంగులో తప్పుగానీ—అశుభంగానీ ఏమీ లేదు కదా!" అన్నాడు గిరి ఎంతో భయంగాను

శంకరం కాదనలేదు. నూరి కూడా యిదేదో ఆలోచనగానే తోచింది ఎందు

కంటే పాముల మంత్రగాళ్ళ దేశంలో ఎంగులో ఏ మహాత్తుందో ఎవడికి తెలుసు. ఆవిడజాడ ఏదో చూచాయగా; కనీసం దిక్కయినా తెలుస్తే అటుగాపోయి గాలించ వచ్చు అనుకున్నాడు; సూరి. అందుకని, ఆ ప్రయత్నానికి అడ్డుపుల్ల వెయ్యలేదు.

ఏమాటంటే హిందూ ధర్మానికి విరుద్ధమో అని, జాన్ మెదలకుండా వూరుకొన్నాడు.

నాలుగురు బయలుదేరి, ఆ రోజుకు తన జాతకం చూసుకుంటున్న చెట్టుక్రింద జ్యోతిష్కుడి దగ్గరకు వెళ్ళారు. పంజరం లోంచి చిలకలను రప్పించి "ముడుపు" చెల్లించుకొని; చిలక ముక్కుతో ఒక కాగితన్ని లాగించారు. అందులో మిగతా విషయాలు - ముఖ్యం సంతానం సంగతి ఎంత ఆశ్చర్యంగావున్నా - పిడుగులాంటి విషయమేమిటంటే - శంకరానికి ద్వితీయ వివాహ యోగమున్నట్టు రూఢిగా వ్రాయబడివుంది. అది కళ్ళారా చూసి చదివిన తరువాత-అంత వరకూ శంకరంలో ఏమాత్రమైనా ధైర్యమనేది వుంటే - అది కాస్తా మట్టి గొట్టుకు పోయింది. ఇహ పోతే—శంకరం 'స్కెలిటన్'గా మాత్రమే మిగిలిపోయాడు. కళ్ళల్లో నీరు వుండీ వుడిగీ సుళ్ళు తిరుగుతుంది. ఎక్సరే కళ్ళు లేవుగానీ-లేకపోతే అంతరాత్మ ఎంతగా ఘోషిస్తోందో కూడా తెలిసివుండేది. దిగాలు పడి కుప్పలా కూలిపోయిన శంకరాన్ని బలవంతంగా లేవనెత్తి; "చూడు శంకరం; యిటాంటి వాటిని కూడా నమ్మి; ఉన్నమతి పోగొట్టుకుంటే; మన గతేం కాను. ఇవన్నీ తీసి అవతలపెట్టు! మనవేదో 'చిట్కా' కార్యం చేసేవేకాని దీనికి కట్టుబడి వుండాలనుకోలేదు కదా! అయిందేదో అయి పోయింది. ఇక చెయ్యవలసిందేదో-త్వరగా త్వరగా చేస్తే మంచిది." అన్నాడు సూరి కార్యోన్ముఖుడై!

"ఏం చేద్దాం?" అన్నాడు గిరి.

"నా కేమనిపిస్తుందంటే; నాలుగురం నాలుగు వైపులకు పోదాం. సందు సందూ జల్లించేద్దాం. సాయంత్రం ఆరున్నర అయ్యే సరికల్లా తిరిగి అందరం యిక్కడకే చేరుకోవాలి. ఎవరు ముందువొచ్చినా; మిగతా వాళ్ళకోసరం వెయిట్ చేద్దాం. "సరేనా?" అన్నాడు సూరి.

ఇదేదో కొందగిన కార్యంగానే కనుపించింది అందరికీ! శంకరానిక్కూడా కాస్తంత మళ్లీ ధైర్యం వొచ్చింది. ఆ సంతోషంలోనే — "అదీ అట్లా వుండాలి" అన్నాడు.

"అయితే యింతకీ మీ ఆవిడ పేరేమిటీ? శుభలేఖలో చూడ్డమేగానీ సరిగ్గా జ్ఞాపకం లేదు" అన్నాడు సూరి.

"సీతామహాలక్ష్మిరా బాబూ!"

"నలుపు కదూ!" అనడిగాడు గిరి సరిగా గురులేక. పెళ్లిలో తప్ప యింతవరకు వీళ్ళెవరూ విడిగా చూళ్ళేదు.

"నలుపూగాదూ; నీ తలకాయ కాదు; పచ్చగా దబ్బపండులాంటి రంగు; బొద్దుగా వుంటుంది. ఇవాళ మాత్రం - ఆకుపచ్చ బార్డరున్న తెల్లచీర; ముదురు ఆకుపచ్చ రంగు ముఖమల్ జాకెట్టు తొడిగినట్టు గుర్తు."

"నగలో?" అన్నాడు గిరి.

"ఉన్న నగలన్నీ మెళ్లోనే వున్నట్టున్నయ్యిరా! రెండు మూడు రాళ్ళ హారాలు; రెండు మూడు సాదా హారాలూ; చేతులకు రాళ్ళ గాజులజతలు—కాళ్ళకు పాంజేబీ పట్టాలు కామోను పెట్టుకున్నట్టు గుర్తు."

"తల్లో ఏం పూలు పెట్టుకుందీ?" అనడిగాడు మళ్లీ గిరి.

"నీ తలకాయ! యివన్నీ ఎవడు చూశాడు పరీక్షగా; యిట్లాంటి ప్రమాదాలొస్తాయని నేనేమన్నా ముందుగా కలగన్నానా? రిక్షా నంబర్లతో సహా నోట్ చేసుకోడానికి" అన్నాడు శంకరం విసుగ్గా.

"సరే! ఈ వివరాలు చాలెస్లూ! ఇక మనం తలా ఒక్క దిక్కుకూ వెళ్లిపోదామా?" అని- ఒరే శంకరం! అన్నట్టు మరిచేపోయాను; అంతగా అదృష్టవశాత్తు ఆమె కనిపించిందే అనుకో; 'అమ్మా! మీఆయన దగ్గరకు తీసుకెళతం రామ్మా!' అన్నానే అనుకో!- అప్పుడావిడ నన్ను నమ్మేదెట్లా? "ఓరీ; దురాత్మా! ఏకాంత వనితనుఁగాంచి - చెఱబట్ట యత్నించుచుంటివా? నీ శిరస్సు త్రెంపజేసెదను గాక!" అన్నదే అనుకో ఏమిటీ గతి? అని ఒక్కక్షణం ఆగి; మీ ఆవిడకు గుర్తుగా; నీ "అంగుళీయాన్ని" యివ్వు. కార్యాన్ని జయప్రదంగా నెరవేర్చుకొస్తాను" అన్నాడు సూరి.

"కాదు; అది నాకివ్వు! మైజారూర్ ఉస్కా పతాలగావుంగా! హంజనే యుళ్లాగానే పోతాన్" అన్నాడు జాన్; తను స్వయంగా ఈ కార్యాన్ని సాధించాలనే దీక్షతో. కాని, ఆ ప్రయత్నాన్ని సూరి నెరవేరనివ్వలేదు. జాన్ నుద్దేశించి; అఘోరించావ్; సాయిబు ఆంజనేయులేమిట్రా? నీ పిండాకూడు. నీ భావమింటే నువ్వెన్ని గుర్తులు చూపించినా; చెప్పినా, రావణాసురుడి ఏజెంటువే ననుకొంటుంది"అనేశాడు.

జాన్ మళ్లీ ధైర్యం చెయ్యలేకపోయాడు. సూరి వుంగరాన్ని, గిరి కళ్లజోడునూ; జాన్ జేబులో కలాన్నీ తీసుకొని, శంకరాన్ని ఒక వైపుకు పంపి, వాళ్లు తలా ఒక వైపుకు వెళ్లిపోయారు.

* * *

తిరిగి సాయంత్రం ఆరున్నరకు రావలసిన వాళ్లు—రాజుగారి పాలబిందెలాగా తలా ఒక అరగంటా ఆలస్యంగా వొచ్చారు. వొస్తూ వొస్తూ-సూరి, ఒక యిత్తడి కాలిమెట్టెనూ; గిరి; పగిలిపోయిన ఏనామిల్ గాజు ముక్కనూ, జాన్ సగం చిరిగి - ఎరుపు మరకలున్న జేబు గుడ్డనూ తెచ్చారు. ఏ వస్తువూ

దొరకనిదల్లా ఒక్క శంకరానికే! ఈ విచిత్ర వస్తు సంచయాన్ని చూసి నవ్వాలో ఏడవాలో కూడా శంకరానికి అర్థం కాలేదు. మానసికంగా బాధపడుతూ కూడా, శంకరం ఏడవలేక నవ్వి, "పోయినవాళ్లు పోకుండా; జటాయువు ఈ కల్లాగా ఈ వస్తువు సంచయాలేమిట్రా! మీ దారిన మీరుపోతే, నాదారిన నేను ఏ గోదావరిలోనో దూకి హాయిగా ఆత్మశాంతి చేసుకొనేవాణ్ణి!" అన్నాడు.

మరోక్షణం ఆగి; "సూరీ! మీ శ్రమకు సానుభూతి చూపలేదని మీరేమీ అనుకోవద్దు. నా మనస్సంతా అల్లకల్లోలమైపోయింది. నాకు మనశ్శాంతి లేదు. ఎవడో అన్నట్టు భాగ్యదేవత ఎంత ప్రీతిగా బిగ్గరగా పిలిచినా అదృష్టహీనుడు మేలుకు నే నిద్రపోతాడనేది నాపట్ల కూడా నిజమే అయింది. నాలాంటి అభాగ్యుడికి లక్ష్మీదేవి లాంటి భార్య దొరికినా సుఖపడలేని దరిద్రుడు!" అని వాళ్ళను వొదిలేసి వెళ్లిపోవడం ప్రారంభించాడు. వెంటనే సూరి అతన్ని వాటేసుకుని; "యిట్లాంటి పిచ్చి పిచ్చిపనులు చేసేవంటే బావుండదు. నామాట విను. పోనీ నీమాట ప్రకారం-ఆమెను ఎవరో ఎక్కడో దాచిపెట్టి వుంటారనేదే నిజమైతే—అది రూఢిగా తేలేవరకైనా నువ్వీ అఘాయిత్యపు పనులు మానెయ్. ఒక్క రెండు మూడు రోజులు ఓపికపట్టు. నాశక్తికొద్దీ తీవ్రంగా ప్రయత్నిస్తాను. అవసరమైతే పోలీసుల సాయంకూడా తెస్తాను. మనలాంటివాళ్ళను మరో పదిమందిని తయారుచేసి వూరూరు జల్లించేద్దాం. అప్పుడు నీ అభిప్రాయమే నిజమైతే—ఆ వియోగాన్ని సహించలేకపోతే—అప్పుడే ఆత్మహత్య చేసుగుందువు గానీ!" అన్నాడు.

"నాకు మనశ్శాంతిలేదు. దావానలంలాగా దహించుకు పోతుంది. నే బ్రతకలేను." అన్నాడు శంకరం.

"అయితే కావచ్చు! ఒక్క నాలుగు రోజులు ఓపికపట్టు."

"అయితే నన్నేం చెయ్యమంటావు?" అనడిగాడు శంకరం.

"ఏమీ లేదు, తిన్నగా యింటికి పద: అక్కణ్ణుంచి ఎక్కడికీ కదలకు. మిగతాపనులన్నీ నే చూస్తాను ఒరే! జాన్-ఈ రాత్రంతా శంకరానికి, నువ్వు కాపలా! రేపు ఉదయంనుంచీ, గిరి వుంటాడు. మీ యిద్దరూ శంకరాన్ని ఎప్పుడూ, ఎక్కడికీ ఒంటరిగా పోనివ్వవద్దు!" అని హెచ్చరిక చేశారు.

ఆ నిర్ణయం ప్రకారం; వాళ్లు నలుగురూ శంకరం యింటికి చేరారు. కాని చిత్రమైన సంగతేమిటంటే; వీధి వాకిలికి న్యాయంగా తాళంవేసి వుండాలి. కాని తాళం లేదు. లోపల గడియవేసి వుంది.

శంకరం ఆశ్చర్యపడి మిగతా వాళ్ళ ముఖాలవేపు చూశాడు. వాళ్ళకు మాత్రం ఏం తెలుసు?

"లోపల ఎవరో వున్నట్టున్నారు, పిలూ!"




చిత్రకారుడు: బి. జయప్రసాదరావు (కాకినాడ)

# సతీవియోగం

అన్నాడు సూరి.

శంకరం; ఎంత ప్రయత్నించినా నోరు పెగలేదు. తలుపుతట్టాడు. లోపల్నుంచిఅతని భార్య, సీతా మహాలక్ష్మి తలుపుతీసి; భర్తను చూసి ఏదో అనబోయి మిగతా వాళ్లను చూసి ఆగి లోపలికి వెళ్లింది. శంకరంతో పాటే, వాళ్లు ముగ్గురూ; ఆశ్చర్యంతో సహా లోపలికి చేరారు.

కుర్చీల్లో తాపీగా జారగిలబడి; భార్య నుద్దేశించి; ఎక్కడ మునగడం—ఎక్కడ తేలడం? ఏమిటీ కథ? అన్నాడు; శంకరం. భార్యగొంతు సవరించుకొని అసలేం జరిగిందంటే—

అని ఆమె యిట్లా చెప్పింది. "మీరెక్కిన రిక్షా ఏమో మేఘాల్లో రథమల్లే వెళ్లిపోతుంది. నే నెక్కిన రిక్షా యేమో, తాగినవాడు తూలినట్టు తూలుతూ నడుస్తుంది. ఏ కారుకో గోడకో గుద్దేస్తాడేమోరా బాబూ అనుకునే సమయంలో వెనుకనుంచి ఒక పోలీసు వొచ్చి రిక్షా ఆపించాడు. "నీ లైసెన్సు ఏదీ చూపించు" అనడిగాడు. రిక్షావాడు తెల్లమొహం వేశాడు. "సరే పద పోలీసు స్టేషన్‌కు" అని దగ్గరలోవున్న పోలీసు స్టేషనుకు తీసుకుపోయాడు. నాకైతే గుండెల్లో రైళ్ళు పరిగెత్తినట్టుగా వుంది. సరే ఏమైతే అదవుతుందని మొండికేసి వెనట్లాగే కూర్చున్నాను. పోలీసుస్టేషను దగ్గర కొచ్చిం తరువాత, కాంపౌండులో రిక్షా ఆపి; "ఏమండీ మీరు బండిదిగి లోపలికి రండి" అని మర్యాదగా చెప్పాడు. నాకంటే ముందే పోలీసు లోపలికిపోయి. ఏం చెప్పాడో, ఏమో?; లోపలున్న ఎర్రటి ఆయన; యింత పెద్ద మీసాలూ, అడ్డంగా యింత పెద్ద బెల్టూ వుంది—ఆయన నన్ను పిలిచి లైసెన్సులేని రిక్షాల్లో ప్రయాణం చేయడం తప్పూ-ప్రమాదకరమూ అనే సంగతి కూడా తెలియకపోతే ఎట్లా! ఇట్లాంటి ప్రాథమిక సూత్రాలను కూడా మీరు పాటించకపోతే మీరు ఇబ్బంది పడటమే గాకుండా, మమ్మల్ని కూడా ఇబ్బందిపెట్టి-ప్రమాదాలకు కారకులౌతారు" అని ఇంకా ఏమేమో చెప్పాడు.

అన్నీ విని, "ఏమోనండీ! ఇవన్నీ నాకు తెలియవు. మావారు ఈ రిక్షాలో కూర్చోమన్నారు; కూర్చున్నాను. అంతేనండీ" అన్నాను. మనసినిమా ప్రయాణం సంగతి కూడా చెప్పేశాను.

అంతా విని "ఐతే మీవారు ఏ సినిమాకు వెళ్లిందీ కూడా తెలియదంటున్నారు. మరి ఇప్పుడు ఎక్కడికి వెళతారు?" అనడిగాడు.

"ఎక్కడికీ లేదండీ. తిన్నగా యింటికే పోతాను. ఇదంతా చూస్తుంటే నాకేమిటో భయంగా వుందండీ" అన్నాను.

వెంటనే పాపం ఆయన మరో పోలీసును పిలిచి "వీరిని వాళ్ళింటివరకూ తీసికెళ్ళి విడిచిపెట్టి" రమ్మన్నారు. 'అంతే! ఇంటికొచ్చి తలుపు గడియ వేసు కూర్చున్నాను.'

ఏంరా శంకరం, ఆత్మహత్య ఈపూటే చేసుకుంటావా? కాస్తంత పొటాసియమ్ సైనేడ్ తెచ్చివ్వనా?" అనడిగాడు సూరి.

"ఆత్మహత్యా! ఎందుకూ?" అనడిగింది శంకరం భార్య. "అదంతా ఒక కథలే! తరువాత చెప్తాలే" అన్నాడు శంకరం. చెప్పాడో లేదో!—

గమనిక: ఆంధ్రదేశంలోని కొన్ని బస్తీల్లో ఒక్కొక్కరే ప్రయాణం చేసే రిక్షాలు మాత్రమే అమల్లో వున్నయ్. ప్రస్తుత కథలో వాటినే తీసుగోడం జరిగింది.

★

—కథకుడు.]



రైలుపట్టాల వెంబడి ఊరికి దూరంగా పరుగెత్తి చుట్టూ కలయచూశాడు జగపతి. పొలాలు, ఆ పొలాల మధ్యలోంచి పోతున్న రైలుపట్టాలు తప్ప మరేమీ కనిపించలేదు. దూరంగా ఎక్కడో పొలంలో పనిచేస్తున్న వారు తప్ప, నరసంచారం ఆ దరిదాపుల్లో లేదు. చుట్టూ మరొకసారి చూసి జేబులో చెయ్యిపెట్టి పర్సు తీశాడు. అందులోని కొత్త పదిరూపాయల నోట్లు లెక్కపెట్టాడు. ఇరవై పదిరూపాయల నోట్లున్నాయి. అతను నవ్వుకున్నాడు. అతిసునాయాసంగా రెండు వందలు సంపాదించాడు. ఎంత అదృష్టవంతుడు తను! ఎవరిదో ఆ పర్సు! ఆ డబ్బు పోగొట్టుకున్న నిర్భాగ్యుడిమీద ఒక్క నిముషం జాలి వేసింది. ఆ దొంగహృదయంలో పాప పుణ్యాలమీద సంఘర్షణ జరిగింది.

తనెలా దొంగయ్యాడు? అతని హృదయ మేఘానికి గతాల అనుభూతుల చల్లని గాలులు తగిలినయి. కళ్లు చెమర్చినయి. ఎన్నో సంవత్సరాలుగా మనసులో భద్రంగా దాచుకున్నాడు తన కథని. ఇవ్వాళ ఎందుకో మనస్సు గోడలు బద్దలుకొట్టి తనశాంతి పాడు చేస్తున్నది. స్కూలు ఫైనలుదాకా చదివాడు తను. కాని విధి ఎదురు తిరిగింది. తప్పాడు. అదే పేసయివుంటే దొంగయ్యేవాడా? పరువుగా ఎక్కడో నాలుగురాళ్లు తెచ్చుకుని బ్రతికేవాడు. కాని ఈనాడు? పేరుమోసిన జేబుదొంగ. ప్రతి పోలీసుకన్నూ తనమీదనే.

తను ఒంటరిగాడు. తల్లి చిన్నప్పుడే పోయింది. తండ్రి తాగుడుతో హతమై పోయాడు. ఉన్నది ఒకే ఒక చెల్లెలు. అతని కనులలో పార్వతి మెదిలింది. పధ్నాలుగేళ్ల నాటి సంఘటన చెరగని ముద్ర వేసింది. పార్వతికోసరంతను బ్రతికాడు. తనకు లేక పోయినా అదితింటే చాలని అనుకునేవాడు. దాని అమాయికమైన ముఖం చూసి బాధ పడేవాడు. దాన్ని తన హృదయంమీద నడిపించాడు.

తనకి చిన్నప్పటినుంచి పార్వతీదేవి అంటే ఇష్టం. చెల్లెలికి ఆ పేరే పెట్టాడు. కష్టసుఖాలు తెలియనిపార్వతి ఎప్పుడూ నవ్వుతూ ఉండేది. ఆ నవ్వే అతని హృదయంలో జాలిని మేల్కొలిపేది. వచ్చీ రాని మాటలతో తనని చుట్టేసుకు తిరిగేది.

మిల్లులో పనిచేసి నెల తిరిగేసరికి నలభై రూపాయలు తెచ్చేవాడు. దానితో నెల గడిపేవాడు.

పార్వతి పెద్దదయింది. అది పదహారు వసంతాలు చూసింది. దానికున్న అభిమానం ఎవరికీ ఉండదేమో? మేనమామని ఒప్పించి దాని వివాహం నిశ్చయం చేశాడు. బావ తన మెడలో మాంగల్యం కడుతుంటే పార్వతి హృదయంలో ఏ పూవులు పూశాయో తన కర్థం కాలేదు గాని, అది తనని వదిలి వెళ్ళి పోతుందని భోరున ఏడ్చాడు. అంతఏడుపును దాని సుఖాన్ని తలుచుకుని హృదయంలోకి నెట్టివేశాడు. అది వ్రాసే ప్రతి ఉత్తరాన్నీ చదవబోయే ముందు దాని తియ్యని కల్లలను గురించి వ్రాస్తుం దనుకునేవాడు. కాని ఆనందబాష్పాలకి బదులు కన్నీరు నింపేది ఆ ఉత్తరం. ఆమె తనకి వ్రాసిన ప్రతి ఉత్తరం లోనూ బాధతో విలపిస్తున్న హృదయానికి శాంతి కోరేది. శాంతి నివ్వాలంటే నాలుగు వేలు కావాలి. ఎలా ఇవ్వగలడు?

కట్నం ఇవ్వలేదనే నెపంతో దాన్ని ఇంట్లోంచి వెళ్ళగొట్టారు. అభిమానవతి పార్వతి అన్నకు ముఖం చూపించలేక ఊరుబయట చెరువులోదూకి ఆత్మహత్య చేసుకుంది. ఆనాటినుంచి తనహృదయం కరుడుకట్టుకు పోయింది. ముందు చనిపోదామనుకున్నాడు. కాని తనచెల్లెల్నిలా ఏడిపించిన లోకాన్ని ఏడిపించిగాని తను చావలేడు. చావకూడదు! దురదృష్టం. పార్వతి మృతి తరువాత కూడబెట్టాడు నాలుగు వేలు.

పర్సు పారెయ్యబోయి ఆగిపోయాడు. ఆ నిర్భాగ్యుడిపేరు తెలుసుకోవాలని పించింది. పర్సులో చెయ్యిపెట్టి వెతికాడు. ఒకకాగితంమీద అతని అడ్రసు, మరో చిన్నకవరులో నాలుగైదు టైపు చేసిన కాగితాలున్నాయి. ఆ కాగితాలుతీసి చదివాడు. అతను కంగారు పడ్డాడు.

"అరెరె, నేనెంత పొరపాటు చేశాను? ఈ కాగితాలు చాలా ముఖ్యమైనవి. ఎవడో పాపం? ఉద్యోగం కూడా పోతుంది? ఎలా?"

అతను బాధపడ్డాడు. అడ్రసు చూశాడు.

"అతని ఉద్యోగం నామూలకంగా ఎందుకు పోవాలి? అతని కాగితాలు అతనికి అప్పచెబుతాను." అనుకున్నాడు. కాని ఎలా చెప్పగలడు? లోకం తనకి 'దొంగ' అనే యువని కనువేసింది.

"ఉమాపతిది విజయవాడే. దగ్గరే. రాత్రికి వెళ్లి అతను చూడకుండా వారింట్లో పడేసి వస్తాను." అనుకున్నాడు. కదలికలేని అక్షరాలు అతనిలో జాలిని, అవేదనని సృష్టించినయి. కరుడుకట్టినహృదయం మెల్లగా కరిగింది.

అతను పర్సులో కాగితాలు పెట్టేసి, పర్సుని జేబులో పెట్టుకుని బయలుదేరాడు. దారిలో అతని కనిపించింది.

"లోపల మనస్సుకీ, ఆత్మకీ సంఘర్షణ ప్రారంభమైంది.

"బావగారు చేసినపనికి లోకుల నేడిపించటం న్యాయమా?" మనస్సు తీవ్రంగా వాదించి అంది.

"ఆః! న్యాయమే.అయినా ఈలోకంలో న్యాయాన్యాయా లెవరికి కావాలి? ఇది కలికాలం. న్యాయమే ఉంటే నీవివ్వలేని కట్నానికి నీచెల్లెల్ని బాధపెట్టటంసబబా?"

అతను ఒక్కక్షణం ఆలోచనలోపడ్డాడు.

"వెళ్ళకు. ఆ ఉమాపతి ఎలాపోతే నీకేం

దునుకు!" అంది మరోసారి హెచ్చరిస్తూ మనసు.

కాని మనసు చేసిన ఈ హెచ్చరికను అతను లక్ష్యం చెయ్యలేదు. అతనిమీద జాలి స్రవంతిలా హృదయంలో పొంగి, పొర్లి, నరనరాల్లో ప్రవహించసాగింది.

అతని మనస్సు చివరిప్రయత్నం చేస్తూ వెనక్కిలాగింది. కాని ఉత్కంఠ ముందుకు లాగింది. అతనెవరో తెలుసుకోవాలన్న కుతూహలం మనస్సుని నిముష నిముషానికీ బలహీనురాల్ని చేసింది. మనస్సు ఇంక పోరాడలేక "నే పోతున్నా బాబు. నీతో పోట్లాడి నే నెక్కడ గెలవగలను?" అని కోపంతో చీకటిగదిలో శయ్య నలంకరించిన భార్యలా మూతి బిగించుకుంది.

మానవుడు దేవుడవుతాడా? మానవునిలో శాంతి, భక్తి, అహింస, త్యాగం మితిమీరి నప్పుడు మానవుడే దేవుడౌతాడు. అతన్ని అనుసరించి జగత్తు నడుస్తుంది. కాని వీటన్నిటినీ హృదయంలో చేర్చాలంటే సామాన్యమా? ఎంత సాధన కావాలి?

అతని ముఖం జేవురించింది. అతను పంజరంలోని చిలుకలా విలవిల కొట్టుకున్నాడు. ఊళ్ళోకి పోవటానికి త్వరత్వరగా అడుగులు వేయసాగాడు.

## 2

అతను విజయవాడ చేరుకున్నాడు. సన్నగా వర్షంజల్లు పడుతున్నది. విజయవాడ స్టేషనంతా ప్రయాణికులతో నిండి పోయింది. ఇంతమందిని మోసుకొచ్చాను గదా అన్న ధీమాతో సంతోషించిన ఇంజను వెర్రికేక పెట్టింది. ఉసూరుమని నిట్టూరుస్తూ నీరు నింపుకోటానికి వెళ్ళిపోయింది.

అతను ప్రయాణికులను త్రోసుకుంటూ స్టేషన్ బయట కొచ్చాడు. ఆ సమయంలో కొన్ని వందలజేబులు అతని కళ్ళల్లో పడ్డాయి. కాని బలవంతాన నిగ్రహించుకున్నాడు.

అతని మనస్సు ఆందోళనతో నిండి పోయింది. తనవారికి జబ్బు చేసిందని టెలిగ్రాంవస్తే దారిపొడుగునా ఎటువంటి ఆలోచనలతో మనస్సు కంపిస్తుందో అటువంటి ఆలోచనలతో అతని మనస్సు కంపించింది.

అతను విచిత్రంగా నవ్వుకున్నాడు. ఒక దొంగ, ఒక మోసగాడు ఇలా అరరాత్రి పిచ్చివాడిలా పోవట మేమిటి? కాని దానికి సమాధానం అతను చెప్పలేడు.

అడ్రసు ప్రకారం గవర్నరుపేట వైపు త్వరత్వరగా నడువసాగాడు. ఆ వీధిలో లైట్లు పోయినయి. చీకటి నల్లగా దట్టంగా వుంది. టార్చిలైటు తీసి వెలిగించి నెమ్మదిగా నడుస్తున్నాడు.

మరో రెండడుగులు వేసేసరికి ఉమాపతి ఇల్లు కనిపించింది. ఈ ఒకవ్యక్తి ఆత్మతప్ప మిగిలిన అందరి ఆత్మలు నిద్రాదేవి ఒడిలో సేద తీర్చుకుంటున్నాయి.

లోపల నుంచి లాంతర్లు వెలుగు గుడ్డిగా కిటికీలోంచి వచ్చిపడుతున్నది. అది చిన్న డాబా. వాకిట్లో నాలుగైదు బంతి మొక్కలు ఆ వెలుగులో మెరుస్తున్నాయి. అతను చుట్టూ చూశాడు. ఇతని హృదయంలో తప్ప మిగతా అందరి ఇళ్ళల్లోనూ దీపాలు ఆరిపోయినయి. నెమ్మదిగా ప్రహరీ



గోడను మునివేళ్ళమీద దూకాడు. అతను దొంగలా చుట్టూ చూసి గది కిటికీని సమీపించాడు. అతనిరక్తం గడ్డ కట్టింది. కిటికీ పక్కగా నిల్చుని లోపలికి తొంగిచూశాడు.

ఆ క్షణంలో అతను చూసిన దృశ్యం అతన్ని వివశుణ్ణి చేసింది. చిన్న పిల్లవాణ్ణి జో కొడుతూ మంచంమీద కూర్చున్నాడు ఉమాపతి. ఆ మంచంమీదే కూర్చుంది ఇరవై ఎనిమిదేళ్ళ స్త్రీ.

బెడ్ లైటు నల్లనిపొగను విశాల ప్రపంచంలోకి వదులుతూ వెలుగుతున్నది. దాని వెలుగు వారి ముఖాలమీద కష్టసుఖాల్లా పడుతున్నది. వారి ముఖాలు అస్పష్టంగా కనిస్తున్నాయి అతనికి. వారి ముఖాల్లో ఆందోళన, విచారము ప్రతిబింబిస్తూ ఉంది.

అతను శ్రద్ధగా వారిమాటలు వినసాగాడు. వారి మాటలు వింటున్న కొద్దీ అతని రక్తం నూటఅయిదు డిగ్రీల జ్వరంతో వున్న రోగి రక్తంలా పరుగెత్తసాగింది. అతని హృదయం దడదడ కొట్టుకుంటున్నది. ప్రకృతి మాత వల్లనిచీకట్లో ఆ దుఃఖిత హృదయాల్ని అర్థం చేసుకో ప్రయత్నించటానికి ఉపక్రమించాడు.

"శేషు, పడుకున్నాడా?" అంది ఆమె.

"ఆఁ! ఇప్పుడే పడుకున్నాడు" అన్నాడు ఉమాపతి. ఆమె కనుకొలకులలో కన్నీటిబొట్టు నిలిచింది. ఆమె అంధకారమయంగా చేసుకుంది ముఖాన్ని. ఆమె అధరాలు కంపిస్తున్నాయి. ఆమె గొంతు వణుకుతూంది.

"ఎక్కడన్నా దొరికిందా?"

అతను బాధగా నిట్టూరుస్తూ "లేదు. ఎక్కడా దొరకలేదు. నూరు రూపాయల జీతగాడికి ఎవరిస్తారు. అప్పు?" అన్నాడు మరింత జోరుగా జో కొడుతూ.

అతను దీనంగా ఆమె కళ్ళల్లోకి చూశాడు.

ఆమె భయంగా "ఎలా అయితే ఇప్పుడు?" అంది. ఆమె గొంతు లోతుగా వున్న నూతిలోంచి వచ్చినట్లు ఉంది.

అతను మరింత భయపడుతూ, "ఏంచేద్దాం? నాకూ ఏమీ తోచటంలేదు." అన్నాడు.

ఆమె వణుకుతూ "మీరు ఈపని చెయ్యకుండా ఉండాల్సింది." అంది.

అతను జాలిగా "మరేం చెయ్యను సుగుణా? ఆడపిల్లను ఇంకా ఎంతకాలం ఇంట్లో ఉంచుకుంటాం?" అన్నాడు.

ఆమె నిట్టూర్చింది.

అతను ఇంకా వ్యథపడుతూ అన్నాడు.

"నువ్వే చెప్పు సుగుణా? నలుగురికీ సమాధానం చెప్పలేక మన ప్రాణాలు విసిగిపోయినయి. సాటివారు హాయిగా కాపురం చేసుకుంటుంటే, అది అలా ఆశలు ఆర్పుకుని కూర్చుంటే...ఎలా చూస్తూ వూరుకోను? అందుకే ధైర్యంచేసి ఆఫీసు డబ్బు తీశాను."

అతను ఆపుకోలేకపోయాడు దుఃఖాన్ని.

# దేవుడైన మానవుడు

ఆమె జాలిగా ఉమాపతి బుజంమీద చెయ్యివేసి అంది.

"ఎక్కడన్నా మళ్లీ ప్రయత్నం చెయ్యండి. లేకపోతే చాలా బాధపడతాము. పరువుగా బ్రతుకుతున్నాం. అది కాస్తా ఊడ్చిపెట్టుకుపోతుంది. నలుగురిలో నవ్వులపాలవుతాం."

"నిజమే! పొరపాటే చేశాను."

"కూతురి పెళ్ళికి డబ్బుతీశారంటే ఊరుకుంటారా?" అంది ఆమె.

అతను వ్యథపడుతున్న హృదయంతో సుగుణనిచూసి, నిట్టూర్చి అన్నాడు.

"ఈగండం గడవటం చాలా కష్టం సుగుణా."

ఆమె బెడ్ లైటు సరిచేసివచ్చి అతని కెదురుగా కూర్చుంది. అతను దుఃఖపూరితమైన గొంతుకతో "సుగుణా, నేనెలాగూ జైలుకెళ్తాను. తప్పదు. నువ్వెలాగైనా వీడిని పెంచి పెద్దవాణ్ణి చెయ్యి" అన్నాడు.

సుగుణ భోరునఏడుస్తూ "ఆమాటలనకండి" అంది.

"పిచ్చిదానా, నిప్పు తెలిసి ముట్టుకున్నా తెలియక ముట్టుకున్నా కాలుతుంది. తెలిసి చేసినా తెలియక చేసినా శిక్షతప్పదు."

"ఏమండీ!" అంది సుగుణ ఏడుస్తూ.

"ఒక దొంగకూతురు తనభార్యని తెలిసి దాన్నెంత బాధపెడతాడో?"

"మీరు దొంగకాదు." అంది ఆవేశంతో.

"అది నీకు తెలుసు నాకు తెలుసు. లోకానికేం తెలుసు?"

"లోకులు కాకులు, లోకానికి వెరిచి నన్ను ఏకాకిని చేస్తారా? మీకు న్యాయంగా ఉందా?" అంది ఆమె ఏడుస్తూ.

ఆమె జుట్టు విరబోసుకుంది. దుఃఖభారాన్ని భరించలేక అతని హృదయంలో తల దాచుకుంది.

"మీ బదులు నేను వెళతాను జైలుకి. నేను తీశానని చెబుతాను."

"సుగుణా, అటువంటి పని చెయ్యకు. వాడు తల్లిలేనివాడవుతాడు. తండ్రిలేని వాణ్ణి పెంచవచ్చు కాని మాతృహీనుణ్ణి పెంచటం కష్టం."

ఆమె చలనరహితంగా కూర్చుంది. ఆమెను చూస్తుంటే అశోకవనంలో శింశుపా వృక్షచ్ఛాయలక్రింద కూర్చున్న జానకి జ్ఞాపకం వచ్చింది జగపతికి.

ఆమె జీవం లేని నవ్వునవ్వి "అయితే నేను ఆత్మహత్యే చేసుకుంటాను." అంది.

ఉమాపతి బిగ్గరగా అరిచాడు. అతనికి తెలియకుండానే అతని గొంతులోకి ప్రార్థన స్థాయి వచ్చింది.

"సుగుణా, వాణ్ణి అన్యాయం చేస్తూ ఈ లోకంలో వదలి పోతావా? అలా దారుణంగా మాట్లాడకు సుగుణా?"

సుగుణ బాధగా విలపిస్తూ "మరేం చెయ్యను?" అంది.

"వాణ్ణి పెంచు."

"ఈ అప్రతిష్ఠతో బ్రతకనా?"

"సుగుణా, మనకన్న హీనులు చాలా మంది ఉన్నారు, ఈ ప్రపంచంలో. అది గుర్తుపెట్టుకో. జీవితంలో ఒడుదుడుకులు లేకుండా ఉండటం అసంభవం కదా? నా మాట విను."

జగపతి అక్కడ నిల్చోలేకపోయాడు. అతనికంతా అయోమయంగా ఉంది.

ఇది స్వప్నమా? యధార్థమా?

అతని ముఖానికి ప్రకృతి విచారాన్ని పులిమింది.

"సుగుణా? వాడికి నా మాట జ్ఞాపకం చెయ్యకు అసలు నన్ను మరిచిపో. ఎప్పుడైనా వాడు "నాన్నేడి?" అని అడుగుతే ఏం చెబుతావు?"

ఆమె భోరున ఏడ్చింది.

"చచ్చిపోయాననిచెప్పు. ఆత్మవంచన చేసుకోలేక చేయరాని పనిచేశానని చెప్పకు" అన్నాడు ఏడుస్తూ.

జగపతి కిటికీవద్ద నిల్చోలేకపోయాడు. భరించలేని నీరసంతో కుప్పకూలిపోయాడు. ఎటు చూసినా సుగుణమ్మ దీనవదనం అద్దంలోవలె కనిపిస్తున్నది. అతని మనస్సు పరితపించింది. ఒక స్త్రీ కన్నీరు ఇన్నాళ్ళూ కరుడుకట్టిన మానవత్వాన్ని మేల్కొల్పింది. అమరత్వానికి ఇన్నాళ్ళూ ఉన్న యవనికను తొలగించింది. ఆమె కనులనుండి రాలిన ప్రతి నీటిబొట్టూ శీతలంతో గడ్డకట్టిన రక్తాన్ని కరిగించి ఉరుకు లెత్తించింది.

అతను పరిపూర్ణహృదయంతో "ఈ

ఒకడు — ఒరేయ్, మానవుడు సాధించవలసిన ఘనకార్యం ఏమిటిరా?

మరొకడు — కొత్త సినిమా విడుదల అయినరోజున టిక్కెట్ సంపాదించడం.

—వి. సీతారామరాజు (పడ్డూరు)

త్యాగం నేనెందుకు చేయకూడదూ?" అనుకున్నాడు.

అతని కనులకు జాలిగా, దుఃఖమూర్తి సుగుణరూపం కనిపించింది. దాని పక్కనే పార్వతిరూపం అశ్రునయనాలతో ప్రత్యక్షమైంది.

అతను వ్యథతో మూలిగాడు. అతని హృదయం బాధతో విలవిల తన్నుకుంది. ఈ త్యాగంచేసి వారి కుటుంబాన్ని రక్షించమని పార్వతి వేడుకుంటున్నట్లనిపించింది. క్రమంగా అతని హృదయంలో పార్వతి కున్న చోటుని సుగుణ ఆక్రమించుకుంది.

అతను పిచ్చివాడిలా ఏడ్చాడు. జుట్టు పీక్కున్నాడు. సుగుణ చూసిన దీనమైన చూపులు బాణాలై దేహాన్నంతటినీ గ్రుచ్చుతున్నయి.

అతను లేచి నిలుచున్నాడు.

"ఈ డబ్బు నేనిస్తాను." అనుకున్నాడు తనలో తాను. ఈ డబ్బు పార్వతి కిస్తున్నట్లే భావించాడు. ఈ డబ్బు ఇస్తేగాని పార్వతి ఆత్మ శాంతించదు.

"ఇస్తాను. ఈ మూడువేలు ఇస్తాను."

అతను మారిపోయాడు. అతని హృదయం మారిందనటానికి, పరిపూరత పొందిందనటానికి, నల్లని మబ్బులు రివ్వున పరుగెత్తే పవనకుమారులు సాక్ష్యం.

అతను చివరిసారి తొంగిచూసి బయలుదేరాడు. వెంటనే తన వూగుపోయి డబ్బు తీసుకురావాలి.

జగమే విచిత్రం. అందులో ఎంతోమంది మానవులున్నారు. వారి ముఖాలుబట్టి దొంగలో, దొరలో తెలుసుకోగలమా?

"నన్నిలా అన్యాయం చెయ్యకండి" అంటూ అతని పాదాలమీదపడి ఏడుస్తున్నది సుగుణ.

# 3

సహృదయానికి తగిలిన గాయం మానాలంటే చాలా కాలం పడుతుంది.

జగపతి తిరిగి అతని ఇంటికి వెళ్ళాడు. అతని ముఖం చూసి ఆ చుట్టుప్రక్కల ప్రతివాడూ ఆశ్చర్యపోయాడు.

మూడువేలు తీస్తుంటే "ఇంత డబ్బు రక్తసంబంధమైనా లేనివారి కెలా ఇవ్వను?" అనుకున్నాడు. కాని ఆ ప్రశ్నలు సుగుణ ముఖం ముందు పరాజితాలైనాయి. డబ్బు తీసుకుని తిరుగు బండికే విజయవాడ బయలుదేరాడు.

కథ గ్రహించుకున్న తోటి జేబుదొంగ వగుసు, "నవ్య నవనీత సమాన మనుకున్న స్త్రీత్వంలో ఇంత విలువవుందా?" అనుకున్నాడు.

జగపతి వెళుతూ దారిలో అనుకున్నాడు. "నేను అమరుడ్ని అవుతున్నాను" అని.

తూర్పు తలుపులు తెరుచుకుని సూర్యుడు ఈ ప్రపంచంలోకి ఒక్కసారి తొంగి చూశాడు. ప్రాగ్దిశాంచలము పర్వతాగ్రమున క్రమ్మింది.




చిత్రకారుడు: కె. సత్యనారాయణరావు (విశాఖపట్నం)

ఆఫీసు అడ్రసు తెలుసుకుని ఆఫీసుకు పోయి ఆఫీసరు ఎదుట నిల్చున్నాడు.

"సార్."

"ఎవరు?"

"ఉమాపతిగారు ఈ డబ్బు ఇచ్చి రమ్మన్నారండి." అన్నాడు వినయంగా.

ఆఫీసర్ తలెత్తి "ఏం డబ్బోయ్?" అన్నాడు.

"నిన్న తాళంలేక, ఇంటికి తీసుకుపోయారుట. ఈ మూడువేలు..."

పొగపాటున నోరు జారింది. నిజానికి ఎన్నాళ్ళయిందో డబ్బు తీసి ఉమాపతి?

ఆఫసరు మామూలుగానే "ఏమిటి?"— అన్నాడు.

"అవునండి. ఈ డబ్బు తీసుకుంటారా?"

"అఁ! అలాగా." అన్నాడు నోరు తెరచి ఆఫీసరు.

జగపతి మాట్లాడలేదు. ఏమంటే ఏం ప్రమాదమోనని భయంతో నిల్చున్నాడు.

"ఆయ నేరి? ఆఫీసుకు రారా?" అన్నాడు డబ్బు అందుకుంటూ.

"వంట్లో కులాసాగా లేదండి."

"ఏం?"

"జ్వరంగా ఉంసండి. నా చేతికిచ్చి పంపింది అందుకే."

"చాలా కృతజ్ఞుడ్ని." అన్నాడు డబ్బు లెక్కింఛి.

"వస్తానండి."

"మరిచిపోయానోయ్. కాఫీ తాగిపోదువు ఉండు."

"వద్దండి. ఇప్పుడే తాగి వస్తున్నాను."

అతను తేలిగ్గా ఊపిరిపీలుస్తూ బయలుదేరాడు. అతనికి చెప్పలేనంత సంతోషంగా వుంది. తను ఒక కుటుంబాన్ని నిలపగలిగాడు. లోకులందరి దృష్టిలో తను దొంగ. కాని సుగుణ, ఉమాపతిదృష్టిలో కాదు.

ఉమాపతిని చూద్దామనిపించింది. ఉమాపతి ఇంటివైపు అప్రయత్నంగా దారి తీశాడు.

ప్రాతఃకాలపు ఎండ బంగరు రంగుతో పచ్చిగడ్డిమీద పడి మెరుస్తున్నది. లోవాకిట్లో బంతిచెట్లు అటూ ఇటూ వూగుతున్నయి.

శేషు వాకిట్లో నిల్చున్నాడు. జగపతి ముద్దుగా స్వతంత్రంగా ఎత్తుకు నిల్చున్నాడు. కొన్ని గంటల క్రితమే ఆ ప్రదేశానికి వచ్చాడు. అప్పుడున్న తన హృదయానికి ఇప్పుడు హృదయానికి ఎంత భేదం? ఎంత వ్యత్యాసం?

"దొంగ, దొంగ"

జగపతి కంగారుగా నాలుగువైపులా చూశాడు.

పది పదిహేనుమంది మనుష్యులు అతని చుటూ చేరారు. అతను సందిగ్ధావస్థలో పడ్డాడు.

"దింపరా వాడ్ని".

జగపతి దింపాడు.

"పగలేరా నీపని?"

# దేవుడైన మానవుడు

అతను "ఏంపని?" అన్నాడు గద్దదస్వరంతో.

"మేం లేకపోతే వాడిమెడలో గొలుసు కాజేసేవాడివే!"

"నేనా?"

అతని హృదయం మారింది. సుగుణ పాత హృదయాన్ని తీసి దానిస్థానంలోనే కొత్త హృదయాన్ని పెట్టిందని ఎవరికి తెలుసు?

అతను బెల్లంకొట్టిన రాయిలా నిల్చున్నాడు.

సుగుణ లోపలినుంచి పరుగెత్తుకువచ్చి శేషునిదగ్గరకు తీసుకుంది.

అతను వెనుదిరిగి వెళ్ళబోయే ముందు సుగుణనిచూశాడు. దీన వదనంతో అలాగే నిల్చుంది సుగుణ.

ఉమాపతి వగరుస్తూ పరుగెత్తుకువచ్చాడు. జగపతి నిశ్చేష్టుడై నిలబడిపోయాడు.

"సుగుణా నా పేరుతో ఎవరో వచ్చి ఇచ్చారు" అన్నాడు ఉమాపతి.

సుగుణ నిర్ఘాంతపోయింది.

"నిజం సుగుణా ఎవరోమరి? పైగా నేను పంపినట్టుగా చెప్పారుట." అన్నాడు సంతోషంతో ఉమాపతి.

సుగుణ ముఖంమీద ఆనంద జ్యోత్స్న నృత్యం చేస్తున్నది.

జగపతి సంతోషంతో పొంగి పోయాడు. తను చేసినపని చెప్పాలనిపించింది. కాని చెప్ప లేకపోయాడు. అది తన మనస్సులో ఉంటేనే ఆనందం. ఆనందవాహిని తెరలు తెరలుగా హృదయపుగట్లు తెంచుకుని ప్రవహిస్తున్నది.

సుగుణ మనస్ఫూర్తిగా దేవుడికి నమస్కారం చేసింది.

"దేవుడు మనపాలిట ఉన్నాడు. అతడెవరో దేవుడేమనకు"

అతను సంతోషంతో సుగుణ కళ్ళల్లోకి చూసి, "సుగుణా నాకు ప్రమోషన్‌కూడా వచ్చింది" అన్నాడు.

సుగుణ పొంగిపోతూ "అలాగా మనమెంత అదృష్టవంతులం" అంది.

ఒకరికి ఆనందం ఇవ్వటంలోనే నిజమైన ఆనందం లభిస్తుంది.

"వెళ్ళవేం?" అన్నాడు పక్కింటి సుబ్బారాయుడు.

"వస్తాను పార్వతి" అన్నాడు సుగుణని చూసి. అజ్ఞాతంగానే సుగుణ హృదయంలో ఉంటాడు తను. అతను రైలెక్కబోతూ అనుకున్నాడు.

"నా పేరు తెలీదు. నాముఖం చూడలేదు. కాని జీవితమంతా నన్ను తలుచుకుంటారు" అని.






-దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి

30-11-60 బుధవారం మొదలు

6-12-60 మంగళవారంవరకు.

### మేషం :

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

కుటుంబ విషయాలలో సమయానుకూలత అవసరం. అనవసరమైన ఖర్చులు పైన పడుతవి. వృత్తివ్యాపారాలకు సంబంధించిన కార్యక్రమాలు చురుకుగా చేయగలుగుతారు. అకస్మాత్తుగా ప్రయాణాలు చేయవలసివస్తుంది. సంఘకార్యాలలో ప్రస్తుతం నిషురాలు రాగలవు. పిల్లల ఆరోగ్యంగురించి జాగ్రత్తగా ఉండటం అవసరం. ఈ సమయంలో మీ ఆలోచనలకు నిలకడ అంటూ ఉండదు. జాగ్రత్తగా ఉందామని అనుకుంటూ తొందరపడటం జరుగుతుంది. లౌకుల వ్యవహారాలలో గాని, ప్రసంగాలలో గాని ప్రవేశించవద్దు. 5, 6 లలో ఆశాభంగం, కలహాలు.

* * *

### వృషభం :

(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)

యుక్తిమాటలతో మిమ్ములను ఇబ్బంది పెట్టేవారుంటారు. ధనసంబంధమైన లావాదేవీలలో కలహప్రసంగాలు వస్తవి. మీరు ఎగురుచూస్తున్న వార్తలు సకాలంలో వచ్చినా ఉపయోగం స్వల్పంగా ఉంటుంది. మీ ఆరోగ్యం దెబ్బతినటంవల్ల వృత్తి ఉద్యోగాలలో నిరుత్సాహము, శ్రమతో చచ్చు దైవకార్యాలు మధ్యలో ఆటంకాలు వచ్చినా నెరవేరుతవి. ఆప్తులవద్దనుంచి కష్ట వార్తలు తెలియగల సమయం. శుభ కార్య ప్రయత్నాలు సులభంగా అనుకూలించవు. విద్యాభ్యాసంగానికి, సాహిత్యసేవకు అనుకూలమైన కాలం. 23, తేదులలో వహారవ్యజయం, విలాస ఖర్చులు.

* * *

### మిధునం :

(మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

శక్తికిమించిన పనులు ఆరంభించటంవల్ల ఉత్సాహం తగ్గుతుంది. కుటుంబంలో అనారోగ్యాలు, విపరీతమైన ఖర్చులు వీటివల్ల మీ ప్రయత్నాలకు ఆటంకాలు ఏర్పడుతవి. మీ ఆరోగ్యం బాగుపడుతుంది. బాహ్య పటాటోపం పెంచుకోవలసి వస్తుంది. మీ బుద్ధిబలంతో బాధ్యతగల పనులనుంచి తప్పుకోగలుగుతారు. దూరముందున్న మిత్రులవద్దనుంచి శుభవార్తలు తెలుస్తవి. సహాయంచేస్తామని చెప్పేవారిని నమ్ముకొనటంవల్ల మధ్యలో శ్రమపడవలసివస్తుంది. సుబ్రహ్మణ్యస్తోత్రపారాయణం చేసుకొనటంవల్ల మనోబలము, కార్యసిద్ధి, సంఘంలో ఉన్నతస్థితిని పొందగలుగుతారు. వారాంతంలో ప్రయాణాలు చేస్తారు. 30, 1 లలో ధనప్రాప్తి, వృత్తిలో అనుకూలత.

> **గ్రహస్థితి**
>
> మిధునంలో అంగారకుడు, సింహంలో రాహువు, తులా వృశ్చికాలలో బుధుడు, వృశ్చికంలో సూర్యుడు, ధనుస్సులో గురు శనులు, ధనుర్మకరాలలో శుక్రుడు. కుంభంలో కేతువు, మేష వృషభ మిధునాలలో చంద్రుడు.

" " *

### కర్కాటకం :

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష)

స్వశక్తితో అన్నివిషయాలు సమర్థించుకోగలుగుతారు. స్నేహితులకు సహాయం చేయగలుగుతారు. ఆదాయం బాగానే ఉంటుంది. వ్యవహారవిషయాలలో చిక్కులువచ్చేటట్లుతోచినా దైవానుగ్రహంవల్ల పరిష్కారమవుతవి. సుఖం అనుభవించగలుగుతారు. పడమర దిక్కునుంచి ధనలాభం ఉంటుంది. అనుకున్న ప్రయాణాలు సక్రమంగా జరుగవు. రాజకీయాలలో స్వల్ప ప్రతిబంధకాలు వస్తూఉంటవి. విలువగల వస్తువులు కొంటారు. వృత్తి ఉద్యోగాలలో మీ మాటకు విలువ లభిస్తుంది. అయితే ఇతరుల నిమిత్తం మీ శక్తిని వినియోగించవలసి వస్తుంది. 4, 5 లలో శ్రమకరమైన పనులు, ఆరోగ్యభంగం.

* * *

### సింహం :

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

మీ యథార్థబుద్ధి, కార్యదీక్ష మీ విజయానికి కారణము అవుతవి. విరోధులు కొందరు ఎదిరించటానికి ప్రయత్నిస్తారు. అధికారులతో పరిచయం లభిస్తుంది. శుభ పుణ్యకార్యాలు జయప్రదంగా నిర్వహించగలుగుతారు. మధ్యవర్తుల మాటలను నమ్మి స్నేహితులతో కలహించవద్దు. యంత్రాలు మొదలయినవి కొనటానికి అనుకూలమైన సమయం. వారం రెండవభాగంలో నరముల యందు బాధ కనుపించవచ్చు. పైత్య ప్రకోపం చేయగల అవకాశాలున్నవి. గ్రంథపరిశీలన, సంగీత, సాహిత్య పరిశ్రమలకు అనుకూలమైన సమయం. 1, 2 లలో సంఘ సన్మానము, వృత్తిలో అభివృద్ధి.

* * *

### కన్య :

(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1, 2 పా.)

ప్రతిపనిలోను అంటీ అంటనట్లు ప్రవర్తించవలసిన సమయం. ధనాదాయం బాగుంటుంది. మీవల్ల సహాయం పొందినా పరోక్షంలో హేళనగా ప్రసంగించేవారు ఉంటారు. వృత్తిఉద్యోగాలలో శ్రమ మాత్రం అధికంగా ఉంటుంది. ధన సంబంధమైన లావాదేవీలలో నిర్మొహమాటంగా ఉండటం అవసరం మీ ఆరోగ్యం ఇంతకు ముందుకన్నా బాగా ఉంటుంది. ముందుగా ఇతరులకు మాట ఇచ్చి వుండటంవల్ల శ్రమపడి గౌరవం నిలబెట్టుకొనవలసివస్తుంది. వారం రెండవభాగంలో బంధు విరోధం వస్తుంది. ముఖ్యమైన లెక్కలు, వ్రాతలకు సంబంధించిన పొరబాట్లు రాకుండా చూచుకొనండి. 30, 1, 2 తేదులలో మనోవ్యథ, విలువగల వస్తువులుకొనుట.

* * *

### తుల :

(చిత్త 3, 4 పాదాలు,స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)

తలపెట్టిన పని పూర్తిగా జరిగేవరకూ

# రాశి ఫలాలు

ప్రతిబంధకాలు కనిపిస్తూనే ఉంటవి. ప్రతి పనీ లాభించేటట్లు తోచినా ప్రస్తుతం తొందరపడవద్దు. స్నేహితుల మూలంగా ఖర్చులు పెరుగుతవి. తీర్థయాత్రలు సుఖంగా జరుగుతవి. వృత్తి వ్యవహారాలలో త్రిప్పట అధికం కావచ్చు. వ్యవహారరంగంలో మీ ఊహలు చాలావరకు ఫలిస్తవి. మొత్తంమీద ఆదాయం బాగానే ఉంటుంది. కాని, మన్య మన్య శ్రమ, అసంతృప్తి కనుపిస్తూఉంటవి. మనోనిబ్బరంతో కార్యసిద్ధి పొందగలుగుతారు. విశ్రాంతి లేనిపనులవల్ల ఆరోగ్యం లోపించగల అవకాశాలున్నవి. కుటుంబంలోని వారితో కలహాలు రాకుండా చూచుకొనండి. 3, 4 లలో ధన లాభం, వృథా ఆందోళన.

* * *

వృశ్చికం:

(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

మీ హోదాను నిలబెట్టుకో గలుగుతారు. మానసికంగా మిమ్ములను వేధిస్తున్న సమస్యలు వాటంతట అవే పరిష్కార మవుతవి. స్త్రీ సులకు సంబంధించిన వ్యవహారాలలో అనుకూలత కలుగుతుంది. ధన విషయంలో ఇంతకు ముందుకన్నా మేలుగా ఉంటుంది. సాటివారిలో మీ పనులకు, మాటకు ప్రాముఖ్యత లభిస్తుంది. మీరు కావలయునని ప్రయత్నించిన పనులు సులభంగా నెరవేర్చలేకపోతారు. స్నేహితులవల్ల ఆదరాభిమానాలు లభిస్తవి. దుబారా ఖర్చులు పెరగగల అవకాశాలున్నవి. విశ్రాంతిగా ఉండవలయునని ప్రయత్నించినా సాధ్యం కాదు. బంధువులవద్దనుంచి శుభవార్తలు తెలుస్తవి. 5, 6 లలో నీచులతో కలహాలు, ధన వ్యయం.

* * *

ధనుస్సు:

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ ప్రథమ పాదం)

మీ తోటివారు మీ మనస్సును గ్రహించుకుని నడుచుకొంటూ అన్నివిధాలా సహాయం చేస్తారు. రావలసిన ధనం చేతికి వస్తుంది. అకారణంగా ఉద్రేకం రాగల సూచన లున్నవి. అధికమైన ఖర్చులవల్ల చికాకు ఏర్పడుతుంది. చిన్నచిన్న ప్రయాణాలు చేయవలసి వస్తుంది. మీరు ఇతరులకు చెప్పినమాటను నెరవేర్చలేక పోతారు. అధికారులతో అభిప్రాయభేదాలు వస్తవి. పిల్లల ఆరోగ్యం బాగుండదు. వారం రెండవ భాగంలో అకస్మాద్ధనలాభం ఉంటుంది. మిత్రుల ఎడబాటు కలిగే సూచన లున్నవి. భాగస్థులతో కలిసి చేయు వ్యాపార వ్యవహారాలలో నిదానము, ముందుయోచన అవసరం. డబ్బుగాని విలువగల వస్తువులు గాని పోగొట్టుకుంటారు 30, 1 లలో శుభకార్యాలు, ఇతరులకు మధ్యవర్తిత్వం చేయుట.

* * *

మకరం:

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం ధనిష్ఠ 1, 2 పా)

దైవికంగా లభించిన అవకాశాన్ని ఉపయోగించుకుని ప్రశాంతంగా వుండటం మంచిది. వ్యవహారాలను సాధ్యమైనంత రహస్యంగా జరుపుకొనటం అవసరం. అనుకున్న ప్రయాణాలు నిలిచిపోవచ్చు. బంధుమిత్రుల కార్యభారం పైనపడే అవకాశాలున్నవి. ఆరంభించిన ప్రతిపనీ పూర్తిగా నెరవేరుతుందని ఎదురు చూడతగిన సమయం కాదు. అయితే ధనసంబంధమైన చిక్కులు క్రమక్రమంగా తీరుతవి. కోర్టు కచేరీలలో పరిష్కారమార్గం లభిస్తుంది. శుభకార్య సంబంధమైన ఖర్చులు పెరుగుతవి. వుత్తరదిక్కునుంచి వచ్చేవార్తలు నిరుత్సాహకరంగా వుంటవి. ఆరోగ్యం గురించి జాగ్రత్తగా వుండండి. 5, 6 లలో కుటుంబకలహాలు, వస్తునష్టము.

* * *

కుంభం:

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)

క్రమంగా వృత్తి ఉద్యోగాలలో వున్నత స్థితిని సంపాదించుకోగలుగుతారు. ఇంతకు ముందు మీతో వ్యతిరేకంగా వుంటున్న వారితో తిరిగి స్నేహభావం లభిస్తుంది. వాహనాలు మొదలయినవి కొనటానికి అనుకూలమైన కాలం. అధికారుల సలహా సహాయము లభిస్తవి. పిల్లలకు అనారోగ్యం చేస్తుంది. కుటుంబంలో ఖర్చులు పెరుగుతవి. ఇతరుల కలహాలలో ఒకరిపక్షం చేరవలసిన స్థితి ఏర్పడుతుంది. పండితులతో మైత్రి లభిస్తుంది. యంత్రాలుగాని, కత్తులు మొదలయినవిగానివుపయోగించడంలో జాగ్రత్తగా వుండండి. కలహప్రసంగాలు ముదరకుండా చూచుకొనండి. 3, 4 తేదులలో బంధువుల రాక, సంఘకార్యాలు, గౌరవప్రాప్తి.

* * *

మీనం:

(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి)

విసుగు, విరామము లేకుండా కార్యక్రమాలు కొనసాగిస్తు వుంటారు. అయితే ప్రస్తుతం ఉపయోగం తక్కువ. పెద్దమనుష్యులతో మైత్రిలభిస్తుంది. మనస్సులో ఒకటి పెట్టుకుని పైకి మరొకటి మాట్లాడేవారు తటస్థపడతారు. మీ మనస్సుకు అసాధ్యమని తోచే పనులలో బలవంతంగా దిగవలసి వస్తుంది. కుటుంబంలో సుఖము శాంతీ లభిస్తవి. ఖర్చులు పెరిగినా ఆదాయంకూడా సంతృప్తికరంగా వుంటుంది. స్నేహితులతో కలహప్రసంగాలు వచ్చి సమసిపోతవి. గత వారంలో నిలిచిపోయిన పనులు ఈ సమయంలో క్రమంగా అనుకూలిస్తవి. అవసరం కొద్దీ నీచులతో మైత్రిచేయవలసివస్తుంది. 1, 2, 3 తేదులలో ఆదాయవృద్ధి, వృత్తిలో గౌరవప్రాప్తి, దైవకార్యాలు. ★

## ఈ వారము ధరలు

బంగారు ధర ఈ వారంలో మందీ అయ్యే అవకాశాలున్నవి. 2, 3 లలో కొద్ది తేజీ. వెండిధర వారం రెండవ భాగంలో తేజీ అవుతుంది.

నూవులనూనె ధర నిలకడగా ఉంటుంది. వేరుశెనగపప్పు ధర కొద్దిగా తేజీ వస్తుంది. నూనె ధరలలో మందీవచ్చి పెరుగుతుంది. మిర్చి ధరలో తేజీ కనుపిస్తుంది. గోధుమలకు కొద్ది గిరాకి రావచ్చు.

మినుములధర ముందుకన్నా పెరుగుతుంది. వారం రెండవభాగంలో మందీ రావచ్చు. కందులకు గిరాకి వస్తుంది.

నూలుధర పెరుగుతుంది

# అపరాజిత



గత నాలుగురోజుల్లోను జరిగిన సంఘటనలు, చెలరేగిన సంఘర్షణలు, సంక్షోభం రాజును పిచ్చివాణ్ణి చేశాయి. బీచిలో కూర్చుని యిసుకలో పిచ్చిగీతలు గీస్తూ పరిసరాలు మరచి తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

రెండు రోజులనుండి ఆఫీసు ఎగ్గొట్టి రాజు చేస్తున్న పని కేవలం ఆలోచించడం. దేనిగురించి ఆలోచిస్తున్నాడో, ఎందుకాలోచిస్తున్నాడో, పర్యవసానం ఏమిటో అతనికే ఇదమిత్థంగా తెలియదు. కన్ను మూసినప్పుడల్లా అతనికి కనిపించేది, తనలాంటి ఒడ్డూ, పొడవూ ఉన్న మనిషి. చుట్టూతా తలలు విప్పి, బుసలు కొట్టే కింగ్ కోబ్రాల మల్లే సవాలక్ష ప్రశ్నలు.

ఒక ప్రశ్నకు తావిస్తే, ఆ ఒక్క ప్రశ్న జిమెట్రికల్ ప్రోగ్రెషన్‌లో పెరిగి లక్ష ప్రశ్నలు అవుతుంది, కలరా క్రిమి మల్లే. మనిషి మరణాన్ని జయించగలడేమో గాని, తన్ను వేధించే ప్రశ్నలకు అతీతుడు కాలేడు. ఒక్కొక్క వ్యక్తి, తన జీవిత కాలంలో సమాధానం సేకరించలేని ప్రశ్నలను తన తరం వారికి, మానవాళికి స్థిర చరాస్తులుగా వదిలిపెట్టి పోతూంటాడు.

రాజుకు అందరి మల్లేనే జీవితాశయం, జీవిత పరమావధి అంటూ ఏదీ లేదు. జీవితం మీదగాని, బ్రతుకు పైగాని ఎల్లాంటి దృక్పథం ఏర్పడలేదు.

వయస్సు గడుస్తున్న కొద్దీ జీవితానికి ఒక్కొక్కటి అవసరం అవుతాయి. ఈ అవసరాల సముపార్జనే మనిషి ఆశయం. ప్రపంచంలో సుస్థిరమైనది ఏదీ లేదు. మనిషి వయస్సుతో పాటు అతని ఆశయం ఆకారాన్ని మార్చుకుంటుంది. పరిణామాన్ని పొందుతుంది. యిదే రాజు తన తల్లి తండ్రుల నుండి తెలుసుకున్నది.

మనిషి పుట్టాడు. పుట్టాడు గనుక బ్రతుకుతున్నాడు. 'జాతస్య మరణం ధ్రువం' అంటూ మృత్యువును కౌగలించుకొని అనంత విశ్వంలోనికి ఎగిరిపోతున్నాడు. అతన్ని గుర్తుతెచ్చే అతని అస్థికలు, స్మృతులు. అస్థికలు కంటికి కనుపించని చోట్లలో దాగిపోతాయి. కాల ప్రవాహపు కదలికలో [illegible] కరిగి, చెరిగిపోతాయి. చివరకు మిగిలేది ఏదీ లేదు.

జీవితపు యీ మూడు విభాగాలను ప్రధానంగా తీసుకుని 'ఎందుకు...ఏమిటి?' అని ప్రశ్నలు వేసే మనిషికి సుఖం లేదు. సృష్ట్యాది నుండి వచ్చే యీ ప్రశ్నావళికి సంతృప్తికరమైన సమాధానం దొరకదు.

బ్రతుకు గడుపుకొనే తాపత్రయంలో 'ఎందుకు?...ఏమిటి?' అన్న ప్రశ్నలు మరుపువస్తాయి. అప్రధానమైన అంశాలు ప్రధానమై, ఫండమెంటల్ కొశ్చన్స్ మరుగున పడిపోతాయి. బండినిగతుకుల్లోంచి, ముళ్లకంచెల్లోంచి, గట్టు, పుట్ట మీదుగా లాక్కుపోవడం కర్తవ్యం అవుతుంది.

బండి మీద బరువు వెయ్యి!

బరువు మీద బరువు వెయ్యి!

లాగే ఎద్దును ఉక్కిరి బిక్కిరి చేసి, ఊపిరి సలపనివ్వకండా చెయ్యి!

ఇదే రాజు తండ్రి వెంకట్రామయ్య చేస్తున్న పని.

రాజుకు ఆరు సంవత్సరాల వయస్సు రాగానే అతన్ని చదుకోమన్నారు తల్లీ తండ్రీ. చదువెందుకో తెలియక పోయినా, రాజు వారు ప్రవేశపెట్టిన బడిలో చేరి చదువుకున్నాడు. అప్పుడతని లక్ష్యం చదవడం, పరీక్షలు ప్యాసు కావడం.

చదువు పూర్తయింది. 'ఉద్యోగం చూసుకో' అన్నారు తల్లిదండ్రులు. ఉద్యోగం సంపాదించడమే తన లక్ష్యంగా తీసుకుని, చెప్పులు అరిగిపోయేలా తిరిగి తిరిగి చివరకు ఉన్న ఊళ్లోనే నూటయాభై రూపాయల జీతం మీద రాజు ఉద్యోగం సంపాదించాడు.

'ఇహ పెళ్లి చేసుకో' అన్నారు అతని తల్లి తండ్రులు. ఇంతవరకు రాజు తన తల్లి తండ్రులు చెప్పిన వాటిని దేన్నీ కాదనలేదు. వారు చెప్పినది వేదవాక్యంలా తీసుకుని ఆచరణలో పెట్టాడు. ఇప్పుడు రాజు కొంత ఆలోచించసాగాడు.

"పెళ్లెందుకు? పెళ్లి జీవితానికి ఏ విధంగా అవసరం? పెళ్లి చేసుకోకుండా మనిషి బ్రతకలేడా?"

యీ ప్రశ్నలకు సరియైన సమాధానం దొరకలేదు.

రాజు, అతని తండ్రి వెంకట్రామయ్య ప్రబల శత్రువుల మల్లే కనిపిస్తారు. ఇద్దరూ ఎప్పుడూ దూరదూరంగానే ఉంటారు. ఒకరినొకరు చూసుకోరు. మాట్లాడుకోరు. ప్రమాదవశాత్తూ ఒకరికొకరు ఎగురైతే వచ్చిన త్రోవే పుచ్చుకుంటారు



యిద్దరూ. వీరిద్దరూ కలుసుకునేది రాత్రి భోజనాల దగ్గిర.

పెళ్లి విషయంలో రాజు కనపరుస్తున్న నిర్లిప్తత వెంకట్రామయ్యకు అర్థం కాలేదు. తండ్రీ కొడుకుల మధ్య రాయబారిణి సుందరమ్మకూడా రాజు అంతర్యమేమో తెలుసుకోలేకపోయింది. భర్త తరచి తరచి వేసిన ప్రశ్నలకు ఎల్లాంటి సమాధానం యివ్వలేకపోయింది సుందరమ్మ.

ఆరాత్రి భోజనాల దగ్గిర వెంకట్రామయ్య తనంతట తానే యీ విషయం ప్రస్తావనకు తీసుకొచ్చాడు.

"నీకో అమ్మాయిని చూశానోయ్" అన్నాడు వెంకట్రామయ్య.

నములుతున్న అన్నం బుగ్గ క్రింద నొక్కి రాజు శ్రద్ధగా వింటున్నాడు.

"నీకు తెలిసే ఉంటుంది — లాయరు రాజేశ్వరం. పెద్దపేటలో ఉంటున్నాడు. వాడూ నేనూ చిన్ననాటి స్నేహితులం. సహాధ్యాయులం కూడా. అతగాడి రెండో కూతురు పిల్ల. మెట్రికు వరకూ చదివింది. వీణ వాయిస్తుంది. స్వరజతుల వరకూ నేర్చిందిట. పాట భేషుగ్గా పాడుతుంది. వంటా వార్పూ వచ్చు. రంభా, ఊర్వసీ కాకపోయినా పిల్ల సంసారపక్షంగా బాగానే వుంది. నాకూ అమ్మకూ యీ సంబంధం అన్ని విధాల నచ్చింది. మానిర్ణయమే నీ నిర్ణయమని రాజేశ్వరానికి మాట యిచ్చేశాను."

"అదేమిటండీ? పిల్లను వాడు చూచుకో నక్కర లేదా?" సుందరమ్మ ప్రశ్నించింది.

వెంకట్రామయ్య తలెత్తి సుందరమ్మ కళ్ల

లోనికి సూటిగా చూశాడు. అతని ముఖంలో ఎలాంటి భావం ద్యోతక మవటంలేదు.

"నిన్ను నేను మానే పెళ్లి చేసుకున్నానా?"

సుందరమ్మ చిన్నగా నవ్వింది. "మీ మాట మరీబావుంది! ఆరోజులు వేరు. యీరోజులువేరు. పిల్ల ఎంత అప్సరసైనా చేసుకోబోయేవాడు చూసుకోకండా ఎట్లా?"

వెంకట్రామయ్య గట్టిగా నిట్టూర్చాడు.

సరే, రేపు వెళ్లండయితే. బుధ వారం, తిథివార నక్షత్రాలు బాగానే ఉన్నాయి. ఒరే రాజూ, రేపు పిల్లని వెళ్లి చూడు. అమ్మ కూడా నీతోవస్తుంది. యీ తంతేదో పూర్తయితే వచ్చే పదిహేనో తారీఖుకే పెళ్లి."

సుందరమ్మకు ముహూర్తం నిశ్చయం చేశారన్న సంగతి తెలియదు. విస్తుపోయి భర్తకేసి చూస్తూ బొమ్మలా ఉండిపోయింది.

రాజు శిలాప్రతిమలా చలనంలేకుండా కూర్చున్నాడు తల్లి పాదాలకేసి చూస్తూ. తండ్రిగా కొడుకు అభిప్రాయం తెలుసుకోకపోవటం అటుంచి, జీవితాన్నిగురించి ఆలోచించి ఒక నిర్ణయం చేసుకోగల సంతానాన్ని అవమానించటం, నిర్దేశించటం రాజుకు గర్హ్యంగా కనిపించాయి.

"యింకా పాలిక్కళ్లు నెత్తికి రాలేదే: పెళ్లి విషయంలో నాకులేని తొందర వీళ్లకెందుకు?" కోడె త్రాచులాంటి ప్రశ్న రాజు ముందు సాక్షాత్కరించింది. తండ్రికి ఏం సమాధానం చెప్పాలో తెలియక, తన మనోభిప్రాయం ఏ విధంగా వ్యక్తం చెయ్యాలో తేలక క్షణం సతమత మయ్యాడు రాజు.

చివరకు తండ్రి భోజనం ముగించి చేయి కడుక్కునే వేళకు అన్నాడు.

"యిప్పుడు నా పెళ్లికేం తొందరలేదు."

చేయి కడుక్కునేందుకు మరచెంబు ఎత్తి వంచబోతున్న వెంకట్రామయ్య ఆగిపోయాడు. రెప్పవాల్చకండా చూశాడాయన తలవంచుకుని అన్య మనస్కంగా భోజనం చేస్తున్న రాజుని.

"వయసులో ఉన్న వాడివి నీకు పెళ్లి తొందర లేకపోయినా, వయసులు మీరి, ఆరోగ్యాలు హరించిపోయిన మాదే ఆ తొందర. మీకు ఎప్పటికేది అవసరమో ఆలోచించి, మీజీవితాలు ఒక ఒడ్డుకు చేర్చడమే యిప్పటి మా కడ జీవితాల కర్తవ్యం. మా బాధ్యతలు సక్రమంగా నిర్వహించి సాధ్యమైనంత మేరకు సమస్యలకు దూరంగా వైదొలగి మా చివరి బ్రతుకులు గడుపుకోవాలనే మా నిశ్చయం."

రాజు తండ్రిని క్రీగంట చూశాడు. కనుబొమ్మలు ముడిచి సమాధానం కోసం నిరీక్షిస్తున్నట్లు రాజు కేసి తదేకంగా చూస్తున్నాడాయన. రాజు చటుక్కున తల దించాడు.

# అపరాజిత

"నేను కొంతకాలం ఒంటరిగానే ఉండదలచాను.

వెంకట్రామయ్య గొంతులోని కటువుతనం కట్లు తెంచుకుంది.

"ఎంతకాలం ఒంటరిగా ఉండదలచావు? ఒకరోజా, నెలా సంవత్సరమా? ఎంతకాలం?"

జవాబు దొరక్క రాజు ముళ్లమీద కూర్చున్నట్లు బాధపడసాగాడు. కొడుకు సందిగ్ధావస్థకని పెట్టి వెంకట్రామయ్యటూకాయించాడు.

"ఏం? ఎంతకాలం బ్రహ్మచారిగా ఉంటావ్?"

రాజులో నిద్రాణంగా ఉన్న మొండితనం, పట్టుదల తొంగిమాశాయి. తండ్రి అంటే ఉన్నభయంపోయి కోపం మొలకెత్తింది. కలుపుకున్న మజ్జిగ అన్నం ముట్టనైనా ముట్టక బొడబొడ నీళ్లుపోసి కంచంలో చెయ్యి కడుక్కుని లేచి పీటమీద నిలబడ్డాడు రాజు. అతనికళ్లు ఎరుపెక్కాయి, మాట తడబడి అస్పష్టమైంది.

"యిప్పుడు నాకు పెళ్లి అవసరమని తోచలేదు. నేను పెళ్లికి సుముఖంగా ఉన్నప్పుడు మీ బాధ్యత మీరు నిర్వహించి నా బాధ్యతలు యితోధికంగా పెంపు చెయ్యొచ్చు."

వెంకట్రామయ్యకు యీ జవాబుతో నెల్లవగా కోపమొచ్చింది. నిగ్రహించుకుందికి ప్రయత్నం చెయ్యలేదాయన.

'అయితే నీదేనా నిర్ణయం?"

రాజు మాట్లాడలేదు.

"ఊం. యింతవరకూ వచ్చావన్నమాట! మరేం. తొండముదిరి ఊసరవిల్లి అయింది. కనిపెంచినవాళ్లం మమతలు, మమకారాలు ఉంటాయిగాని, చేజేతులా నీ చెడుకోరి కాలకూట విషాన్ని తినిపించం. మా జీవితానుభవాలు వెనకేసుకుని చేసిన నిర్ణయం యిది. నిర్లక్ష్యం, ఉద్రేకాలు మనిషి సుఖపడేందుకు దోహదం చెయ్యవు. యీ రెంటికీ లొంగిపోయే వయస్సులు మీవి. నీ అవివేకపు ఆలోచనలతో, నిర్ణయాలతో నీ జీవితం దుఃఖభాజనం చేసికొని, మాకడజీవితాలు కష్టపూరితం చేసే అధికారం నీకు లేదు. రాజేశ్వరం నా ఆప్తమిత్రుడు. డొక్కశుద్ధి, చిత్తశుద్ధి ఉన్న మనిషి. సంస్కారం సంప్రదాయం ఉన్న సంసారం అతనిది. నామాట కాదనవని అతనికి మాటయిచ్చాను. ఈ సంబంధం జరిగి తీరాలి. తల్లి తండ్రులని ఏమాత్రం గౌరవమున్నా నువ్వు మాకు ఎదురుచెప్పకుండా ఉండడమే నీ ధర్మం. రేపు పెళ్ళి చూపులకు మారుమాట్లాడక వెళ్ళు."

వెంకట్రామయ్య ఆదరాబాదరాగా చెయ్యి కడుక్కుని వెళ్లిపోయాడు. కళ్లనీళ్ల పర్యంతం అయి రాజు తన గదిలోనికి నడిచాడు.

నిముషాలు గడుస్తున్న కొద్దీ రాజులో జడత్వం ఎక్కువైంది. ఏ కారణం చేతనో ఒంటరిగానే, సాధ్యమైతే జీవితాంతం బ్రహ్మచారిగానే ఉండిపోవాలన్న పట్టుదల అతనిలో ఘనీభవించింది.

మర్నాడు సాయంత్రం వేళకు సుందరమ్మ కొడుకును బలవంతంగా పెళ్లిచూపులకు తీసుకువెళ్లింది. రాజు దృష్టి ఎటుందో తల్లికి తెలియలేదు. పిల్లను చూడలేదేమో అన్న అనుమానం పీకుతూనే సుందరమ్మ యింటికి తిరిగి వచ్చింది.

"పిల్లను చూశావా? నచ్చిందా?" అని సుందరమ్మ పదేపదే వేసినప్రశ్నలకు రాజు సమాధానం యివ్వలేదు. బండరాయి మల్లే ఉలుకూ పలుకూ లేక వాలుకుర్చీలో కూర్చున్నాడు; కిటికీ చువ్వలగుండా శూన్యంలోకి చూస్తూ.

ఆరాత్రి తండ్రికంటె ముందుగానే భోజనంచేసి రాజు తనగదిలో కూర్చున్నాడు. వెంకట్రామయ్య సుందరమ్మ ముఖంచూసి విషయం గ్రహించి రాజు గదిలోనికి నేరుగా వెళ్ళాడు. తండ్రిరాక గమనించి కుర్చీలోంచి లేచి నిలబడ్డాడు రాజు.

"పిల్లను చూశావా?"

రాజు చూశానని తలూపాడు.

"పిల్ల నచ్చిందా?"

రాజు ప్రత్యుత్తర మివ్వలేదు. వెంకట్రామయ్య రెండోసారి ప్రశ్నించాడు.

"నచ్చలేదు"

రాజు జవాబు వెంకట్రామయ్యను ఏవిధంగానూ ఆశ్చర్యపరచలేదు.

'ఎందుకు నచ్చలేదు? పిల్లలో ఏంలోటు"

"నాకు తెలియదు"

"అయితే నీకు తెలిసిందేమిటి? పిల్ల నచ్చకపోవటం అంతేనా? నీతత్వం నాకర్థం కాకపోలేదు. పెళ్లి జరక్కండా ఉండేందుకు నువ్వు వేస్తున్న ఎత్తులివి. వీటికి సమాధానం ఏవిధంగా చెప్పాలో నాకు తెలుసు" వెంక

పెద్దమనిషి—ఏమండీ, 'ఆదివారం సెలవు' అని బోర్డు తగిలించి దుకాణం తెరిచారేమండీ?

దుకాణం యజమాని-సెలవు ప్రజలకుగాని దుకాణానికి కాదండీ.

ఆల్‌ఫ్రెడ్ జాన్‌సుందరం (అనంతపురం)

్రామయ్య పెల్లుబికివచ్చే కోపాన్ని దిగ మింగుతూ వెళ్లిపోయాడు.

ఆ రాత్రి కొడుకు పెళ్లి విషయంలో భార్యా భర్తలకు మాటా మాటా పెరిగాయి. రాజును సమర్థించబోయిన సుందరమ్మ వెంకట్రామయ్య కోపానికి గురి అయింది. తల్లి పడేతిట్లు విని రాజు విపరీతంగా బాధ పడ్డాడు. తండ్రి అంతర్యం తెలియక ఆరోజునుండి నిద్రకు దూరమై పోయాడు రాజు.

ఆ వేళనుండి వెంకట్రామయ్యసుందరమ్మల మధ్య మాటలులేవు. యిద్దరిమధ్యా అగాధ మేర్పడి ఎడముఖం పెడముఖంగా తయారయ్యారు. సుందరమ్మ రాజుతో కూడా పూర్వంలా ఉండడంలేదు. యిద్దరిమధ్యా మాటలు అవసరాన్నిబట్టి ముక్తసరిగా జరుగుతున్నాయి. ఇల్లు నీరసమైంది. శాంతికి దూరమైంది.

యీస్థితి నాలుగురోజులు వైదొలగకండా ఉండిపోయింది.

యింట్లో, మనసుల్లో చెలరేగిన అశాంతిని భరించలేక తన నిర్ణయాన్ని మార్చుకుందికి ప్రయత్నించాడు రాజు. కాని తండ్రి వైఖరి అనుచితంగా, క్రూరంగా కనిపించింది. తండ్రి అన్న మాటలకు అభిమానం దెబ్బతిని సంతత ధారాపాతంగా ఏడుస్తూ కుమిలిపోతున్న తల్లి దీనవదనం రాజుకు తండ్రిపై గల గౌరవ భావాన్ని పూడ్చి, అతని పట్టుదలను ద్విగుణీకృతం చేసింది తాబేలులా ముడుచుకుపోయాడు రాజు.

చీకటి పడుతోంది. వీధి దీపాలు వెలిగాయి. దివి వెలిగే చంద్రునికి కిలకిలా నవ్వే నక్షత్రాలకు స్వాగతం పాడుతూ, యినుమడించిన ఉత్సాహంతో చెయ్యెత్తు కెరటాలు విసుర్తోంది సముద్రం.

రాజు సిగరెట్ ముట్టించి ఆరిన అగ్గిపుల్ల పారెయ్యబోతూ, దాపున వినబడే గాజుల సవ్వడి విని ఆగి, చప్పుడు వినబడే దిక్కు తల తిప్పి చూశాడు. ఎవరో అమ్మాయి. పదునెనిమిదేళ్ల పడుచు అతనికేసే చూస్తోంది దాపున కూర్చుని. రాజు గుండెలు వేగంగా కొట్టుకున్నాయి. ఆమెకేసి పరీక్షగా చూశాడు. చొరవగా ఆమె నమస్కారం చేసి చిన్నగా నవ్వింది. రాజు ఉక్కిరిబిక్కిరయ్యాడు. చీకటికి అలవాటుపడ్డ కళ్ళు వెలుగు చూడగానే గ్రుడ్డి అయినట్లు రాజు కళ్లు బైర్లు కమ్మాయి.

"క్షు. మించాలి! మీరెవరో ... నాకు తెలియదు" వయసులో వున్న వాడికత్తితో మాట్లాడ్డం రాజుకది మొదటిసారి.

"అబద్ధం ఆడుతున్నారు" ఆమె నవ్వుతూ అంది.

"యధార్థం అది."

"అదే నిజమైతే మిమ్మల్ని మీరు తెలుసుకునే స్థితిలో లేరని నేననుకోవాలి. నేను రాజేశ్వరంగారి అమ్మాయిని. నా పేరు జ్యోతి."



"నాకు తెలీదమ్మా! ఒకవేళ నాన్నేమన్నా పావలాను గణపతి బొడ్డులోంచి తన బొడ్డులోకి దోపుకున్నాడేమో చూడు!!

చిత్రకారుడు: నాగరాజ (ప్రొద్దుటూరు)

రాజు త్రుళ్లిపడ్డాడు. ఆమెనే తను పెళ్లి చూపులు చూసేందుకని వెళ్లినది

"వెన్నెల్లో మిల మిలా మెరిసిపోతూ ఎంత అందంగా వుంది! యీమే నా భావికి జ్యోతి! ఒంటరిగా వచ్చినట్లుంది? ఎంతసేపటినుండి యిక్కడ కూర్చుంది? ఏం చేస్తోంది? కావాలని యిక్కడవచ్చి కూర్చుందా? ఉరుములేని పిడుగులా యీ రాకేమిటి? సిగ్గు పడటంలేదు? చాలా చనువుగా మాట్లాడుతోంది! గొంతు ఎంత మధురంగా ఉంది!" రాజు మేధస్సులో యిలాంటి ప్రశ్నలు, ఆశ్చర్యార్థకాలు వందలుగా మెరిశాయి. ఆ క్షణమే మరుగుపడిపోయాయి.

"మన్నించండి...చీకట్లో..."

"వెన్నెల వుంది?" జ్యోతి వినిపించేటట్లు నవ్వింది.

రాజు సిగ్గుతో ముడుచుకుపోయాడు.

"మీరు అపార్థంచేసుకోరంటే ఒక టడుగుతాను సమాధానం చెప్తారా?" జ్యోతి దిక్కులు చూస్తూ ప్రశ్నించింది.

"తప్పకుండా."

"మొన్న మీరు పెళ్లిచూపులకని వచ్చారు. నచ్చలేదని.. అన్నారని విన్నాను. నాలోని లోపం దయచేసి చెప్తారా?" జ్యోతి గొంతు అభిమానంతో, స్వాతిశయంతో, కోపంతో గద్గదం అయింది. ఆమె కన్నులనుండి వేడి కన్నీటిబొట్లు క్రిందకు జారి పడ్డాయి.

రాజు ఆమె ప్రశ్న విని గాలిలో పల్టీలు కొట్టాడు. పటాపంచలైన స్థిమితాన్ని కూడ దీసుకుని బిడియపడుతూ, తన్ను తాను చీదరించుకుంటూ అన్నాడు

"మీరెక్కడ విన్నారోగాని అది శుద్ధాబద్ధం."

జ్యోతి కిలకిల నవ్వింది. మరుక్షణంలో ఆమె ముఖంలోని నవ్వు మాయమై గంభీరమైంది.

"నేను మిమ్మల్ని యిట్లా నిలవదీసి అడుగుతున్నందుకు మన్నించండి. మీ అభిప్రాయం తెలియకముందే నేను మిమ్మల్ని నచ్చలేదని అని, ఆ కబురు మీరు వింటే మీ మనోభావాలు ఎట్లా వుంటాయి?"

యీ ప్రశ్నతో రాజుకు ముచ్చెమటలు పోశాయి. తన్నెవరో క్రిందపడదోసి కుమ్ముతున్నట్లు బాధపడసాగాడు. అప్రయత్నంగా అతని కన్నులు చెమ్మగిల్లాయి.

"మీ భావం నాకు అవగతం కాకపోలేదు. యీరోజుల్లో పెళ్లిళ్లు బాహ్యసౌందర్యాన్ని, అలంకారాన్ని బట్టి జరుగుతున్నాయిగాని వ్యక్తి సంస్కారాన్ని, హృదయసౌందర్యాన్ని పరికించి కాదు. మనిషిని అర్థం చేసుకునేందుకు కలయిక అవసరం. అది పాశ్చాత్యదేశాల్లో సాధ్యంకాని, యీ పవిత్ర భారతదేశంలో దుస్సాధ్యం. మీ విషయంలో అలాటి నిర్ణయానికి నేను రాలేను. కౌగలించుకోబోయే కాంతిపుంజాన్ని బైటికి నెట్టి చీకటిలో ముడుచుకుపోయే మనిషిని కాదు. పుత్తడిబొమ్మలా వున్న మిమ్మల్ని కాదని ఆత్మవంచన చేసుకోలేను."

"అతిశయోక్తుల్లో మాట్లాడుతున్నారు?"

"నిజం చెప్పాను. మీరు గ్రహించినా, కాదన్నా నా నిర్ణయం ఒక్కటే!"

"ఏమిటో ఆ నిర్ణయం?" జ్యోతి చీర చెంగులో ముఖం దాచుకుని ప్రశ్నించింది.

రాజు నవ్వకుండా ఉండలేకపోయాడు.

"మీ హృదయారామంలో కొత్త చోటు యివ్వమని అర్థించడమే.. "

జ్యోతి సిగ్గుపడుతూ అన్నది "నా హృదయం ఎవరో దొంగిలించారు!" అని ఉబికివచ్చే నవ్వును అతికష్టంమీద దిగమ్రింగుకుంది జ్యోతి.

"ఎవరో ఆ దొంగ?" రాజు ఆమె కళ్లలోకి చూస్తూ ప్రశ్నించాడు.

"ఆ రాజు నడగండి" జ్యోతి చంద్రుని వంక చూపించి, నవ్వుతూ లేచి సెలవు పుచ్చుకుని వెళ్లిపోయింది.

దిగులు పటాపంచలై, రాజు ఆడుతూ, పాడుతూ యిల్లు జేరుకున్నాడు. వంటింట్లోవున్న తల్లి దగ్గరకు నేరుగాపోయి ఆమె చెవిలో ఏదో చెప్పాడు.

# అపరాజిత

సుందరమ్మ నవ్వుతూ "అమ్మ దొంగ భడవా!" అని రాజు బుగ్గమీద చరిచింది.

రాజూ, జ్యోతుల వివాహం అనుకున్నట్లుగా వెంకట్రామయ్య నిశ్చయించిన ముహూర్తానికే అయింది.

యీనాళ్ల నాటివిందులో వెంకట్రామయ్య వియ్యంకుడు రాజేశ్వరంతో అన్నాడు.

"యీ రోజుల్లో కుర్రాళ్లు తమకు ఎదురు చెప్పేశక్తి లేదని, తాము చేసుకున్న నిర్ణయాలే గొప్పవని భ్రమలో వుంటారు తల్లిదండ్రులపైనున్న గౌరవం, భక్తిపోయి వారికే ఎదురు తిరుగుతారు. కాని వీళ్లను పిడికిల్లో బిగించి ఊపిరి సలపనివ్వకుండాచేసే శక్తి ఉందని, ఆ శక్తిముందు మహా సామ్రాజ్యాలే మంట గలిశాయని, ధీరులు, ధీమంతులు బానిసలై తలలు వంచారని, పాపం! యీ కుర్రకారుకి తెలియదు."

సరసనే కూర్చుని విందు భోజనంచేస్తున్న జ్యోతి మామగారితోపాటు నవ్వింది.

"పెళ్లి పెడాకులు చేసుకోక ఘోటక బ్రహ్మచారిలా వుంటానన్నవాడి ముక్కుకి తాడు కట్టి దారిలోకి తీసుకొచ్చావ్. మరి నాలుగు లడ్డూలు తిను" సుందరమ్మ కోడలు వద్దంటున్నా పళ్లెంలోని లడ్డుండలు ఆమె విస్తరిలో పడేసిపోయింది.

రాజు విస్తుపోయి నవ్వే జ్యోతికేసి చూస్తూ ఉండిపోయాడు. అతని సందేహాలు సారె గదిలో గాని తీరలేదు. 

మన దేహస్థితి

# ఇన్‌ఫ్లమేషన్

గతవారం ఇన్‌ఫ్లమేషన్ను గురించి కొంత వరకు తెలుసుకున్నాము. శరీరంలో అనేక టిష్యూలు ఉన్నవనీ, ఏ అంగమైనా కొన్నిరకముల టిష్యూల కలయికవలన ఏర్పడుతుందనీ, ఒక టిష్యూ ఒకేరకము జీవకణముల సముదాయమనీ ఇదివరకే తెలుసుకున్నాము.

టిష్యూను మందమైన ఆకుతో పోల్చవచ్చును. టిష్యూలో రక్తనాళము శాఖోపశాఖలు, నరములు, ఆకులో ఈనెలవలెనే అల్లుకొని ఉంటవి. రక్తనాళములేకాక లింఫునాళములు కూడా టిష్యూలలో విరివిగా ఉంటవి

జీర్ణకోశంలో జీర్ణమయిన ఆహారం, పోర్టల్ వెయిన్ ద్వారా లివరులోకిపోయి, అక్కడనుంచి హృదయంలోకి పోతుందని తెలుసుకున్నాము. హృదయాన్ని గురించి, దేహంలో రక్తప్రవాహాన్ని గురించి విపులంగా ఆ కోశవ్యాధులను గురించి వివరిస్తున్నప్పుడు చర్చిస్తాను. హృదయంనుంచి కొన్ని రక్తనాళములు శరీర భాగములలోకి రక్తాన్ని తీసుకొని వెళ్లుతవి. వీటిని ఆర్టెరీలు అంటారు. రక్తంలో (ఎర్రని కణములు) రెడ్ బ్లడ్ కార్పసిల్సు; (తెల్లని కణములు) ల్యూకోసైట్సు; ప్లాస్మా అనే ద్రవపదార్థము; ఆహారపదార్థములు ఉన్నవి. శరీరభాగములనుండి మరొకరకమైన రక్తనాళములు రక్తాన్ని హృదయంలోకి తీసుకుని వస్తవి. వీటిని వెయినులు అంటారు. ఊపిరితిత్తులలో ప్రవహించి వచ్చిన రక్తంలో ఎర్రని రక్తకణములనిండా ఆక్సిజన్ (ప్రాణవాయువు) ఆవరించి ఉంటుంది, ఆర్టెరీ రక్తంలో ఆహారపదార్థములూ ఉంటవి. చెట్టు కొమ్మలలాగే ఆర్టెరీ శాఖోపశాఖలుగా చీలి చివరకు, ఉల్లిపొర కాగితంవంటి, గోడ కలిగిన కేపిలరీ అనే రక్తనాళ విశేషంగా మారుతుంది. ఆ కేపిలరీ రెండవ కొననుంచి చిన్న వెయినులు ఏర్పడి, ఒకదానితో ఒకటి కలిసి పెద్ద వెయినులుగా ఏర్పడి, రక్తమును హృదయంలోకి తీసుకుని వెళ్ళుతవి. ఆర్టెరీ గోడ మందంగా ఉంటుంది. వెయిన్ గోడ పల్చగా ఉంటుంది.

కేపిలరీలో ఉన్న రక్తంలో నుంచి ప్రాణవాయువు, ఆహారపదార్థములు కేపిలరీ గోడలోనుంచి బయటకివచ్చి కేపిలరీని చుట్టి ఉన్న టిష్యూలో జీవకణములను, పంటకాలవ చేనును తడిపినట్లుగా తడిపివేస్తుంది. ఆక్సిజన్ సంపర్కంతో ధాతువులు దహనమై శక్తి పుడుతుంది. కాని కార్బన్-డై-

డా॥ గాలి బాలసుందరరావు

ఆక్సైడ్ అనే బొగ్గుపులుసు గాలి యూరియావంటి వ్యర్థ పదార్థములు కూడా ధాతు దహనానికి ఫలితంగా ఏర్పడుతవి. ఆక్సిజను కోలుపోయిన ఎర్రరక్తకణములు, కొంత ప్లాస్మా మళ్లీ వెయినుల ద్వారా హృదయాన్ని చేరుకుంటవి. కాని టిష్యూలోకి ప్రవహించిన ప్లాస్మా అంతా కేపిలరీలోకి తిరిగిరాదు

పటములో చూపించబడినట్లుగా ప్రతి టిష్యూలోను, జీవకణముల మధ్య ఖాళీప్రదేశములుంటవి. ఈ ఖాళీప్రదేశములలో టిష్యూ ఫ్లూయిడ్ అనే ద్రవపదార్థం ఉంటుంది. ఈ ద్రవపదార్థములో జీవకణములు మునిగి ఉంటవన్నమాట. ఈ ఖాళీ ప్రదేశములనుంచి సన్నని లింఫునాళములు బయలుదేరుతవి. వెయినులలాగే చిన్న శాఖలు కలిసి పెద్ద శాఖలై పెద్దలింఫునాళం ఏర్పడుతుంది. ఈ నాళం, హృదయంలో ప్రవేశించే పెద్ద వెయినులో కంఠం సమీపంలో కలిసిపోతుంది. ప్రతి లింఫునాళము, తనగతిలో, చిక్కుడు గింజలవంటి గ్రంథులలో ఒక ప్రక్కనుంచి ప్రవేశించి మరొకప్రక్కనుంచి బయటికి పోతూ ఉంటుంది. ఈ చిక్కుడు గింజలవంటి నిర్మితులను లింఫు గ్లాండులు అంటారు. కేపిలరీ గోడ ఉల్లిపొర కాగితం వంటిది. అందులోనుంచి ప్లాస్మా,

# మనము-మన దేహస్థితి

టిష్యూఫ్లూయిడ్‌లోకి, టిష్యూఫ్లూయిడ్ ప్లాస్మాలోకి ప్రవహిస్తుంది. ఎప్పుడు ప్లాస్మా టిష్యూఫ్లూయిడ్‌లోకి పోవాలో, ఎప్పుడు టిష్యూఫ్లూయిడ్ కేపిలరీలోనికి రావాలో, మెదడు నిర్ణయిస్తుంది. ఆ నిర్ణయం ప్రకారం కేపిలరీ గోడలో రంధ్రములు చిన్నవీ పెద్దవీ అయి ఈ వినిమయము సాధ్యమౌతున్నది. కేపిలరీ ఆర్టెరీశాఖ చివర భాగమనీ, ఆ కేపిలరీ చివర భాగమే చిన్న వెయిను ఆరంభమనీ ఇదివరకే తెలుసుకొన్నాము. టిష్యూలోకి పోయిన ప్లాస్మాలో కొంతభాగము ధాతు దహనం వల్ల ఉద్భవించిన వస్తువులలో కొన్ని చిన్న వెయినుల ద్వారా హృదయానికి పోతవి. కాని, టిష్యూలో జీవకణమధ్య ప్రదేశముల నుండి లింఫాటిక్స్ అనే సన్నని నాళములు బయలుదేరి, ఒకదానితో ఒకటి కలిసి పెద్ద లింఫునాళములై కంఠ సమీపంలో పెద్ద వెయినులలో కలిసిపోతవి. లింఫాటిక్స్‌లో ఉన్న ద్రవపదార్థాన్ని లింఫు అంటారు. టిష్యూఫ్లూయిడ్ కన్నా లింఫు చిక్కగా ఉంటుంది. శరీరంలో రక్తం పుష్కలంగా ప్రవహించే లివరు, ఊపిరితిత్తి ఇటువంటి అవయవములలో లింఫాటిక్స్ తక్కువగా ఉంటవి. ఇతర ప్రదేశములలో ఎక్కువగా ఉంటవి. క్రిములు ఒక ప్రదేశంనుంచి మరొక ప్రదేశమునకు పోవడం ఎక్కువగా లింఫు నాళముల ద్వారా జరుగుతుంది. ఈ నాళములలో ఉన్న క్రిములను, హానికర పదార్థములను లింఫుగ్లాండులు, జల్లించి తములో నిలుపుకొని పైకి పోనివ్వవు. అందుకనే ఇన్‌ఫ్లేం అయిన ప్రదేశానికి పరిసరములలో ఉండే లింఫుగ్లాండులు పెద్దవౌతవి, చేతిమీద గజ్జి లేచినప్పుడు చంకలోను, కాలిమీద కురుపు లేచినప్పుడు గజ్జలలోను బిళ్లలు కట్టడానికి ఇదే కారణం. ఒక్కొక్కప్పుడు లింఫుగ్లాండులే ఇన్‌ఫ్లేం అయి, నశించి చీము ఏర్పడవచ్చును.

శరీరభాగం ఇన్‌ఫ్లేం కాంగానే అక్కడ అయిదు మార్పులు జరుగుతవి.

(1) ఆ భాగం పెద్దది కావడం.

(2) ఆ భాగంలో రక్తస్రావం అధికమై అది ఎర్రబడడం.

(3) ఆ ప్రదేశములో బాధ యేర్పడడం.

(4) ఆ ప్రదేశంలో క్రిములనుండి పుట్టే 'టాక్సినులు' అనే వస్తువుల వల్ల శరీరధాతువులు రసాయనిక వికృతులుపొంది, అక్కడ వేడి యేర్పడి, ఆ భాగం వెచ్చబడడం; జ్వరం రావడం.

(5) ఆ భాగం నిర్వహించే విధులకు ఆటంకం కలగడం. శరీరభాగం పెద్దదయినప్పుడల్లా ఇన్‌ఫ్లేం అయిందనుకోవడం పొరపాటు. పురుగు కుట్టినప్పుడు, శరీరానికి పడని పదార్థములు తిన్నప్పుడు, నీరు గాచినప్పుడు, శరీరభాగములు పెద్దవి కావచ్చు ఈ భాగం ఇన్‌ఫ్లేం అయింది అని నిర్ణయించడానికి పై లక్షణములలో మొదటి నాలుగైనా ఉండాలి.

రక్తంలో లూకోసైటులు అనే తెల్లని జీవకణములు ఉన్నవి అని ఇదివరకే చెప్పాను. ఇందులో చాలా రకములు ఉన్నవి. అందులో పాలిమార్ఫ అనే లూకోసైట్ మంచి తర్ఫీదు పొందిన సైనికుడు వంటిది "పాలీ" అంటే అనేకమయిన "మార్ఫ" అంటే ఆకారం గలది; అని అర్థం. ఈ లూకోసైట్ తనంతటతానే, తన శరీరం ఆకారమును వానపాములాగా మార్చుకుంటూ ఒక చోటినుంచి మరొక చోటికి పోగల శక్తి కలది. ఇంతేకాదు దీనిలో ఉండే న్యూక్లియస్ కూడా రెండు మూడు కొమ్ములు కలిగి ఉంటుంది. జీడిగింజ ఆకారం గల న్యూక్లియస్ కలిగిన లూకోసైట్ ఉన్నది. గుండ్రని ఆకారంగల న్యూక్లియస్ ఉన్న లూకోసైట్ ఉన్నది. వీటన్నింటిలోను, "సైటోప్లాజము" అంటే సెల్‌లో ఉండే గుజ్జు - మునసెలాగా నిర్మలంగా ఉంటుంది. కాని పాలిమార్ఫ, ఇయొసినోఫైల్ అనే లూకోసైట్లలో సైటోప్లాసం కణములు, ఇసకలాగా విడి విడిగా పెద్దవిగా ఉంటవి. ఇయోసినోఫిల్ న్యూక్లియస్‌లో రెండు కొమ్ములు మాత్రమే ఉంటవి. కొన్ని పరిస్థితులలో ఇయొసినోఫిల్ లూకోసైట్లు విపరీతంగా పెరిగి, అతిశీఘ్రంగా నశించి, అందులోనుంచి వచ్చే పదార్థములవల్ల శ్వాసకోశం కౌడ్సు, దగ్గు జ్వరం, జలుబు తరుచు ఉబ్బసం వస్తవి

## లూకోసైటులు













ఒక శరీర భాగంలో క్రిమి దోషం ఏర్పడగానే ఆ ప్రదేశంలో రక్తప్రవాహం అధికం అవుతుంది. రక్తంలో లూకోసైట్ల సఖ్యం అధికంగా పెరిగిపోతుంది. సాధారణంగా ఘన మిల్లిమీటరు పరిమాణం గల రక్తంలో 5000 నుంచి 10,000 దాకా లూకోసైట్లు ఉంటే క్రిమి దోషం ఏర్పడ్డప్పుడు 20,000 నుంచి 1,50,000 దాకా పెరిగిపోవచ్చును. ఇందులో పాలిమార్ఫ్‌ల సంఖ్య అధికంగా ఉంటుంది. క్రిమిదోషం లేకుండానే లూకోసైట్లలో కొన్ని రకములు విపరీతంగా పెరగవచ్చును. సందర్భము వచ్చినప్పుడు ఆ విషయం చర్చిస్తాను.

ఈ పాలిమార్ఫ లూకోసైట్లకు క్రిములను సమీపించి వాటిని తమశరీరంతో చుట్టుముట్టి, దిగమింగి, జీర్ణం చేసుకునే శక్తి ఉన్నది. ఆ ఉద్యమంలో లూకోసైట్ చచ్చిపోవచ్చును. అంటే దేశ సంరక్షణకై సైనికులు ఉన్నట్లే దేహమును క్రిముల ధాటి నుండి కాపాడడానికి లూకోసైట్లు ఉన్నవన్నమాట.

ఇన్‌ఫ్లేం అయిన భాగంలో రక్త ప్రవాహం అధికం కాగానే కేపిలరీలు చిన్న వెయినులు ఉబ్బిపోతవి. వాటి గోడలు చిట్లి, టిష్యూలోకి, లూకోసైట్లు ఎర్ర రక్తకణములు విరివిగా ప్రవేశిస్తవి. క్రిములతోను క్రిములు తయారుచేసే విష పదార్థములవల్ల నశించిన జీవాణువులతోను, క్రిములను దిగమింగి నశించిన, నశిస్తున్న లూకోసైట్లతోను, ఇన్‌ఫ్లేం అయిన భాగం ఉబ్బిపోతుంది. అప్పుడు ఆ టిష్యూలో ఉన్న నరములమీద ఒత్తిడి ఏర్పడి నొప్పి ఏర్పడుతుంది. కొద్ది ప్రదేశం మాత్రమే ఇన్‌ఫ్లేం అయినప్పుడు, అంగము తన ధర్మమును పూర్తిగా మానివేయదు. కాని ఇన్‌ఫ్లమేషన్ తీవ్రంగా ఉన్నప్పుడు... శరీరాంగములు తమ విధ్యుక్తధర్మములను నిర్వర్తించలేవు. ఒకభాగం తన పని మాని వెయ్యగానే, దాని ప్రభావము ఇతర భాగములమీద కూడా ప్రసరించుతుంది.

శరీరంలో టిష్యూలు క్రిమిదోషానికి గురి అయినప్పుడు, ఆ పరిస్థితిని "ఇన్‌ఫెక్షన్"

(Infection) అంటారు. అయితే ఇన్ఫెక్షన్ ఏర్పడ్డప్పుడల్లా ల్యూకోసైట్లు వృద్ధి కావు. టైఫాయిడ్, ఇన్ఫ్లుయెంజా, మలేరియా వంటి కొన్ని పరిస్థితులలో ల్యూకోసైట్లు ఉండవలసిన సంఖ్యకన్న తగ్గిపోతవి. ఈ ల్యూకోసైట్లు ముఖ్యంగా బొమికలలోపల ఉన్న మాంసం గుజ్జులలో తయారవుతవి. లింఫోసైట్లు లింఫుగ్లాండ్లలో ఉత్పత్తి అవుతవి. ఈ ల్యూకోసైట్ల తగ్గుదల, వాటి ఉత్పత్తి తగ్గినందువల్ల కావచ్చును. లేక అవి విపరీతంగా నశించినందువల్ల కావచ్చును.

క్రిములు టాక్సినులు అనే విషపదార్థములను ఉత్పత్తి చేస్తవి. టిష్యూలు ఇన్ఫ్లేం కావడం ఈ టాక్సినులవల్లనే. ఈ టాక్సినులు విపరీతం అయినప్పుడు టిష్యూలో కొంత భాగం చచ్చిపోయి, అది కరిగిపోతుంది అల్లా కరిగిన భాగము, ఘనీభవించిన టిష్యూ ఫ్లూయిడ్ చచ్చిన ల్యూకోసైట్లు, ఎర్ర రక్త కణములు, క్రిమిదోషములు, ఇవన్నీ కలిసి చీము అవుతుంది.

క్రిమిదోషం ఏర్పడగానే రక్తంలో ల్యూకోసైట్లు వృద్ధి కావడమే కాదు. ఆయా క్రిములను మాత్రమే మ్రింగివేయగల ప్రత్యేక కణములు రక్తంలో విరివిగా ఏర్పడతవి. వీటిని "యాంటి-బాడీలు" అంటారు. 'యాంటి' అంటే వ్యతిరేకమైన బాడీలు అంటే శరీరాలు అని అర్థము. ఒక్కొక్కప్పుడు జన్మతః ఈ యాంటిబాడీలు శరీరంలో ఉంటవి. అటువంటి వారికి కొన్ని వ్యాధులు రానేరావు. ఒక్కొక్కప్పుడు కృత్రిమంగా టీకాలవల్ల ఈ యాంటిబాడీల సంఖ్యను దేహంలో అధికం చేయవచ్చును. అప్పుడు ఆ వ్యాధి రాకపోవడమో, వచ్చినా ప్రాణాపాయం కలిగించకుండా తేలికగా దాటిపోవడమో జరుగుతుంది. ఈ విషయం చాలా ముఖ్యమైనది. సందర్భం వచ్చినప్పుడు ఇంకా విపులంగా చర్చిస్తాను.

శరీర ద్రఢిమకలవారిలో, ల్యూకోసైట్ల అధికోత్పత్తివల్ల శరీరంలో యాంటిబాడీల ఉత్పత్తి, ఉనికివల్లా క్రిమిదోషం యేర్పడ్డా అతి శీఘ్రకాలంలోనే అవి అంతరించి టిష్యూలు తిరిగి పూర్వస్థితికి రాగలుగుతవి. కానిఆరోగ్యనిరోధకశక్తియో, రోగసంహారకశక్తియో శరీరంలో లేనప్పుడూ, క్షీణించినప్పుడూ, టిష్యూలు పూర్తిగా తేరుకోవు. వాటిలో కొన్ని మార్పులు జరిగి ఇన్ఫ్లమేషన్ రూపాంతరం పొంది మిగిలిపోతుంది. దాని ఉధృతం తగ్గిపోయినా పూర్తిగాపోదు. అప్పుడు కొన్ని దీర్ఘవ్యాధులు ఏర్పడతవి. అటువంటి పరిస్థితిలో టిష్యూలలో కొన్ని మార్పులు జరిగి ఆ ఇన్ఫ్లమేషన్ ఒకచోటనే పరిమితమై విస్తరించడానికి వీలులేకుండా ఉంచడానికి శరీరరక్షణవిధానం ప్రయత్నిస్తుంది.

టిష్యూ ఇన్ఫ్లేం కాగానే ఆ భాగం ఉబ్బుతుంది అని తెలుసుకున్నాము. ఈ అధిక ద్రవములన్నీ ఏమవుతవి? కొంత వెయినుల ద్వారా రక్తప్రవాహంలోకి పోతుంది. కాని క్రిములు ఇతర విషపదార్థములు, లింఫాటిక్స్‌లోకి పోతవి. వాటి దారిలో వున్న లింఫుగ్లాండులు వలలలాగా ఆ క్రిములను పట్టి పైకి పోనివ్వక, తమలోనే ఉంచుకొంటవి. అందువల్ల వాటి శరీరం పెద్దదౌతుంది. అంతకు ముందు చిన్నవిగా ఉన్న గ్రంధులు పెద్దవై శరీరోపరిభాగంలో చేతికి తెలుస్తవి. ఒక్కొక్కప్పుడు వాటిలో కూడా ఇన్ఫ్లమేషన్ ఏర్పడి బాధ కలుగుతుంది. కొన్ని పరిస్థితులలో వాటిలోనూ చీము ఏర్పడుతుంది శరీరంలో ఒకచోట చీము ఏర్పడితే ఆ చీము గూడును "ఏబ్సెస్" అంటారు. ఇన్ఫ్లమేషన్‌వల్ల ఈ ఏర్పడే లక్షణములు అల్లా ఏర్పడిన టిష్యూనుబట్టి ఏర్పడతవి.

శరీరాంతరాళములను అంటే మూడు రకముల పొరలు ఉన్నవి. అవి (1) శ్వాసకోశము, జీర్ణకోశము, గర్భాశయము, మూత్రాశయము మొదలయిన అంగములను క్రమ్మి ఉన్న మ్యూకస్ మెంబ్రేను. (2) హృదయమును ఊపిరితిత్తులను, అబ్డోమెన్ లోపలి భాగమును మెదడును చుట్టి ఉన్న సీరస్ మెంబ్రేనులు. (3) కళ్ళలోపల భాగమును కప్పి ఉన్న సైనోవియల్ మెంబ్రేనులు. ఇందులో మ్యూకస్ మెంబ్రేను, మ్యూసిన్ అనే జిగురువంటి పదార్థమును స్యందిస్తుంది.

సీరస్ మెంబ్రేను సీరమ్ అనే గంజివంటి పదార్థమును స్యందిస్తుంది. సైనోవియల్ మెంబ్రేను సైనోవియల్ ఫ్లూయిడ్ అనే నూనెవంటి పదార్థమును స్యందిస్తుంది. ముక్కులో ఉండే మ్యూకస్ మెంబ్రేను ఇన్ఫ్లేం అయితే జలుబు చేసింది అంటాము. ఊపిరికుట్టు నొప్పి వచ్చినప్పుడు ముందు పట్టుకొని తరవాత ఊపిరితిత్తుల పొరలలో నీరు చేరుతుంది. కంట్లో ఉన్న మ్యూకస్ మెంబ్రేను ఇన్ఫ్లేం అయినప్పుడు పుసికడుతుంది. పంటి చుట్టూ వున్న చిగుళ్ళు వాచినప్పుడు నెత్తురు కారతవి. అది ముదిరి పయోరియా అయితే దుర్గంధముతో కూడుకున్న చీము వస్తుంది. పంటికి వచ్చే పయోరియా అయినా కంటికి వచ్చే కంజెక్టివైటిస్ అయినా, కడుపులో యేర్పడే గాస్ట్రైటిస్ అయినా ఇన్ఫ్లమేషన్ యొక్క రకములే. ఏ టిష్యూలలో ఇన్ఫ్లమేషన్ ఏర్పడ్డా జరిగే కార్యక్రమం ఒకటే. ఆ కార్యక్రమం అర్థం చేసుకుని ఆయా అవయవముల ధర్మములను తెలుసుకుంటే అవి ఇన్ఫ్లేం అయినప్పుడు ఏం జరిగేదీ, ఏం చెయ్యవలసిందీ సకారణంగా ఎవరికి వారే నిర్ణయించుకోవచ్చు. ఇన్ఫ్లమేషన్‌కు అతి ముఖ్యమూ సాధారణమూ అయిన కారణం ఇన్ఫెక్షన్- అంటే క్రిములు టిష్యూలలో ప్రవేశించడము- చాలా ముఖ్యమైంది. ఇదే అనేక జ్వరములకు కారణము. ఆ విషయం ప్రత్యేకంగా సందర్భం వచ్చినప్పుడు చర్చిస్తాను. ★



# మహిళాలోకం

## విద్యార్థిని - గృహిణి

విద్యార్థి దశలోని స్వేచ్ఛాజీవితాన్ని గార్హస్థ్యంలో ప్రవేశించినగాని ప్రశం సించలేము. వివిధమైన బాధలు లేకుండా హాయిగా కాలం గడచిపోతుంది విద్యార్థి దశలో. 'ఈరోజు ఈ పని చెయ్యలేకేం' అని కారాలు మిరియాలు నూరేవారుండరు. ఆ రోజుల్లో మనల్ని చూస్తే ప్రతివారూ గౌరవిస్తారు.

'అబ్బ! దాన్ని చదువుకోనివ్వవే. దానికెందుకు పనులు చెప్తావు. నీవు చేసికోలేవా? పనిమనిషి లేదా?' అంటూ కూతుర్ని సపోర్టు చేస్తాడు తండ్రి.

'అది కాదండీ! యీడొచ్చిన పిల్ల ఇంటి పనులు నేర్చుకోకపోతే ఎలాగ. రేపు ఆ చేసుకొన్నవాడు అమ్మాయిని కూచో పెట్టి అన్ని పనులు తనే చేస్తాడా?' అని తన్ను తాను సమర్థించుకోబోతుంది తల్లి.

'పనులు నేర్చుకునే రోజులు ముందున్నవిలే. దాన్ని చదువుకోనీ. ఇక ఎపుడూ దానికి పనులు చెప్పకు' అని శాసిస్తాడు ఆయన. ఇహ చూసుకో నాతడాఖా అన్నట్లు పోజు పెట్టి తల్లివైపు ఒక చూపు విసురుతుంది ఆ అమ్మాయి.

ఈ విధంగా తలిదండ్రుల చాటున గారాబంగా పెరుగుతుంది భావిజీవితంలోని ఒక ఇంటి కోడలు.

అమ్మాయి బి. ఏ. పూర్తిచేసేసరికి పందొమ్మిది నిండి యిరవై ఏండ్లూ వస్తాయ్. నాన్నా ఎం. ఏ. లో చేరుతా నంటుంది కూతురు. వద్దు లేవమ్మా ఈ చదువు చాలు. నీవు యం. ఏ. చదివితే యం. ఏ. చదివిన భర్త కావాలంటావు. ఒకవేళ నీవు బి. ఏ. చదివినవాణ్ణి చేసుకుంటానన్నా ఎవడూ చేసికోడు. ఆపైన వచ్చే కష్టాలు పసిదానివి నీకేం తెలుస్తాయి, అంటూ ఆమె చదువుకు ఫుల్ స్టాప్ పెడతాడు ఆమె తండ్రి.

ఈడొచ్చిన పిల్ల యింట్లో వుంటే ఇంకేముంది. అందరి కండ్లూ ఆ యింటిమీద నే. మరీ యీ వెధవ ముండలు, పెద్దనాపసానులు —వీరి క్రిటిసిసమ్స్ వినడము ఎవరివల్లా కాదు.

'అయ్యొయ్యొ! ఈడొచ్చిన పిల్ల ఆ పరాయి మగవాడితో వినిటూ కిచకిచలు, పకపకలూనూ. మా కాలంలో మేము ఎరుగమమ్మా. నా చిన్నకొడుకు పుట్టేవరకు కూడ నాకు మా ఆయనతో మాట్లాడాలంటే అదేందోగా ఉండేది. కాలమమ్మా కాలం. ఏం చేస్తాం?"

[అంటే ఆ అవకాశం తనకు లేకుండా పోయిందే. ఇపుడు వీళ్లు అనుభవిస్తున్నారేనూ అని అసూయ.]

'అహా. నాకు తెలియక అడుగుతా గాని వాండ్ల నాయన కూడా అట్లా చూస్తూ ఊరుకుంటాడేం?'

### సీతారామమ్మ

'ఆఁ. తగలబడనీ. ఎవరెట్లా పోతే మనకెందుకు?' సాగదీసుకుంటుంది మరొక నాపసాని. ఆ మాటలోనే వుంది ఎక్కడలేని ఈసు!

ఇవన్నీ విని తల బట్టకట్టి కూతురికి మనుములు వెతుకుతాడు - తుదకు ఎవడికోయిచ్చి ఆ మూడుముళ్ళూ పడ్డాయనిపిస్తాడు - ఇంతతో తన భారం తీరిందని సంతసిస్తాడు — తండ్రి.

వరుణ్ని ఏరుకోవడం అనేది ధనువుమీద కూడా ఆధారపడి ఉంటుంది. పరిస్థితుల ప్రాబల్యంవల్ల కొందరు తమకు బొత్తుగ యిష్టంలేనివాణ్ని కూడ చేసికొనవలసి వస్తుంది. వారి గార్హస్థ్యజీవితం ఎలా ఉంటుందో ఊహించవచ్చు. ఏమంత కష్టం కాదు.

పెండ్లికుమారుని గుణగణాలు ఆ పిల్ల తండ్రికి మటుకు ఎలా తెలుస్తవి? పిల్లవాడు మంచివాడు, (కాస్సేటిలోనే ఆయన కెలా తెలుస్తుందో) చక్కనివాడు, ఒక్కడు, ఆస్తిపరుడు, బుద్ధిమంతుడు (ఇది ఆయన ఎడ్యుకేషనల్ క్వాలిఫికేషన్‌నుంచి డిరైవ్ చేయబడుతుంది, అని అనుకొని ఉన్నవి, లేనివి కొన్ని (సు)గుణాలనే అతనికి కల్పించి పిల్లనిచ్చి పెండ్లి చేస్తాడు.

అటువారికి, ఇటువారికి ముచ్చటలూ, మురిపాలూ అంటూ కొన్నాళ్ళు వేడుకలు జరుగుతాయి. "ఏవఁమ్మోయ్ వియ్యపరాలా మా కోడల్ని మేం తీసుకొని పోతాం" అంటుంది ఆ పిల్ల అత్త శోభనం అయిన మర్నాడే.

'పూలల్లో పెట్టి పెంచుకున్నామమ్మా నిన్ను. పుట్టినింటికి మెట్టినింటికి పేరు తేవాలి. మరి ఇక ఉంటానమ్మా.మమ్ములనందరినీ విడిచి ఒక్కదానివి ఎట్లావుంటావో ఏమో?' అంటూ గాద్గదికస్వరంతో వీడ్కోలు చెప్తుంది తల్లి.

నాటితో ఆ యువతికి గార్హస్థ్య జీవితం ఆరంభమవుతుంది. అందరూ కొత్త. ఎవరితో మాట్లాడితే ఏమి తప్పు వస్తుందోనన్న భయం ఆమెను బాధిస్తుంది.

కోడలు ఇంట్లో అడుగు పెట్టగానే పనిమనిషిని బర్తరఫ్ చేస్తుంది అత్త. కొత్తలో మొదటి రెండు రోజులూ అత్తగారే కాఫీ కూడా అందిస్తుంది కోడలికి. అలవాటు ప్రకారం 7 గంటలకు నిద్రమంచం నుండి లేస్తుంది బద్ధకంగా ఆ యింటి కొత్తకోడలు.

'ఏవిఁటమ్మా యీ విడ్డూరం? సగం పొద్దు ఎక్కేవరకూ నిద్ర లేవకుండడము? ఎక్కడి పని అక్కడ ఏడుస్తున్నది—మంచి పెంపకమే. మా ఖర్మకొద్దీ దొరికావు. నేను వాడికి అపుడే చెప్పా. చదువుకున్న పిల్లలు పనీ పాటా చెయ్యరురా అని. ఐనా ఈ కొంపలో నా మాటకు విలువేమున్నది? .' అంటూ అష్టోత్తరం జపిస్తుంది అత్తగారు. తన తప్పు తెలుసుకొని గబగబ పనిలో నిమగ్నురాలవుతుంది కోడలు. ఇంటిపనులు ఎన్నడైనా చేస్తేగా యిపుడు చెయ్యగలగటానికి. ఏపని చేసినా అవకతవకగనే ఉంటుంది. ప్రతి చిన్నదానికీ సరియైన మోతాదులోనే చీవాట్లు అందుతూ ఉంటయ్.

'దీని దుంపతెగ! ఇన్నాళ్లూ మెత్త మెత్తగా ఉన్న ఈ అత్తముండ కొరకరాని కొయ్యగా తయారైందే' అని విచారిస్తుంది ఈ విద్యావతి. తిన్నగా పనులుచెయ్యడం




నేర్చుకుంటుంది. కోడలిపై తనకు ఏర్పడ్డ తొలి అభిప్రాయం ఆవిధంగా ఉండిపోయి అవకాశ మొచ్చినప్పుడల్లా ఆమెను ఏడిపించాలన్న దురుద్దేశం కలుగుతుంది అత్తగారికి.

ఇంటిపనంతా చేసి భోజనం దగ్గరకు వచ్చే సరికి ఏ చింతకాయపచ్చడో, గొడ్డుకారమో కళకళలాడుతూ కంచంలో చేరిఉంటుంది. గారాబంగా పెరిగిన ఆమెకు ఆ అనుపానం కొన్ని చూచేసరికి దుఃఖం కట్టలు తెంచుకుంటుంది. అత్తను ఎక్కడికన్నా పోనిచ్చి పావకాశంగా ఏడ్చి ఏడ్చి అలసి సొలసి నిద్రపోతుంది.

అత్త రాకాసి ఐనా భర్త సరసుడైతే ఈ కష్టాలు ఆమెకు లెక్కలోకి రావు. భర్త ఆ అమ్మచేతి కీలుబొమ్మ అయితే ఇక చూచుకోండి, ఆమె ఆ యింట్లో నరకాన్ని అనుభవిస్తుంది. కొడుకూ, కోడలు ఒకచోట ఉంటే చూచి సహించలేని తల్లులు చాలామంది ఉన్నారు.

ఈ మధ్యనే జరిగిన ఒక పెండ్లి ఉదాహరణంగా చెప్తాను. నా స్నేహితురాలొకామె కొత్తగా కాపురానికి వెళ్ళింది. ఆమె కాపురానికి వెళ్ళేవరకూ, వారిమీద వీరికి, వీరిమీద వారికి ప్రేమగనే ఉన్నది. ఆమె ఆ తల్లిదండ్రులకు ఒక్కతే (పెంపుడు) కూతురు. ఎంతో గారాబంగా పెరిగింది. ఆమెను ఒక ఇంజనీరుకు ఇచ్చి వివాహం చేశారు. సంబంధం కూడ ఏమంత కొత్తది కాదు. ఆమెకు ఇంటిపనులు కూడ బాగానే చేతనగును. అత్త గయ్యాళి. ఒకరోజున 'ఈ పచ్చడి కూడు ఎట్లా తినను?' అన్నదట అత్తగారితో. ఇంకేముంది. రెండురోజులు బొత్తుగ అన్నం లేకుండ మాడ్చింది ఆ అత్త. ఆ విషయం భర్తతో చెపితే మాఇంట్లో ఉండదలచుకొంటే మా అమ్మ మాట జవదాటకూడదు, అన్నాడట.

తల్లిని గౌరవించవలసినదే. ఆమె పూజనీయురే. కాని, గౌరవించడానికైనా ఒక హద్దు ఉంటుంది. కొడుకు తనమాట కాదనడు అనేది ఆమెకు నిజంగా గర్వకారణమే అవుతుంది. ఆమెకూడ ఆ అవకాశాన్ని దుర్వినియోగం చేసికోకూడదు. హద్దు మీరినపుడు -ఆమీరినది ఎవరైనా సరే వారు దండ్యులు- తల్లికదా అని కొంపకు నిప్పు పెడుతుంటే చూస్తూ ఊరుకుంటే కొడుకు ఎట్లాంటివాడై వుంటాడు? అతను కలక్టరే అయినా ఉత్త Muff అని చెప్పకతప్పదు. లోకజ్ఞానానికి, చదువుకు ఏలాంటి సంబంధమూ లేదు. పరిస్థితులను అర్థం చేసికొనడం అనేది చాల కొద్దిమందికిమాత్రమే సాధ్యము. చదువుకొన్న వారిందరికీ వీలగునను కొనడం చాల పొరపాటు.

దాంపత్య జీవితం పూలపాన్పుగ ఉండాలి అంటే తల్లికి భార్యకు మధ్య ఏలాటి పొరపొచ్చాలు రాకుండా చూడాలి తెలివైన భర్త.

నేటి అత్తలు నాటికోడళ్ళే కనుక వారు అపుడు ఎంత కష్టపడ్డారో వారి కోడళ్ళు కూడా అలాగే కష్టపడాలని వారి ఆశయం. కొడుకు ఎంత మొత్తుకున్నా కోడల్ని కష్టపెట్టడం మానదు ఆ అత్త. ఈ విధంగా నరకాన్ని అనుభవించే కోడలికి ఎపుడెపుడు పుట్టింటికి పోదామా అని అనిపిస్తుంది. రాను రాను తన జీవిత భాగస్వామి అయిన భర్తపై కూడ ఈర్ష్య, ద్వేషం జనిస్తాయి.

ఆమె అంతగా కష్టపడేటపుడు భర్త అనునయంగా మాట్లాడితే ఆమెకు తన గుండెలమీది భారం అంతా తీరినట్లుంటుంది. అతని మీద గౌరవం, ప్రేమ కలుగుతాయి. ఆమెకు అతడు చాల సన్నిహితుడౌతాడు. ఆ యింటిలో ఆమె అనుభవిస్తున్న ఒంటరితనం పారిపోతుంది. అత్తగారి గోల ఉన్నా ఆమెకు ఆయిల్లు స్వర్గంగానే ఉంటుంది. ★

# పెసరపూర్ణముతో బొబ్బట్లు

కావలసిన వస్తువులు:—

పెసరపప్పు (పొట్టులేనిది) ఒక శేరు.

మైదాపిండి, ఒక శేరు.

పంచదార ఒకవీశె (శేరుంపావు)

కొంచము ఏలకులు.

ఒక పచ్చికొబ్బరిచిప్ప.

సాధారణముగా బొబ్బట్లు రెండు విధములుగా చేస్తారు. ఒకటి సెనగపూరము, రెండు పెసరపూర్ణము. ఈపెసరపూర్ణముతో బొబ్బట్లు ఎక్కువగా తూర్పు గోదావరి జిల్లాలో చేస్తారు.

చేయువిధానము:— మొదట మైదాపిండిని శుభ్రముగా జల్లించుకొని ఉంచుకోవాలి. పెసరపప్పునుకూడ శుభ్రముగా బాగుచేసుకొని ఉంచుకోవాలి. బొబ్బట్లు చేసుకునేందుకు రెండుగంటలు ముందుగానే మైదాపిండిలో కొంచము ఉప్పువేసి నీళ్ళతో మరీగట్టిగానూ కాకుండ, మరీ అంత పల్చగానుకాకుండ ముద్దమాదిరిగా అయేలాగున కలుపుకొని ఉంచుకోవాలి. ఈపిండి ఎంత నానితే బొబ్బట్లు అంత బాగా వస్తాయి.

తరువాత పచ్చి కొబ్బరిచిప్ప తురుముకొని కొంచము నెయ్యివేసి, ఎర్రగా వేయించుకొని ఉంచుకోవాలి. ఏలకులు మెత్తగా నూరుకొని ఉంచుకోవాలి. పొయ్యిమీద దళసరి, విశాలమయిన గిన్నెతో నీళ్ళు ఎక్కువగా ఉండేలాగున ఎసరు పెట్టవలెను. నీళ్ళు ఎక్కువగా లేకపోయినా, లేక గిన్నె దళసరిలేకపోయిన పప్పు మాడిపోతుంది. నీళ్లు బాగా మరిగాక పెసరపప్పు ఎసరులో పోసి బాగా అయిదు, లేక ఆరు పొంగులు వచ్చాక అంటే పెసరబద్ద కొంచము పలుకుగా ఉండగానే నీళ్లు శుభ్రముగా వార్చవలెను. ఇక్కడ కొంచెము శ్రద్ధ చూపాలి, ఎందుకంటే ఏమాత్రము అశ్రద్ధచేసినా మొత్తమంతా పాడైపోతుంది. కనుక బద్ద కొంచెము ఎక్కువ ఉడుకువచ్చినా, లేక కొంచెము తక్కువవచ్చినా కూడా బొబ్బట్లుసరిగా రావు. కనుక సమమైనపాళము చూసుకొని మనము నీళ్లు వార్చుకోవాలి. నీళ్లు వార్చాక ఆగిన్నె సన్నని సెగమీద పొయ్యిమీద వుంచవలయును. ఎందుకంటే గిన్నెలో కొంచెము కూడా నీళ్ళు ఉండకూడదు. నీళ్ళు బాగా యింకిన తరువాత పొయ్యిమీదనుండి గిన్నె దించి గరిటతో బాగా కుమ్మాలి. అంటే విడ విడలాడుతూ ముగ్గుమాదిరిగా అయిపోవాలి. అప్పుడు ఒక వెడల్పాటి యిత్తడి లేక స్టీలు పళ్లెములోకి ఈ ఉడికిన పిండిని తీసి బాగా ఆరనీయాలి. కొంచెముకూడా తడిలేకుండా ఆరినతరువాత పంచదార, ఏలకుల పొడి, కొబ్బరికోరు ఇవన్నీ, ఆపిండిలో వేసి బాగా కలపాలి. అప్పుడు ముద్దలాగ పూర్ణము అవుతుంది. పెసరపప్పు కొంచము చిమిడినా, లేక తడి ఆరకుండా పంచదార పోసినా, పూర్ణము పాకములాగ అవుతుంది.

**వి. సుగుణ**

తరువాత మైదాపిండిలో కొంచము నూని వేసి బాగా సద్దించాలి. సద్దించిన తరువాత మైదాపిండిని ఉసిరికాయలంత సైజులో ఉండలు చేసుకొని ఉంచుకోవాలి. తరువాత పూర్ణమునుకూడ నిమ్మకాయలంత సైజులో ఉండలు చేసుకోవాలి. మైదాపిండి ఉండలు ఎప్పటికుండ అప్పుడు చేసుకుంటేనే బాగా ఉంటుంది. మైదాపిండి ఉండని అరచేతిలో అరచేయికన్నా కొంచము చిన్నదిగా అప్పడముమాదిరిగా తడిచేతితో చేసి, అంటే చేతిమీదే చేయాలి, తరువాత పూరపుఉండని ఈ అప్పడమునకు మధ్యలో పెట్టి పూర్ణము చుట్టూరా మూసేలాగున, పైమైదాపిండితో మూయాలి. అలా మూసినఉండని ఒక అరిటాకుకి నూని రాసుకొని ఉంచుకొని, ఆకుమీద ఈ ఉండని ఉంచి, దగ్గర ఒక గిన్నెలో నూని పోసుకొని ఉంచుకొని, చెయ్యి ఆ నూనెలో ముంచుకొని అంటే చేతికి పిండి అంటుకోకుండా ఉండడానికి) ఆకుమీద ఆ ఉండని గుండ్రముగా అప్పడముమాదిరిగా వత్తుకొని ఉంచుకోవాలి. తరవాత బొబ్బట్లు పొయ్యిమీద కంటే కుంపటిమీదనైతే సన్నని సెగమీద బాగా కాలి ఎర్రగా ఉంటాయి కనుక ఈ అప్పడము వత్తుకొనేందుకు ముందుగానే కుంపటిమీద పెనము బాగా కాలేలాగున ఉంచవలెను. పెనము కాలినతరువాత వంకాయ ముచికతోనో, లేక అరటికాయ ముచికతోనో పెనముమీద నూని రాసి, ఈ వత్తి ఉంచుకున్న అప్పడమును పెనముమీద వేయాలి. ఎలా వేయాలంటే, ఆకును, అంటే ఈ అప్పడము వత్తి ఉంచుకున్న ఆకును పెనముమీద బోర్లావేయాలి. అంటే మొదట పెనము, పెనముపైన అప్పడము, దానిపైన ఆకు వస్తాయన్నమాట. బొబ్బట్టు చితికిపోకుండా పై ఆకును మెల్లగా పైకితీసి వేయవలెను. అప్పుడు రెండుప్రక్కలా ఎర్రగా వేగినతరువాత తీసి విడిగా ఆరిన తరువాత, అంటే వేడిగాఉండగా ఒకదానికి ఒకటి అంటుకుంటే చిరిగిపోతాయి. బొత్తుగా పెట్టుకోవాలి. నూని పెనము మీద మొదట ఒకసారిమాత్రమే అంటే ఒకొక్క బొబ్బట్టుకి ఒకొక్కసారిమాత్రమే పెనముమీద నూనిరాయాలి. అంతేగాని ఎక్కువ నూని వేయకూడదు. ఒకవేళ పిండి పల్చన అయితే ఒక శుభ్రమైన తెల్లనిగుడ్డమీద ఈ పూర్ణాన్ని బాగా పల్చగా గుడ్డమీద పర్చి కొంచముసేపు ఆరనిచ్చిన కొంచము గట్టిపడుతుంది. ఒకపూర్ణము విషయములో తప్ప మిగతా విధానము మామూలు బొబ్బట్లుచేసే విధానములాగానే చేయాలి. ఇవి ఒకసారి తింటే యింకోసారి తినాలని ఉంటుంది. కమ్మటినెయ్యి వేసుకుని తింటే వాటి రుచి వేరేచెప్పాలా? కనుక ఒకసారి చేసుకుని, తినిచూడండి. ★

## సరళసలహా!

అరువు అడగరానట్లే కరువు చాటుకోరాదు. ఇంటికరువు పరాయికంటికి పోరాదు. అదీ పరువుకు లోపమే. అరువుకోసం అడగలేక కరువుమాట చెప్పుకున్నట్లు భావిస్తారు సాటివారు.

ఇంటిగుట్టు లంకకుచేటు. గుట్టు, గుంభనలేని సంసారం నడివీధిలో భాగోతం. నిండుతనంలోనే నీటు, స్వీటు రెండూ ఉన్నాయి. మనస్సులో మరిగేది హాలాహలమైనా, జరిగేది కోలాహలమైనా ముఖం చిరునవ్వులే విరబూసి, హాయినే ఆకట్టుకోవాలి. ఇవి నిత్య జీవితంలో ఆడదానికి యెంతో అవసరం! పక్కయింటి పిన్ని పక్కలో పిన్నీసుకాకూడదనుకున్నా, నట్టింటి గుట్టు రట్టుకారాదన్నా, పరువు బజారుకు పోరాదన్నా ఆడది నోటిని కట్టుకోవాలి.

అతి సన్నిహితులూ, ఆప్తులూ అలాగే ఉండి మిమ్మల్ని గౌరవించాలంటే ఒకరిగుట్టు అడక్కండి. మీగుట్టు చెప్పకండి.

# వనితా లోకం



## అభివందనాలు

26-10-60 వారపు పత్రికలో కుమారి పులిపాక అంజనాదేవిగారి "ప్లాస్టిక్ పేపర్ తో హాండ్ బాగ్" చాలా బాగున్నది. నేను అందులో కొంత మార్పు చేసి కుట్టాను. చక్కగా కుదిరింది. తాడు అల్లడం కొంచెం శ్రమతో కూడినపని. కానీ ఓపికతో అల్లాను. ఇల్లాంటి చేతిపనులను ఆంధ్రపత్రిక ద్వారా తెల్పిన ఎంతో బాగుంటుంను. అంజనాదేవి గారికి మీ (మా) పత్రికద్వారా నాహృదయ పూర్వక అభివందనాలు తెల్పుచున్నాను.

ఎన్. ఎం. లక్ష్మి (విల్లివాక్కం)

* * *

డి. విశాలాక్షీరావుగారు వ్రాసిన చిన్ని పాపలకు ఊలు డ్రెస్సులు, మానె టోపి అల్లినాను. బాగానే వచ్చింది. విశాలాక్షీరావుగారు! చిన్నదిగా వచ్చింది. మీరు ఏడాది వయసు పాపలకు సరిపోతాయన్నారు. అది మాసంపిల్లలకు సరిపోయినట్లు ఉన్నది మీరు వ్రాసినట్లే అల్లినాను. ఎందువల్లనో దయచేసి తెల్పెదరని ఆశిస్తున్నాను. స్వెట్టర్స్ డిజైన్ తెలియజేయవలెను.

చందూరి సుగుణ (హైదరాబాద్)

* * *

చాలా దినాలుగా, ప్లేసిక్ పేపరుతో హేండ్ బాగ్ ని చేయాలనుకుంటూ, చేసే విధానం సరిగా తెలియక ఊరుకున్నాను. కానీ26-10-60 తేదీ పత్రిక వనితాలోకంలో ఇచ్చిన హేండ్ బాగ్ చూచి అల్లినాను. చాలా బాగా కుదిరింది. పులిపాక అంజనీ దేవిగారికి నా "థాంక్స్" పత్రికాముఖంగా అందచేస్తున్నాను.

ఎం. ఎస్. దేవి (కలకత్తా)

* * *

## ఇదో కథ !

"ఆడపెత్తనం - అఘాయిత్యం" వ్యాసం చదువుతుంటే నవ్వాగలేదు ... అటువంటి భార్యారత్నాలు మనకు అక్కడక్కడా కనిపిస్తూనే ఉంటారు. మాకు తెలిసిన ఓ జంట గురించి చెపుతాను.

ఆమెగార్కి వంట చేయుట చేతకాదు. ఆయనే చేస్తూంటారు. ఆయన ఎక్కడికైనా క్యాంపు కెళ్లినప్పుడు ఏ ఫ్రెండు ఇంటి దగ్గరో ఆమెగార్కి భోజనం ఏర్పాటు చేసి (హోటల్ భోజనం సరిపడదనో ఏమోమరి) మరీ వెళుతుంటారు.. ఎవరికైనా కొన్ని కొన్ని హద్దులనేవి ఉంటాయి. అవి పాటిస్తున్నంతకాలం వారు సహజగౌరవానికి దూరం కారు. కాని వాటి నతిక్రమించి ప్రవర్తించి అర్థంలేని అధికారాలను చెలాయించటం అసహ్యకరంగానూ, జుగుప్సాకరంగానూ ఉంటుంది.

కుమారి ఆచంట కృష్ణవేణి (పేరవరం)

కమల లక్ష్మిగారు వ్రాసిన ఆడపెత్తనం అను వ్యాసం శోచనీయంగా ఉన్నది మరీ మాకు తెలిసిన ఒక కుటుంబమున్నది. అంటూ వివరించిన విషయం ఘోరంగా ఉన్నది. నిజంగా భారత పతీత్వం ఇంతగా దిగజారి పోలేదు. ఇకమీదట పోదుకూడా. ఎంత ఆఫీసరు భార్య అయినా ధనిక స్త్రీ అయినా దాసీలచేత వంట చేయించుకుని తన దర్పం చూపుతుందిగాని భర్తచేతనే వంట చేయించుకు తినే దౌర్భాగ్యురాలు ఉండదు. భారత భూమిలో అసలు ఉండదు.

మాచిరాజు రాజేశ్వరమ్మ (ఆలూరుపాడు)

* * *

9-11-60 వ తేదీన వెలువడిన సంచిక లోని కమల లక్ష్మి విరచితమగు "ఆడపెత్తనం-అఘాయిత్యం" అను వ్యాసము చాల బాగుందని చెప్పడానికి సంతసించుచున్నాను. ఈ నవీన కాలములో ఆడపెత్తనం ఎక్కువై పోయిందనడంలో సందేహం లేదు. కాని దానికిని హద్దుపద్దు ఉండవలెను. పై వ్యాసం ద్వారా కమల లక్ష్మిగారు చాల విషయాలను వెల్లడించారు. ఈ విధంగానే సోదరి మణులు ఇటువంటి వ్యాసములు ఎక్కువగా వ్రాసి స్త్రీ జాతికి తోడ్పడతారని ఆశిస్తూ, పై వ్యాసం వ్రాసిన కుమారి లేక శ్రీమతి కమల లక్ష్మిగారికి మీ పత్రికద్వారా హృదయపూర్వక అభినందనలందజేయుచున్నాను.

బెల్లం సరోజానాయుడు (మద్రాసు)

* * *

మీ (మా) ఆంధ్రపత్రిక చాలా బాగుం

## టేబులు కాతు డిజైను




—సుహాసిని (రాజమండ్రి)

టున్నది. ఎక్కువగా 'డిజైన్లు' బాగుంటు న్నాయి. ఆ డిజైన్లు మీ పత్రికకు పంపే అవకాశం మగవారికికూడా ఉన్నదా.. ? ఒక్క స్త్రీలకేనా?

కొండపల్లి బ్రహ్మానందం (సాలూరు)

వనితాలోకం స్త్రీలకే అవకాశం ఇస్తుంది.

*　　*　　*

## సీతమ్మ కథ - నాకథ

మా అభిమాన ఆంధ్ర సచిత్ర వారపత్రిక యందు ప్రచురించబడు వ్యాసములలో ఈ వారపత్రికయందు ప్రచురించబడిన "సీతమ్మ కథ - నాకథ" అను వ్యాసము చాల బాగా ఉన్నది. వ్యాసం శైలి ఒక క్రొత్తపంథాలో నడిపించిరి ఇటువంటి వ్యాసములతో పత్రిక అభివృద్ధి పొందవలెనని ఆశించుచున్నాను. రచయిత్రికి నా ధన్యవాదములు.

కట్టా కృష్ణకుమారి (తిరువూరు)

# వనితావాణి

## వరుసలూ - నెరసులూ

నిత్యజీవితంలో కనబడుతున్న అమ్మలక్కల నిజస్వరూపాలు నందూరి రాజ్యలక్ష్మిగారు 'వరుసలూ-నెరసులూ' అన్న వ్యాసంలో చక్కగా వివరించారు. అందరూ అలాంటివారే ననుకోవటం ఎంత పొరపాటో అందరూ అలాంటివారు కారనుకోవటం కూడా అంతే పొరపాటు. ఇరుగు పొరుగు అమ్మలక్కలలో మంచివారూ ఉన్నారు; చెడ్డవారూ ఉన్నారు. ఎటొచ్చీ మంచి వాళ్ల సంఖ్య స్వల్పంగా ఉన్నది. ఆంధ్ర పత్రికద్వారా చక్కని వ్యాసాన్ని అందించిన రాజ్యలక్ష్మిగారికి అభివందనాలు.

కె. లలితాదత్తు, (అప్పికట్ల)

## ఉమ ఉవాచ

మీ సలహాలు నిజానికి చాలా బావుంటున్నాయి. కానీ చదివేటప్పుడుండే సరదా తీరా ఆచరణకు ఉపక్రమించేసరికి నీరసించి పోతున్నది. ఆచరించాలన్న కోరిక కొస్తా కుంటువడి పోతున్నది. అనేకంగా ఎదురవుతున్న సమస్యలను ఎదుర్కొనటం చాలా కష్టమనిపించుచున్నది. మీ వ్యూస్ టూ మోడరన్‌గా ఉన్నాయి. మన ప్రస్తుత సాంఘిక పరిస్థితులు మారనిదే మీ సలహాలకు ఎంతమాత్రమూ విలువ ఉండదు.

మన ప్రస్తుత సాంఘిక పరిసితులలో అనేక అవకతవక లున్నాయి. ఈ తప్పులను ఒక్కొక్కటిగా పైకివెత్తి చూపవచ్చును. చక్కటి విమర్శతో కూడిన ఏ కథానికో రూపకంగానో ఈ లోపాలను చిత్రించవచ్చును. ప్రపంచజ్ఞానం కల మీవంటి విద్యావంతులు ఈ పనిని నిర్విఘ్నంగా నిర్వర్తించగలరు. కనుక ఇహముందు (ఆంధ్రపత్రికాముఖంగా) పై చెప్పబడినటువంటి కథానికలు మా పాఠక లోకానికి అందజేయగలరని ఆశిస్తాను.

వాహెద్ ఉమ (నర్సీపట్నం)

*　　*　　*

పి. సుచరితగారు నాటి అత్తలు, నేటి కోడళ్లుఅని వ్రాసిన అంశములు యేమాత్రము యదార్థములుగావు. పూర్వకాలములో అత్తలు కోడళ్ళను చాల హింసపెట్టేవారని వినికిడి. ఈ రోజులలో అలాటి అత్తలు లేరనే నా ఉద్దేశ్యము. ఒకవేళ అలాటి అత్తలు ఉన్నప్పటికి కొడుకులు భార్యలనే వెనకేసుకొచ్చి తల్లితో పోట్లాడేవారు యెందరులేరు? రచయిత్రిగారు కొడుకు కోడలు బాగుంటే సహించలేని అత్తలు ఉన్నారని వ్రాసినారు. తల్లి నవమాసములుమోసి బిడ్డను కని ఆ బిడ్డను అల్లారుముద్దుగా పెంచి పెద్ద చేసి ఆమెకున్న దాంట్లోనే చదువు సంధ్యలు చెప్పించి వానినొక ఇంటివానిగాచేసికొడుకు వల్ల కోడలివల్ల తాను ముసలితనములో సుఖపడదామని ఎన్నో కలలు కంటుందికాని కొడుకుమాత్రం పెళ్ళికానంతవరకు తల్లియెడ యెంతో ప్రేమగావున్నవాడు భార్యరాగానే తల్లిమీద ప్రేమ అంతా పోయిభార్య చేతులో కీలుబొమ్మ అవుతున్నాడు. భార్య ఏది చెబితే అది విని ఆ తల్లిని ఎన్నో హింసలు పెట్టిన కొడుకులను మనము చూస్తూనే ఉన్నాము. అలాంటప్పుడు ఆ తల్లి బాధపడుతుంది గాని, కొడుకు, కోడలు బాగా ఉంటే సహించలేరనటం యెంత మాత్రము నిజము కాదు. రోజులు మారాయి అత్తలు కోడళ్లవుతున్నారు. కోడళ్లే అత్తలవుతున్నారు.

ఎస్. కమల (బందరు) ★

# మనుషులూ - మనసులూ

పలితుల రామచంద్రయ్య




(గత సంచిక తరువాయి)

ఇల్లు చేరుకునేటప్పటికి ఎనిమిదయింది. గుర్నమ్మ ఎక్కడో పురాణం వినేందుకు వెళ్లింది. దంపతులిద్దరూ నిద్రపోతుండగా, పదింటికి వచ్చి తలుపు తట్టాడు కాంతారావు.

గమనకు మెలకువొచ్చింది. అతను హేమను నిద్రలేపి, తను మళ్లీ నిద్రలో పడ్డాడు. అప్పటికిగాని గుర్తు రాలేదు హేమకు, అన్నయ్యా సినిమాకు వెళ్లిన సంగతి. కంటి నిండా పట్టిన నిద్రపాడైంది. ఛీ! క్షణంసేపు తన ప్రాణం హాయిగా వుండ నిచ్చేట్టు లేరు . .

తలుపు తట్టడం ఆపి, "చెల్లాయ్, చెల్లాయ్" అంటున్నాడు కాంతారావు.

"ఏం రోగం, చెల్లాయికి!" అని గొణుక్కుంటూ వెళ్లి తలుపు తీసింది. ఇహ గంటసేపు ఈయనకు వడ్డిస్తూ జాగరణ చెయ్యాలి గావును!

కాంతారావు చెప్పాడు—సినిమా యేం బాగోలేదుట. పూర్తవక ముందే లేచి వెళ్లార్ట. అనూరాధా వాళ్ళ ఇంటి కెళ్లితే, వాళ్ళంతా అక్కడే భోంచేయమని బలవంతం చేశారట.

పరే కౌనిమ్మని అక్కడే భోంచేసి వచ్చాడట.

చురక తిన్నట్టుగా వుంది హేమకు. ఒక క్షణం క్రిందట ఈయనకు వడ్డించాలేమోనని విసుక్కున్న మనస్సు, అతడు అనూరాధ యింట్లో భోంచేసి రావటాన్ని హర్షించలేకపోయింది. ఎందుకని హర్షించలేదు? దీనికి నికరమైన సమాధానం ఆమె దగ్గర లేదు. తన స్వంతమైన వస్తువును ఇంకో పరాయి వ్యక్తి బలవంతాన లాక్కోబోతున్నట్టుగా వుంది. ఈరోజే అనూరాధ యింట్లో తిని రావలసిన అగత్యమేమిటి? పొద్దుపోయి వస్తే అన్నం పెట్టరనా? అసలే పడుతున్న క్షోభ చాలక, ఇదొక పేరా తనకు?

"చాలా మంచి పని చేశావు!" అంది, అన్నయ్యకు సమాధానంగా. ఇంతకు ముందు ఆమెలో అకారణంగా జనించిన విసుగును, ఇప్పటి పలువిధాల భావనలన్నీ కలిసి అర్థవంతం చేశాయి.

ఈరోజు ఈయనకు అనూరాధ ఎక్కువైందన్నమాట!

కాంతారావు మేడమీదికి వెళ్ళిపోయాడు. హేమ తలుపు వేసి వచ్చి పడుకుంది. చాలాసేపటి దాకా నిద్రపట్టలేదు...ఆలోచనలు.

మర్నాడు పొద్దున కాంతారావు అన్నాడు:

"రాత్రి చాలా మంచు కురిసింది చెల్లాయ్! ఒళ్ళంతా గడ్డకట్టుకుపోయి చాలా బాధపడ్డాననుకో! రగ్గు కూడా తీసుకెళ్ళలేదయ్యో... నిద్రలో వుంటారని మిమ్మల్ని లేపలేదు. చలి భరించలేక కాస్సేపు బెడ్డు కప్పుకు పడుకున్నాను."

"ఆ మాత్రం శాస్తి కావలసిందేలే," అనుకుంది హేమ, రాత్రి సంగతి మనసులో వుంచుకుని.

## 3

రోజులు దొర్లుతున్నాయి.

ఆ రోజు మొదలు కాంతారావే నిత్యమూ మార్కెట్టుకు వెళ్ళుతున్నాడు. ఓ రోజు నారాయణను వెళ్ళిరమ్మంటే, "ఆ డ్యూటీ నీవది. నేనెందుకు వెళ్ళాలి?" అని మొండికేశాడు వాడు.

మునుపటిలా అనూరాధ రావటం లేదు. మరీ బొత్తిగా మానేస్తే బావుండదని, వారం పదిరోజులకోమారు వచ్చి పది నిముషాలపాటు కూచుని వెడుతోంది. తరచుగా కాంతారావే వాళ్ళింటికి వెళ్తోసుంటాడు.

వూరినుంచీ కాంతారావు తండ్రి నెలసరి సామాన్లంతా నెలతప్పకుండా ఆ కుటుంబానికంతా సరిపడేటట్టు పంపుతున్నాడు. పంపినప్పుడల్లా జాబులు రాస్తున్నాడు. ఓమారు జాబులో—అది అల్లుడికి రాసింది—దాన్లో, తన ప్రాణానికి ప్రాణమైన ఏకైక పుత్రుడి యోగక్షేమాల్ని గురించి అడగా

# మనుషులూ-
# మనసులూ

డాయన. "వాడు తిక్క వెర్రినాగన్న; వాణ్ణి ప్రేమతో చూచుకోవలసిం"దని రాశాడు. ఆయన దాన్ని ఏ వుద్దేశంతో రాశాడో ఎవరికీ తెలీదుగాని, దాన్ని చదివి రమణ కోప్పడ్డాడు.

"మేమేం వాళ్ళబ్బాయిచేత గడ్డపార పనులేవీ చేయించటం లేదే! ఆయన ఎందుకిలా రాయాలి? వాళ్ళంత సుకుమారమైన మనుషులైనప్పుడు వాళ్ళబ్బాయిని మాలాంటి బీదవాళ్ళింట్లో వుంచటం దేనికంట?" అంటూ నిష్ఠూరపడ్డాడు రమణ.

అది విన్న హేమమనస్సు చివుక్కుమంది.

నిజానికి రమణ అలా నిష్ఠూరపడటంలో అర్థంలేదు. మామగారు రాసిన యాదాలాపపు మాటలకు అవిధమయిన వ్యాఖ్యానం చెయ్యవలసిన అవసరమూ లేదు. ఈ నిష్ఠూరానికి వెనక దాగివున్న మన స్తత్వాన్ని గురించి ఆలోచించితే, కాంతారావు తమ యింట్లో వుండటం రమణకు సుతరామూ యిష్టం లేదేమో ననిపిస్తుంది. ఈవిషయాన్ని అందరికన్నా ముందు అర్థంచేసుకున్న వ్యక్తి అనూరాధ. అందుకే ఆమె ఒకటికి రెండుసార్లు అతణ్ణి సూచన ప్రాయంగా హెచ్చరిస్తూ వచ్చింది. కాని దాన్ని వెంటనే

> ప్రయాణికుడు — (రైలు బండిలో పోలీసుతో) నాపెట్టె పోయిందండీ.
>
> పోలీసు — ఎటువంటి పెట్టండీ.
>
> ప్రయా — పసుపురంగుది.
>
> పో — ఆనవాలు ఏమైనా చెప్పగలరా?
>
> ప్రయా — పెట్టెమీద చార్మినార్ బొమ్మ ఉంది.
>
> పో — పెట్టెలో ఏమున్నాయండీ.
>
> ప్రయా — నాలుగు చార్మినార్ సిగరెట్లండీ.
>
> —పి. త్రినాథ్ (తాడేపల్లిగూడెం)

గ్రహించేపాటి విచక్షణా, నైశిత్యమూ కాంతారావులో లేవు.

ఆ కోపంలో రమణ నాలుగురోజులపాటు బావమరిదితో మాట్లాడలేదు. ప్రతిదీ మనసులో పెట్టుకు సాధించే తత్వం రమణది. కాంతారావు అలా కాదు. మనసులో వున్న ఏమాట అయినా అప్పటికప్పుడు బయటికి కక్కివేయవలసిందే. కడుపులో పెట్టుకు పిసుక్కు చావటం అతడికి గిట్టదు. అందుకే, బావగారి 'ముసుగులో గుద్దులాట' వ్యవహారాన్ని భరించలేక, చెల్లెల్ని అడిగాడు.

"ఎందుకో యీ మధ్య బావ చాలా ముభావంగా వుంటున్నాడు చెల్లాయ్!..."

హేమ మాట్లాడలేదు. 'అయితే యే' మన్నట్టు చూచింది.

"కారణం నీకు తెలుసేమోనని..."

"తెలీదు."

బావసంగతి సరేసరి, చెల్లాయి కూడా ఇలా ముక్తసరిగా మాట్లాడుతోందేమిటి?—దుర్భరంగా వుంది కాంతారావుకు. ఈ దుర్భర స్థితికి కారణం ఏమిటో అతడు తెలుసుకోలేడు.. ఈ ఇంటికి వచ్చేటప్పుడు 'అంతా మనవాళ్ళే' నన్న భావనతో వున్నాడుగదా తాను! ఇప్పుడిదేమిటి? వీళ్ళంతా తనని కేటాయించేస్తున్నారా?...తనేం చేశాడని?

అసలు సంగతేమిటో వెలుగులోకి తెచ్చి మనసును శాంతపరచుకుందా మనుకుని, హేమను అడిగాడు.

"నామీదేమన్నా కోపంగా వుందా చెల్లాయ్?" ఇంతకన్నా సున్నితంగా ఎదుటివాళ్ళ మనస్సుకు బాధకలక్కుండా వుండేట్టు ఎలా అడగాలో కాంతారావుకు తెలీయలేదు. అతిసున్నితమయిన మనస్సుగల కాంతారావు జీవితంలో కాస్తంత కఠినంగా ఏది కనిపించినా చాలా బాధపడతాడు. అలాగే ఇతర్లుకూడా బాధపడతారేమోనని, వాళ్ళకా బాధ కలగకుండా వుండేట్టు చూచేందుకు అనవసరమయిన యాతనా పడతాడు.

"ఎవరికీ కోపం?"

అహఁ...నీక్కాని, బావకుగాని..." హేమ ఎక్కడ నొచ్చుకుపోతుందోనని జంకుతూ అన్నాడు. కాని ఆ జంకునంతా పటాపంచలు చేస్తూ, తానలా నొచ్చుకునే మనిషి ఎంతమాత్రం కాదని నిరూపించుకుంటూ, హేమ నాలుగు మాటలూ అనేసింది.

"నాకెందుకూ కోపం? తిన్నది అరక్కనా?...

ఆయనకుమాత్రం కోపం దేనికీ? వేళకి నాలుగు మెతుకులు గతికి ఆఫీసుకు పొయ్యే మొహానికి కోపం చేసుకునే ప్రజ్ఞ కూడానా? ... నువ్విలా వున్నవీ లేనివీ కల్పించుకుని మాట్లాడితే బాగుండదన్నయ్యా! అసలే నేను క్షోభపడుతున్నాను. దీనికితోడు నిన్ను మేమంతా ఏదో రంపపుకోత పెడు

తున్నామని అందరూ అనుకోవాలనా నీ వుద్దేశం ?"

మాటలు ఈ పెల్లా తగిలాయి కాంతారావుకు. ఇలాంటి మాటల్ని ఆశించివున్నా అతడంత బాధపడేవాడు కాదు. ఇక్కడ తనకూ వీళ్లకూ మధ్య గీతఎందుకు గీయబడ్డదో వివరించి, మనసుకు సేదదీర్చే మాటలు చెప్పి, చెల్లాయి తనవేపు మాట్లాడుతుందనుకున్నాడు. ఆ ఆశ నేలమట్టం చేసి గుండెల్ని కోతపెట్టింది చెల్లాయి.

అతడిమొహం కందగడ్డలే అయింది. దైన్యం మూర్తీభవించినట్లుగా అక్కడ నుంచీ మెల్లగా లేచి వెళ్లాడు. చెల్లాయి కేమీ జవాబు చెప్పలేదు. మనోవ్యథ మరింత దుర్భరమయింది. చిన్నతనంలో ఏకోదరుల అనుబంధాలను సుదృఢంగా ముడి బిగించే చెల్లాయిలా లేదిప్పుడు హేమ. రక్తబంధాలన్నీ తెంపేసుకుని దూరంగా జరగమన్నట్టుంది.

మరి కాస్సేపు అక్కడేవుంటే ఇంకెన్ని కఠోరభాషణలు వినవలసి వస్తుందోనని, అక్కణ్నుంచీ కదిలాడు. అనూరాధ యింటికి వెళ్లి ఆగాడు.

కాలేజీ టైమయినందువల్ల, మస్తాబై పుస్తకాలు సర్దుకుంటోంది అనూరాధ. కాంతారావును చూడగానే కొంచెం ఆశ్చర్యపడ్డది.

అంతకు ముందుగోజే, కాలేజీలో 'అటామిక్ ఎనర్జీ' మీద అనూరాధ రాసిన వ్యాసానికి ఫస్టుప్రయిజు వచ్చింది ఈ సంగతి కాంతారావుకు చెప్పి, కంగ్రాచ్యులేషన్సు అందుకోవాలని నిన్నట్నుంచీ తహతహ పడుతున్నది. అలాంటది, ఇప్పుడీ తీరులో కాంతారావును చూసేసరికి ఆ ఉత్సాహమంతా అణగారి పోయింది ఆమెలో.

"ఇదేమిటి ? ఈ పూట యూనివర్సిటీకి రారా ?" అంది

వస్తానన్నట్టు తలూపాడు. అతడి విషణ్ణవదనాన్ని చూసి, ఏదో అవాంఛనీయ సంఘటన జరిగివుండాలని వూహించింది అనూరాధ.

"మరి టైమైంది గదా! ... భోంచేశారా ?"

"ఇంకా లేదు."

"అయితే లేవండి, ఇక్కడే భోంచేద్దురుగాని."

"అహ. అక్కర్లేదు—"

"ఫరవాలేదు. మాయింట్లో అన్నం ఇంకా చల్లారిపోలేదు లెండి. నే నింతకు ముందే భోంచేశాను. లేవండి . స్నానంచేశారా?"

"ఊహుఁ"

ఇక్కడే చేద్దురుగాని మీ రిప్పుడింటికి వెళ్ళి రావాలంటే గంటకూడా వ్యవధి లేదు. లేవండి. టవల్సూ, సబ్బూ ఇస్తాను."

అక్కర్లేదంటూ లేచాడు. 'ఇప్పుడే వస్తాను, ఓ అరగంట వెయిట్ చెయ్య'మని అనూరాధకు చెప్పి ఇంటి మొహం పట్టాడు. అనూరాధ ఎంత సేపు చెప్పినా వినిపించుకోలేదు. ఇప్పుడిక్కడ అన్నంతింటే చెల్లాయి కోపంతో భగ్గుమంటుంది. మండే నిప్పుమీద నెయ్యిపొయ్యటం అతడికిష్టం లేదు.

ఇంటికి వెళ్ళి, స్నానంచేసి భోజనానికి కూచున్నాడు. ఇంట్లో వాతావరణమంతా చాలా నిశ్శబ్దంగా వుంది. గుర్నమ్మ కూడా చాలా మౌనంగా వడ్డించింది. అతడికి అన్నం సరిగా సయించలేదు. హృదయంలో కలత—మెత్తటి పూలమీద మదగజాల పాదఘట్టనలు.

భోజనం పూర్తిచేసి పుస్తకాలు తీసుకొని బయల్దేరాడు. అనురాధా వాళ్ళ ఇంటిదగ్గర కొచ్చేసరికి, అక్కడ గుమ్మంలో అనూరాధ ఎదురు చూస్తూ వుంది. అతణ్ణి చూడగానే వాచీ చూచుకుంటూ, "అమ్మయ్య, బతికించారు. జట్కా చేయించుకెడదాం రండి త్వరగా—" అంది అతడు వద్దన్నాడు. గుండెలు బరువుగా వున్నయ్. నడిస్తే ఆ బరువు కొస్త తగ్గుతుందేమోనని ఆశ. అనూరాధ ఎదురు చెప్పలేదు.

నడక సాగించారు. దారిలో అతడన్నాడు.

"మా హేమకు కోప్పడటమయితే తెలుసుగాని, ఎదుటి వాళ్ళను అర్థంచేసుకోడం తెలీదు."

ఈమాటల వెనక వున్న అనుభవాలను లీలగా వూహించుకుంటోంది అనూరాధ. అతడిపట్ల ఆర్ద్రభావమేదో పొంగుకు వచ్చింది.

"చాలా కష్టపడి ఆ మాత్రం కనుక్కున్నారు లెండి—ఈ నాటికి" అంది.

ఆ అర్థంచేసుకోలేని వాళ్ళపట్ల కాంతారావు చూపుతున్న మెతకదనాన్ని దృష్టిలో పెట్టుకుని ఈ మాటలన్నది అనూరాధ. అయితే అతడు మాత్రం, తన స్నేహితురాలి మీద నేరారోపణ జరగటం ఇష్టం లేక అనూరాధ అలా మాట్లాడుతున్నదనుకున్నాడు. మళ్ళీ మాట్లాడలేదు. అనూరాధ కూడా కోపం వస్తుందనీ, ఆవిడ మనసుకు తను గాయం కలిగించినవాడవుతాడనీ.

## 4

ఒక ఇంగ్లీషు సామెత చెప్పినట్టుగా, కాలం అన్ని గాయాలనూ మాన్పేస్తుంది. కాంతారావు హృదయానికి తగిలిన ఘాతం పెద్దది. కాని నాలుగైదురోజుల్లో దాన్ని చాలా వరకు మరచిపోయి మామూలుమనిషైనాడు. గతంలోని చేదును ఎక్కువకాలం మనసులో వుంచుకోవాలన్నా అతడికి కష్టంగానే వుంటుంది.

హేమకూడా బాధపడుతోంది, ఆనాడంత కటువుగా మాట్లాడినందుకు. హేమలో దుడుకుతనం పాలు ఎక్కువ. మనసు మెత్తనిది. ఒక్క కొడుకూ ఒక్క కూతురూ కావటంవల్ల అన్నా చెల్లెళ్ళిద్దరూ పుట్టిభూమ్మీదపడ్డప్పట్నుంచీ కలవారిచేతి ఎత్తుబిడ్డలుగా అతిగారాబంగా పెరిగారు. ఆ గారాబం హేమలో మంకుతనం పెంచింది. ఈనాడు కూడా ఆమంకుతనం పోలేదు. అయితే గియితే ఆ మంకుతనంచిన్నతనంలోలాగా కాకుండా యిప్పుడు అనవసర కోపం, చిరాకు, ఉక్రోషం మొదలైనరూపాల్లో బహిర్గతమవుతుంటుంది. ఆక్షణం దాటిపోయి, ఆ కోపద్రవం ఆవిరై పోయినప్పుడు తిరిగి మనస్సులో మిగిలేది ఆత్మీయతా పశ్చాత్తాపాల మిశ్రమకణాలు.

దీనికితోడు ఓసంఘటన జరిగింది. ఒక రాత్రి హేమకేదోపీడ కలవచ్చింది, అన్నయ్య మీద. అతడిపట్ల కటువుగా ప్రవర్తించిన సందర్భాలన్నీ ఆసమయంలో మనస్సులో మెదిలి దుఃఖం పొంగుకొచ్చింది...అన్నయ్యా! పసిపాపలాంటి అన్నయ్య! యీ ప్రపంచమంతా పణంగా యిచ్చినా మళ్ళీ తను అన్నయ్యను సంపాయించుకోగలదా? దుఃఖం ఆగక పైకి పెద్దగా ఏడ్చేసింది. అప్పుడు మెలకువొచ్చింది. చూస్తే ఎదురుగా రమణ—ముఖంలో ముఖంపెట్టి ఆదుర్దాగా ఏంజరిగిందని అడుగుతున్నాడు. ఆయన్ను తలనిమిరి ధైర్యం చెప్పింది. మంచంపక్క అన్నయ్య భయంతో రెండుచేతుల్లోనూ ముఖం కప్పుకు నిలబడివున్నాడు! ఆచేతులు రెండూ చేతుల్లోకి తీసుకుని గుండెల కదుముకోవాలనిపించింది. మళ్ళీ ఎందుకో అలా చెయ్యలేదు.

కాంతారావు యాంత్రికంగా యూనివర్సిటీకి వెడుతూ వస్తున్నాడు ఇదివరకులా గళాబోళామని మాట్లాడుతూ కాకుండా యిప్పుడు కొంచెం ముభావంగా వుండటం అలవాటు చేసుకున్నాడు శరీరానికి ఏభాగా

(53-వ పేజీ చూడండి)




చిత్రకారుడు: చెరుకూరి గురవయ్యనాయుడు
(పాకాల)



బంగారు శ్రీనాథ సుధాకరబాబు

ఒక అడవిలో నొక యేనుగు చచ్చి పడియుండెను. ఒకనక్క దానిని జూచి తనకు కొన్ని వారముల వఱకు ఆహారము దొరకెనుగదా యని సంతోషించెను.

అది దగ్గఱకు బోయి తన పండ్లతో ఏనుగు చర్మము చీల్చుటకు యత్నించెను. కాని, చర్మము గట్టిదగుటచే దాని ప్రయత్నము వ్యర్థమయ్యెను.

ఇంతలో ఒక సింహ మచ్చటికి వచ్చుచుండెను. జంబుకము దాని కెదురుగపోయి "ప్రభూ! మీకొఱకై ఎదురుచూచుచున్నాను. ఏనుగు మాంసము దొఱకుట యదృష్టము గదా!" అనెను. దానికి మృగరాజు, "ఛీ, ఎంగిలి కూడు నే నెన్నడును తినను. నేను చంపిన జంతువును నేను తినెదనేగాని చచ్చిన దానిని నే నెన్నడును ముట్టను" అని పలుకుచు వెడలిపోయెను.

కొంత సేపటికి ఒక పులి ఆదారిన వచ్చుచుండెను. నక్క దానిని చూచి "ఓహో, ఇది నీచపు మృగము. ఇది ఏనుగును తినుటయే గాక, నన్ను కూడా తినును" అనుకొనుచు దాని కెదురేగెను. పులిని జూచి నక్క, "ఓ! పులిఱేడ! ఇటు రాకుము. మృగరాజు ఏనుగు నొకదానిని జంపి నన్ను కావలిపెట్టి స్నానము చేయుటకై వెళ్ళినాడు. త్వరలో రాగలడు. నిన్ను జూచినచో నిన్ను కూడ

చంపివేయు" మని బెదరించెను. వ్యాఘ్రము నక్కమాటలు నమ్మి కాలికి బుద్ధిచెప్పెను.

పిమ్మట నొక చిఱుతపులి ఆ వైపునకు వచ్చెను. నక్క ఎదురేగి, "ఓ వన్నెలమెకమా! ఇచ్చట నొక సింహము ఏనుగును చంపి పడవైచినది. నీవు చాలా ఆకలిగొన్నవాని వలె నున్నావు. సింహము వచ్చువఱకు మాంసము భక్షింపుము. నేను సింహము జాడ తెల్పెదనులే అప్పుడు నీవు పారిపోవచ్చును," అనెను.

ఆ చిఱుత పులి నక్క వాక్యములకు లోబడినది. ఏనుగు చర్మమును తన వాడి గోళ్ళతోను, పండ్లతోను చీల్చివైచి మాంసము తినుట కారంభింపబోయెను. అది చూచి నక్క "వ్యాఘ్రరాజా! వ్యాఘ్రరాజువచ్చుచున్నాడిగో" అని కేకలు వేయజొచ్చెను. పాపము చిఱుతపులి భయపడి పారిపోయినది. నక్క ఏనుగుమాంసమును కొన్నివారములు సంతోషముతో భక్షించెను.



నక్క తన బుద్ధి బలముచేత తన కోరిక నెరవేర్చుకున్నది. బుద్ధిబలముతో ఎంతటి కార్యమునైననూ సాధింపవచ్చును. అందుకే పెద్దలు దేహబలముకంటె బుద్ధిబలము గొప్పదని నుడివిరి. ★

# హరి వంశము

వృతాగోపైః కతిపయైః
బలదేవ జనార్దనౌ
రంగం వివశతూ రాజన్
గజదంత వరాయుధౌ॥
మల్లానాం అశనిః
నృణాం నరవరః
స్త్రీణాం స్మరః
మూర్తిమాన్ గోపానాం స్వజనః
అసతాంక్షి తిభుజాం శాస్తా
స్వపిత్రోశ్శిశుః
మృత్యుర్భోజపతేః
విరాట్ అవిదుషాం
తత్త్వం పరం యోగినాం
వృష్ణీనాం పరదేవతేతి విదితో
రంగం గతస్సాగ్రజః

—భాగవతం.

మదాస్వగజులిప్తాంగులు, హస్తిదంతవరాయుధులు, రామకృష్ణులు, గర్వలీలావలోకనులై, మృగమధ్యంలో ప్రవేశిస్తున్న సింహాల్లాగా, కంససమాజవాటంలో ప్రవేశించారు. వారిని చూడగా రంగం అంతా సంకులతరంగకల్లోలితమైన సముద్రాన్ని పోలి జయజయనినాద సంకులతరంగమయం అయిపోయింది. కంసునకు భయము, భయముతోపాటు కోపము, రెండును కలాయి అతడు ఆవస్తున్న అన్నదమ్ముల నిద్దరను చూచినాడు. అతనిదృష్టి అందులో నల్లనివానిపై నిల్చింది. కువలయాపీడంయొక్క కొమ్ముల పోటుల వల్ల కలిగిన రక్తం దాని మదస్రుతులతో బెరసి, కస్తూరికామిశ్రకాశ్మీర చర్చికాలలితమై అతని భుజములను అలంకరించి వుంది. అంసన్యస్తమై వున్న కరినాధునియొక్క దంతం, కాలాభ్రతటస్థమై వున్న దుర్ధరోత్పాతకేతువును పోలి తనకు భయంగా కన్పిస్తున్నది. ఆ వస్తున్నవాడు కృష్ణుడే అయివుంటాడు. వాడు నీలనీరదసుభాంగుడు. పుండరీకాక్షుడు. ప్రజ్వలజ్జ్వలనార్క విభాసిమూర్తి. విక్రమ వ్యాప్తభువనుడు. అతి రౌద్ర ప్రకారుడై రంగంలో ప్రవేశిస్తున్నాడు. పూర్వజుడు ముందుగా కమలలోచనుడైన కృష్ణుడు రంగంలో ప్రవేశిస్తున్నాడు. మారుతావలితాంబరంగా, గజదంతకృతోల్లేఖంగా, కువలయాపీడ గండస్థల నిస్రుతమైన మదంచేత, రుధిరంచేత బాహువులు లిప్తములు కాగా, తత్పరిలిప్తభాగములు లీలాకృతాంగదముల వైఖరిని వహించగా, సింహమువలె వల్గమానుడు, మేఘమువలె వ్యాహమానుడు, బాహుశబ్దప్రహారములచేత వసుంధరను చలింపజేస్తున్నవాడు, దంతిదంతోద్యతాయుధుడు, శ్రీకృష్ణుడు కంసునకు సా[illegible] మృత్యువును పోలి కన్పించినాడు. ఆ కృష్ణుణ్ణి, కంసుడు, మధురేశ్వరుడు, భృశాయస్తముఖుడై, మ్లానముఖుడై, సరోషుడై, చు[illegible]డు. ఆ కృష్ణుడు ఇంకా ఎల్లా వున్నాడు? ఈ కృష్ణుడు కేశిమధనుడు. వాని భుజములపై ఆసక్తమైవున్న గజదంతం శుభమై ప్రకాశిస్తున్నది. ఆదంతంతో, ఆ కృష్ణుడు, చంద్రార్ధబింబ సంసక్తమైన గిరిశిఖరాన్ని పోలి కన్పిస్తున్నాడు.

రంగంలో అంతా ఆ రామకృష్ణుల వంక చూచినారు. మల్లులు అతనిని చూచినారు. వారికి అతడు అశనిని పోలి కన్పించినాడు సర్వప్రాకృతజనులు అతణ్ణి చూచినారు. వారికి అతడు నరవరుడై, పురుషోత్తముడై కన్పించినాడు. పురస్త్రీలు అతనిని చూచినారు. వారికి అతడు మన్మథమన్మథుడై కన్పించినాడు. పరమమూఢులు అతణ్ణి చూచారు. వారికి ఆయన పరమవికటుడై, బీభత్సంయొక్క మూర్తియై కన్పించినాడు. రాజులు అతణ్ణి చూచినారు. వారికి అతడు శాస్తవోలె కన్పించినాడు. గోపకులు అతణ్ణి చూచినారు. వారికి ఆయన హాస్యంగా కులజుడై తోచినాడు తల్లిదండ్రులు అతణ్ణి చూచుకున్నారు. వారికి అతడు పుత్రుడై కన్పించినాడు. బంధువులు అతణ్ణి చూచినారు వారికి అతడు ప్రేమభాసిల్లుతున్న వేలుపై కన్పించినాడు. రౌద్రాద్భుతశృంగారహాస్యవీరదయాభయానక బీభత్సశాంతప్రేమభక్తిరసాలు ఏకమూర్తియై శ్రీకృష్ణదేవుడు సాగ్రజుడై, రంగంలో ప్రవేశించగా అంతా అద్భుతాక్రాంతులై పోయినారు. ఇతడా కృష్ణుడు? ఇతడా రాముడు? వీరా రామకృష్ణులు? వీరా వాసుదేవులు? సర్వప్రేక్షకజనం దృష్టి అప్పుడు దేవకీ వసుదేవులమీదకు పోయింది. ఆ దేవకి ఆ పుత్రుణ్ణి చూచుకొని చన్నులు చేపునకురాగా సర్వాంగ పులకిత శరీరయై, ఆనందబాష్ప ప్రసన్నేత్రయై, మూర్తిమన్మాతృదేవతయై వారికి కన్పించింది. ఆ వసుదేవుడు ఎప్పుడూ నిర్లిప్తుడే. అతని కన్నులలో ఇప్పుడు ఆనంద తేజస్సంపద సందీప్తి వహిస్తున్నది. ఆ కుఱ్ఱలు ఇప్పుడు రంగగతులై విచిత్రవేషాభరణస్రగంబరులు, ఉత్తమవేషధారులైన నటులను పోలి, నిర్భీకులై, ప్రేక్షకమహాజనం కన్నులముందు, ప్రకాశించారు. మంచస్థితులైన నాగరరాష్ట్రికులైన నృపులు వారిని చూడగా, ప్రహర్షవేగోత్కలితేక్షణానలై పోయినారు. ఆ అన్నదమ్ములను ఎంతగా దర్శించినా, వారికి తృప్తి కలగడంలేదు. మహాభుజులు, వస్త్రమాల్యమణిదీప్త విభూషణ ధారులు, ధీరులు, సర్వలోక శుభాకారులు, మహాకారులు, మానవ మాలినీ మనోహారులు, గోపకుమారులు, రంగభూతల విహారులు, మహావీరులు, వారిని చూచి, చూచి, తనివిని తుదముట్ట పొందగాలేక, రంగస్థమహాజనం ఉక్కిరి బిక్కిరై పోతున్నది. కన్నులతో వారి అందాన్ని త్రాగుతున్నట్లు చూస్తూ, జిహ్వలతో అంటి చూస్తున్నవిధంగా న్యు(?) చేస్తూ, నాసలతో వారివపుస్సౌరభాన్ని ఆఘ్రాణిస్తున్నట్లు నిస్వసిస్తూ, బాహువులతో పరిరంభణంపడుతున్నట్లు అత్యున్నతిని చూపుతూ, ప్రేక్షక మహాజనం తదాత్మ్య బుద్ధిని భజిస్తున్నది.

అంతలో అంధకుడు తన స్థానంలో లేచి నిలబడి సామాజికులకు వారిని పరిచయంచేస్తున్నవాడు పోలె, జయజయ నినాదగదితంగా రామకృష్ణులను స్తుతించాడు. "జయ! పూతనాప్రాణ హాంత" అని అతడు అనగా, అప్రయత్నంగా సర్వసమాజవాటము జయ జయ నినాదాన్ని చేసింది. 'జయ! శకటాసురభంజన! జయ జయ! జయ కాళియఫణి మహాఫణారంగ తాండవకేళీపరా! పరాత్పరా! జయజయ! జయగోవర్ధనోద్ధరణ! జయజయ! జయ అరిష్టారిష్ట! జయ

హారీత శివశర్మ

**జయ! జయకేశవ! జయజయ! జయకువలయాపీడ నిర్మథన! జయ** జయ! జయసంకర్షణానుజ! జయజయ! ప్రభూ! వసుదేవుని వాసం బున వసుధన్ రక్షింప మీరు వెన్నవ రేపల్లె సనమున బుటినారట! మిమ్మల్ని పసిబిడ్డలనడం ఎట్లా! స్వామీ! మీరు పర దేవతలు! రక్క సినిపట్టి చంపింది, శకటుణ్ణి కూల్చింది, మద్దులను పడవేసింది, కాల కలిని సంహరించింది, ధేనుకుణ్ణి పిలుకుమార్చింది, అరిష్టుణ్ణి నష్టపరి చింది, కేశిని యీసడించింది, కంసుని ధనస్సును భంగపరిచింది, సామాన్యమా! తండ్రీ! నీవు దేవుడవు. స్వామి! నీవు ప్రభువవు. తాతా! నీవు అఖిల యాదవగణత్రాతవు. భగవన్! నీవు రంజకుణ్ణి సంహారించావు. కంసుని ఉతుపులను హారించివేశావు. కుబ్జను అకు బ్జను, బుజ్జిని పౌనర్చావు. నీచేతలు అద్భుతాలు. సుదాముని యందు నీవు చూపించిన ప్రేమ నీ మహత్వానికి తార్కాణం! తాతా! యాదవగణత్రాతా! ఇప్పుడు ఇక నీవు చేయలేనిది ఏమి వుంది!

జయసర్వాత్మక! సర్వభూత వినుతా! సంభావ్య! సర్వజ్ఞ!
సర్వయుగోత్పత్తి సమాప్తికర్మ కలనా వర్ధిష్ణు!
విద్యా వినిశ్చయ ధౌరేయ!
సమస్త విస్మయ విధా సంధాయక ప్రక్రియా!
నయ నిష్ఠావనతా రినోదన ధారీణవ్యాప్తిరంజత్ కృపా!

కృపమాలి కంసుడు కోపఘూర్ణితుడైపోయినాడు. అంధకుని యీ భట్టుపని యేమి? ఈ గొల్లలకు అతని యీ కైవారమేమి? ఈ కుత్తలముందు క్షత్రియులు తాము క్షత్రియులమన్న జ్ఞానాన్నే విస్మరిస్తున్నారు. కంసుడు, మధురేశ్వరుడు ఎఱ్ఱని తన కనుతో మల్లులను చూచినాడు. చాణూరముష్టికకూటులను, శలతోసలులను, సోపాధ్యాయులను చూచి నాడు. ఆ కన్నులలో కంసుని ఆజ్ఞ మెరిసింది. ఆ ఆజ్ఞను శిరసా ధరించి చాణూరుడు లేచినాడు లేచి శ్రీకృష్ణునిదిక్కై చూచాడు. ఆ చూచిన చూపులో భయము వున్నదో; గర్వము వున్నదో; వీరు నాకెంతయన్న చులకనితనము వున్నదో; సామాజికులకు మాత్రము వాడు చులకనయైనవ్యక్తిగా కన్పించలేదు. అనిమిషేభములను ఎనిమి దింటిని కలిపి మానుషాకృతిగా పేనగా, అవి వీడై వెలసినట్లు వున్నాడు చాణూరుడు. ప్రళయానలార్కుల పసఅంతా ఆవటించి ప్రోవు పెడితే ఎట్లా దీపిస్తుందో, అట్లా దీపిస్తున్నాడు చాణూరుడు. పవమానులం దఱ పరమార్థానికి రూపప్రౌఢని కల్పిస్తే, ఎట్లా వుంటుందో అట్లా వున్నాడు చాణూరుడు. గోత్రాచలం ఒక్కటి, తన స్థానాన్ని వదలి అవయవస్ఫూర్తిని వహించి, ఇట్లా నడిచివచ్చిందా అన్నట్లు వున్నాడు చాణూరుడు లావు, వేడిమి, రయము, మూర్తి పెంపు, అన్ని వానియందు అఖిలాద్భుతంగా అమరివున్నాయి. ప్రపం చంలో వీణ్ణి మించి ఇంకా ఎవరన్న మల్లులువుంటారా అన్న భావం అప్పుడు ఆ సమాజవాటంలో అందరికి కల్గింది. వీనినా, మధురే శ్వరుడు, ఈ లలితమూర్తిమీదకు, ఈ మన్మథ మన్మథుని మీదకు, నియుద్ధానికి వగులుతున్నాడు? అని ఆ సమాజవాటంలో అనుకోని వాడు లేడు ముఖ్యంగా స్త్రీలు ఇట్లా అనుకున్నారు. ఆ నల్లని కుఱ్ఱవాడు శ్రీకృష్ణుడట; అతని ముఖం చూడండి ఎట్లా వున్నదో! గజయుద్ధ కృతాయాసస్వేదాంబుకణికాచితమై అరుణ మైన నేత్రాలతో ఒప్పుతోంది. స్వశోభాధిక్యంచేత హిమవార్యలం కృతమైన వికాసిశరదంభోజాన్ని పోలివుంది. ఆ వక్షం ఎంత ఒప్పుతోంది! లక్ష్మికి ఆలవాలమైనట్లు శోభాయమానమై ఒప్పుతోంది భుజయుగ్మం విపక్షక్షపణంగా వుంది ఈతడు యౌవనోన్ముఖీ భూతం అవుతున్న సుకుమార తనువు. ఆ చాణూ రుడో వజ్రకఠినాభోగశరీరుడు. రాక్షసుడు వానితోనా, ఇప్పుడు ఈతనికి ఈ నియుద్ధం! ఇక్కడ ఇందఱుండి పెద్దలువున్నారు. వారి కైనా బుద్ధిలేదా! ఇది అసమపోరాటమే! దీన్ని వారు వారించలేరా!"

ఆ మాటలు వినగా కంసునకు ఒడలు భగ్గున మండి పోయినది. చాణూరునకు ఒడలు భగ్గున మండిపోయినది వానికి ఇక్కడ నృప కార్యం నెరవేర్చవలసిన పనివుంది. ఘనసత్వశౌర్యాలను చూప వలసిన అవసరం వుంది. ఇప్పుడు పౌరజనుల ఈ మాటలతో వాని



వి. శేషగిరిరావు (విశాఖపట్టణము)

లోని క్రౌర్యం, మాత్సర్యం అన్నీ పైకి పెల్లుబికినాయి. వాడు శ్రీకృష్ణ దేవుని మీదకు ఘోరసన్నాహముతో చనుదెంచి, రామకృష్ణులను సంబోధించి, ఆక్షేపరూక్షాక్షరంగా ఇట్లా అన్నాడు. "హే! నందసూన! హే రామ! మీరు వీర్యసంమతులు. నియుద్ధకుశలులు, అని విని మా మహారాజు మధురేశ్వరులు మిమ్మల్ని ఇక్కడికి రప్పిం చారు వనాలలో గోపబాలకులతో దూడలను మేపుతూ, మల్ల యుద్ధాలు మహా నేర్చి వున్నారని మేమునూ విన్నాము. పృథ్వీజనులు గూడా అదే మాట చెప్పుకుంటున్నారు అందుకే ఇప్పుడు ఈ మల్లా హవక్రీడకు మిమ్మల్ని మా మధురేశ్వరులు చీరబంచారు. ఇప్పుడు సభ్యులు విలోకింపగా మనం కొంచెం పరాక్రమిస్తే బాగుంటుంది. రాజు కోరికను పాలించడమే కదా, ప్రజల ధర్మము! రాజుకు ప్రియము చేద్దాము. మనసా, వాచా, కర్మణా, రాజుకు విపరీతంగా ఎప్పుడూ వ్యవహరించరాదు అందువల్లనే ఇప్పుడు రాజునకు ప్రియం చేయడానికి మేము సిద్ధంగా వున్నాము. రాజు సర్వభూత మయుడు. అన్ని భూతములు అతని ప్రియంకోసం బ్రతుకుతున్నాయి. మరి జనులు నేర్చిన విద్యలు జననాథుని కొరకే గదా, అవుతాయి! ఇప్పుడు ఆ జననాథుడు, ఈ ప్రజలు మెచ్చగా నియుద్ధం ఆచరిద్దాము.

ఇంతవరకు చాణూరుడు వాచోమర్యాదను పాటించినాడు. అంతలో వానిలో ధూర్తత్వము పొటమరించినది. అప్పుడు వాడు శ్రీకృష్ణునితో తిరిగి ఇట్లా అన్నాడు "మీకు జవసత్వాలు మేలుగా వున్నాయా? సాము వున్నదా? శరీరం సత్రాణమేనా? ఈ నా ముష్టిని చూచినావా? ఇది సాక్షాత్తూ వజ్రాయుధం; కాదో కృతాంత దండం; కాదో పరమశివుని మూడో నేత్రం. నీవో అర్భకుడవు ఇది ముష్టియుద్ధంగాని, వెన్న మెసవడం కాదు"

అని వాడు అల్లన నవ్వినాడు. మెల్లని చూపులతో మధురేశ్వ రుణ్ణి చూచినాడు. కంసుడు గూడ వాని మాటలకు సంతోషించిన వానివలె మృదుల మందహాసం చేసినాడు.

అప్పుడు శ్రీకృష్ణదేవుడు చాణూరునితో దేశకాలోచితంగా ఇట్లా అన్నాడు. "చాణూర! చూస్తున్నావుగా, మేము పిల్లలము. సాములు నేర్చామా అంటేలేదు. నీవో కులిశకర్కశదేహుడివి. నీతో నేను నియుద్ధం ఎట్లా సాగించగలను! ఇక ధరణీపతికి వేడ్కలుచేయడం అంటావా! అదీ మాచేతకాదు. మేము వన చరులము గదా! అయితే క్రీడావినోదం సల్పడం అంటావా, జన మునకు మెచ్చు పుట్టేట్లు జరపగలము అది కాదని ఎట్లా అంటాము. కాని ఒక్క విషయం వుంది. మీరు, మేము తుల్యబలులం కాదు అయినా యథోచితంగా నియుద్ధం చేయడానికి మాకు అభ్యంతరం లేదు. ఇందులో మీరు అనయపథం అవలంబించకుండా వుండాలి. పరస్పరం పరాక్రమాన్ని ప్రదర్శించి రాజునకు మెప్పు పుడు తుందేమో చూద్దాము. నీవు నాతో నియుద్ధం చేదువుగాని. ఈ మా బలరామునితో ఆ మీ ముష్టికుణ్ణి పెనగమను. ఇట్లా మేము మల్లా హవమునకు సిద్ధంగా వున్నాము."

శ్రీకృష్ణదేవుని ఈ మాటలు వినగా చాణూరునకు ఎత్తి

# హరివంశము

పొడచినట్లు వుంది వాడు మొగం గంటు పెట్టుకున్నాడు. వాడికి అప్పుడు కువలయాపీడ వధోదంతం తలలోకి ఎక్కింది, వాడికి నవ్వు వచ్చింది. వాడు ఇట్లా అన్నాడు: "ఓయి! ఓయి! కృష్ణ! నీవు బాలుడవా! ఏనుగులచంపెడి బలుడవు. అట్టి బలవంతులలో శ్రేష్ఠుడవు. మరి నేనో సహస్రద్విపసత్త్వభృత్తును. నాతో నే పోరాటం ఆడుతా నంటున్నావు! నీవు ఎంత వాడివి. పసుల గాచి, గొల్ల పడుచుల నెరపించి, వాళ్ళంతా బిరుదు ఇతడు అంటే పేర్చి తిరిగిన వాడివి. ఇప్పుడు అట్లాకాదు నీవు నాకు అగ్గమైనావు. తప్పుకుపోయేందుకు వీలులేదు. గొల్లడవు, గొల్లమాటలు మాట్లాడక, బిరుదుమాటలు మాట్లాడుతున్నావు! పీడు విఖ్యాతుడు, కులజుడు, సద్గుణుడు, సత్కర్మస్వభావుడు అన్నది నీకు పట్టలేదు. ఈ దృగ్విభవాలన్నీ నీకు వున్నాయా? ఇక్కడ పోరాడటం వ్రేతలతో ఆడుకుంటూ కుప్పిగంతులు వెయ్యడం కాదు కొంచెం ఆలోచించుకో!"

భగవంతుడు మెల్లన మందహాసం చేసినాడు. అది చూచి చాణూరుడు మరీ రెచ్చిపోయినాడు. శ్రీకృష్ణునితో ఇట్లా అన్నాడు "నన్ను ఏదో అన్నావు సరే! మా ముష్టికుడు ఈ బలరామునితో పోవలెనా! వాని శక్తి ఏమో తెలిసే మాట్లాడుతున్నావా? వాడు శివుణ్ణి మెచ్చడు. బ్రహ్మను కైకొనడు. విష్వక్సేనుణ్ణి చూస్తే నవ్వుతాడు. జగత్ప్రాణుడు తనకు ఈడు కాదని పోరికి రమ్మనడు బాహోబలప్రౌఢిలో ఈ ముష్టికుడు అక్షీణుడు. యుద్ధం అంటే వానికి ఇవ్వాళ్ళ రేపు అని లేదు. విచిత్రంగా వినోదిస్తాడు. వాడు, ఈ బలరామునకు ఈడు కాడనా నీ అభిప్రాయం. ఇటువంటి ప్రల్లదాలు చాలా విన్నాము బల్లిదులను గూడా చాలామందిని చూచినాము. మా చల్లడము క్రింద దూఱని మల్లులు మాకు ఎక్కడా ఇంతవరకు కన్పించలేదు."

భగవంతుడు వానిమాటల వింటూ విచిత్ర మందహాసం చేసినాడు. ఆ మందహాసాన్ని చూచినంతలో చాణూరుడు అప్రతిభుడైనాడు. వానికి అప్పుడు పూర్వజన్మస్మృతి ఏదో కల్గినట్లు వుంది ఏదో గాఢనిద్రపోతున్నవాడు మేల్కొన్నట్లయింది. వాడు కించిత్ తీక్షంగా ఇట్లా అన్నాడు "నీవు ఎవ్వరవు శ్రీహరివా! ఇందాక ఆ యాదవ వృద్ధు, అంధకుడు, ఆమాటలే అనినట్లు వున్నాడు. అవును! నాకు జ్ఞాపకం వస్తున్నది. నీవు విష్ణుడవు. విష్ణూ! నేను మధుడను. నీతో ఒకసారి పోరినాను. ఇప్పుడు నిన్ను వదిలిపెట్టను. ఇప్పుడు నువ్వు ఏ జలరాసిలో దాక్కుంటావు? ఏపర్వతం చాటున నిలుస్తావు? ఎక్కడి భూమిలోనికి చొరబారతావు? నరసింహరూపం దాలుస్తావా? లేక వామనుడవై బలిని బిక్షం ఎత్తినట్లు నన్ను ఇప్పుడు ప్రాణభిక్ష పెట్టమంటావా? ఇంక నీ ఆటలు సాగనీయను భూనాథ హింస నీకు పరిపాటి అయిపోయింది. ఆ ఆటను ఇప్పుడు కట్టేస్తాను. నీ కల్కితనం నాకు తెలియనిది కాదు! నీవు వట్టి బుద్ధుడవు! ఓయి కృష్ణా! ఓయి! విష్ణూ! ఇది వైకుంఠం కాదు. మధురాపురం; ఇది సంసారరహితుల సభ కాదు; కంసుని సభ, ఇది నారదుని వీణానాదం కాదు, చాణూరుని బాహునాదం, ఇక్కడ జరిగేది మల్లజనవిగ్రహం గాని, ఆడవాళ్ళతో ప్రణయ విగ్రహం కాదు. ఇప్పుడు నువ్వు ఎక్కడికి తప్పించుకుపోతావు! ఓయి! అర్భక! మా రాజు చూస్తూవుండగా ఇప్పుడు నిన్ను పొరిపుచ్చి వేస్తాను. ఈ సభ మెచ్చుకోగా నిన్ను పిలుకుమార్చి వేస్తాను. యముని కింకర వర్గానికి నిన్ను బందీగా పట్టి ఇస్తాను"

భగవంతుడు గల్లున నవ్వినాడు. కోపము బెరసినలోచనాంశువుల రక్తతతో ప్రళయసంధ్యగా కంసుణ్ణి చూచాడు. చూచి చాణూర మల్లునితో కఠిన గుర్భరభణితిని ఇట్లా అన్నాడు "నీవు నిఖిలార్థకారివని, కంసుడు మనస్సులో నమ్మినట్లు వున్నాడు. యుద్ధంలో నీ బలం అంతా చూపిదువు గాని ఈ మధ్య ఈ రజ్జన మాటలు దేనికి? వెడగ! నీ చండితనం అంతా ఇవ్వాళ్ళ వదిలించి వేస్తాను. నీ కీర్తికి ఇవ్వాళ్ళ భరతవాక్యం పల్కుతాను. అందుకోసమే వచ్చాను. చాణూర! నీవు కాళీయునికంటే గొప్పవాడవా! ఈ పదతలాలు చూడు! ఇవి వాని తలలను చిదియగా త్రొక్కాయి. అరిష్టుణ్ణి ఎరుగుదువు గదా! ఈ భుజయుగం వాని మెడనుబట్ట బిట్టు విరిచివేసింది. పిశితాశికేశి మీ రాజుకు మహాప్రియుడు. ఈ గోళ్ళు వాని ప్రేవులను కడిమిమై నెడలంగ తిగిచినాయి ఈ ముష్టియొక్క రుచి యేమో ఇంతకు ముందే మీ రాజు పట్టపు టేనుగు, కువలయాపీడం, ఎఱిగి మెగ్గతిల్లపడింది ఇవి అన్నీ తెలిసికూడా నీవు ఎందుకు ఇట్లా ఏపుమిగులుతున్నావు? ఎందుకు నాకు ఎదురు నడుస్తున్నావు? ఈ క్షణంలో నిన్ను విరిచి ప్రోవులు పెడతాను. మీ ఏలిక భయంతో కొట్టుకుపోయి బ్రయసి పడేట్లు చేస్తాను"

అన్నంతలో ఆకాశంలో దేవదుందుభులు మ్రోగినవి.

"జయగోవింద చాణూరం జహి కేశవ దానవం" అన్న మాటలు బయలులోనుండి వచ్చి అందరి చెవులను పడినవి.

కంసుడు ఆ మాటలు విని అప్రతిభుడై పోయినాడు.

చాణూరుడు శ్రీకృష్ణదేవునితో పోరుకు దిగినాడు.

ఇక్కడ భూమి మీద, అక్కడ ఆకాశములో తిరిగి మృదంగాది తూర్యములు, దేవతూర్యములును మ్రోగినవి. ★

# మనసులా — మనసులా

(47-వ పేజీ తరువాయి)

న్నయినా గాయం తగిలితే, అది మాని పోయినా, దానితాలూకు మచ్చ శాశ్వతంగా వుండిపోతుంది మనస్సు విషయంలో కూడా యింతే. అయితే యిక్కడ మచ్చ శాశ్వతత్వం. ఆగాయం తీవ్రతమీద కాక దాని అనుభవపు తీవ్రతమీద ఆధారపడివుంటుంది. హేమతో కూడా మునుపటిలా స్వతంత్రంగా వుండలేకపోతున్నాడు కాంతారావు. తన కీయింట్లో స్థానం లేదనీ, సాంఘిక పరిస్థితుల ననుసరించి స్థానం వుండదనీ, అలా స్థానం లేకపోయినా తను బలవంతంగా చొచ్చుకుని వచ్చి పీఠం వేసుకున్నాడనీ, ఇక్కడ తన ఉనికి అసహజమనీ భావించుకుని అతడు కించపడుతున్నాడు రోజూ ఎక్కువసేపు అనూరథయింట్లో గడుపుతున్నాడు. కాని బసమార్చ ప్రయత్నమేమీ లేదు.

అతడు ముభావంగా, ఒకింత దూరపు తనంతో మెసలటం హేమ ఓర్చలేకుండా వుంది ఇది తనమీద కినుకవల్లగావల్ను! ఇది తన వ్యక్తిత్వానికి ఓ సవాలు గావల్ను! అయినా తనకేం భయంలేదు తానీయింటికి యజమానురాలు. ఒకరిపట్ల వాత్సల్యంకాని, అనాదరం కానీ చూపే విషయంలో తన యిష్టాయిష్టాలకు ప్రత్యేకత వుంది దాంపత్యజీవిత వనంలో లభ్యమయ్యే ప్రతి గచిరఫలాన్నీ చిట్టచివరి మధుబిందువు మిగిలి వున్నంతవరకూ కొరతలేకుండా జుర్రుకోవాలన్నది తన గర్భంలో జీర్ణించుకున్న కోరిక. తనకూ అన్నయ్యకూ ఎంతైనా రక్తసాన్నిహిత్యం వుండొచ్చు. కాని దాని కోసం ఈ జీవనసౌఖ్యాన్ని ఏ రవ్వంతైనా త్యాగం చేయగల శక్తీ, మనోబలమూ తనకు లేవు.

ఈ ఆలోచనన్నీ కలిసి హేమలో ఒక రకమైన ఉదాసీనతను పెంపొందించాయి. ఆమె మామూలుగానే ప్రవర్తించసాగింది. ఈ సంగతు లేవీ రమణకు తెలియవు.

అనూరాధ ఆయింటకి ఎప్పుడేనా ఒకసారి వస్తూపోతూవుంది అప్పట్లో వచ్చిన మాటపట్టింపులు ఆమెకు హేమతోటి స్నేహాన్ని భంగం చెయ్యలేదు అలాగని వాళ్ళిద్దరిమధ్య దగ్గరతనం వృద్ధి కానూలేదు వచ్చినప్పుడు మాట్లాడుకుంటారు అప్పుడప్పుడూ ఛలోక్తులుకూడా విసురుకుంటారు ఆమధ్య నోసారి ఇద్దరూకలిసి సినిమాకెళ్లొచ్చారు కూడా అయితే ఆరోజూ, సినిమాకు వెళ్ళేముందు, ఇంట్లో ఒక చిన్న తుపానులాంటిది రేగింది అదేమిటంటే—

ఆసాయంత్రం ముందుగా సినిమా ప్రోగ్రాం వేసుకున్నది హేమా, అనూరాధా కాదు; హేమా రమణా దంపతులు టాయ్‌లెట్ అవుతుండగా అనూరాధ వచ్చింది "బహుశా అన్నయ్యకోసం గావల్ను" అనుకుంది హేమ అనూరాధ హేమతో కబుర్లు చెబుతూ కూచుంది ఆవిడకళ్లు ఎవరి కోసమో వెదుకుతున్నట్టనిపించింది హేమకు "బహుశా 'రాధ' ఎదురు చూస్తున్నది. 'కాంతుడి' కోసం గావల్ను!" అని స్వగతం చెప్పుకుంది హేమ

ఇంతలో రమణ వచ్చాడు "అనూరాధా! సినిమాకు వెడదాం వస్తావా?" అన్నాడు రమణ. హేమకూడా పిలిచింది. వస్తానంది అనూరాధ. "త్వరగా టాయ్‌లెట్ పూర్తి చేసి తెములండి" అని హెచ్చరించాడు రమణ.

గంట ఆరవుతోందనగా కాంతారావు వచ్చాడు. హేమా, రమణా తయారై, అప్పటికప్పుడు ముస్తాబవుతున్న అనూరాధ కోసం ఎదురు చూస్తున్నారు. కాంతారావు మౌనంగా లోపలికివచ్చి, చేతనున్న పూల పొట్లం బల్లమీద పడేసి, పుస్తకాలు తిరిగి బీరువాలో అమర్చడంలో నిమగ్నుడైనాడు

ఆ పొట్లం చేతిలోకి తీసుకుని విప్పింది అనూరాధ. అన్నీ మగువంతో కలిపిఅల్లిన మల్లెపూలదండలు హేమా, అనూరాధా చెరిన్ని పూలు జడల్లో తురుముకున్నారు. మిగిలిన పూలు బల్లమీద అమర్చివున్న కృష్ణుడి విగ్రహానికి వేసింది అనూరాధ.

ఎందుకో రమణముఖం ముడుచుకుపోయింది.

కాంతారావును కూడా సినిమాకు పిల్చింది అనూరాధ వస్తానన్నాడు. ఇది హేమకూ రమణకూ కొంత ఇబ్బందిగా వుంది తనభర్తా, అన్నయ్యా యిద్దరూ కలిసివచ్చిన యీ సినిమా ప్రోగ్రాం సజావుగా కొనసాగుతుందని హేమకు నమ్మకంలేదు

రమణకు సుతరామూ యిష్టంలేదు, కాంతారావు తమతో బాటుగ రావటం దంపతు లిద్దరికీ వొక్కసారిగా అనూరాధమీద కోపం వచ్చింది

> భార్య—ఏమండీ! సిగిరెట్ తాగుతారు కదా! అందులో ఏముంటుందండీ?
>
> భర్త—పొగాకు.
>
> ఆర్. హనుమంతరావు (బొల్లారంబజార్)

"త్వరగా తయారవండి" అంది కాంతారావుతో అనూరాధ.

"ఆయన తయారయ్యేసరికి టైం దాటి పోదూ?" అన్నాడు రమణ, మింగాలేక కక్కాలేక

"దాటిపోదులెండి. ఇప్పుడేగా ఆరయింది. షో మొదలయ్యేసరికి ఎంతలేదన్నా ఆరున్నరవుతుంది. ఎటొచ్చీ మనం నడిచి వెళ్ళంగదా!" అంది అనూరాధ వాచీ చూచుకుంటూ.

రమణ మౌనంగావుండి, కాస్సేపయాక లేచి మేడపైకి వెళ్ళిపోయాడు. ఇదంతా గమనిస్తోనేవుం దనూరాధ. అయితే ఆమె ఆశ్చర్యపడలేదు

హేమ కేమీ పాలుపోలేదు చీటికీ మాటికీ యీ తుఫానులేమిటి? ఎంతో ఉత్సాహంగా వేసుకున్న సినిమాప్రోగ్రాం ఇలా తయారవుతోంది. అన్నీ మనం అనుకున్నట్టుగా జరిగిపోతే యీ ప్రపంచం ఇలా వుండదు గావల్ను! అసలు అనూరాధను పిలవటమే తప్పయింది. అన్నయ్యేమో తనపాలిట ఏలనాటిశనిలాగా వున్నాడు.

అనుకున్నంతా అయింది "నాకు తలనొప్పిగావుంది మీరువెళ్ళం"డన్నాడురమణ, మేడమీదికి వెళ్ళిన హేమతో. ఇంత అర్ధాంతరంగా ఆ తలనొప్పి ఎందుకు రావలసివచ్చిందో ఎవరికీ తెలీదు హేమ కిదేసందేహం వచ్చిందిగాబోలు, అడగబోయింది రమణ కసిరికొట్టాడు హేమ బాధపడింది

కిందికి దిగివచ్చి, ఆసంగతి వాళ్ళతో చెప్పింది

"సరే, మనం వెళ్దాంలే" అంది అనూరాధ ఎలాగేనా సినిమాకు వెళ్ళితీరాలన్న పట్టుదలతోవుంది అనూరాధ. రమణ తను రాననటం ఆ పట్టుదలను పెంచింది

కాంతారావుకూడా కాసేపు మథనపడ్డాడు బావగారి తలనొప్పికి తను బాధ్యుడవటం అతడి కిష్టంలేదు.

"నాకూ తలనొప్పిగావుంది నేనూరాను" అన్నాడు.

మామూలుగా తలనొప్పి మానవులకు దుర్భరమయిన నొప్పులలో వొకటి. వాస్తవంలో అది అనుభవానికి రాకూడదనే అంతా కోరుకుంటారు కానీ, ఇంత దుర్భరమయిన తలనొప్పి, రవ్వంత అబద్ధపు అనుపానంతో కలిపి ఉపయోగిస్తే క్లిష్టసమయాల్లో అమోఘంగా పనికొస్తుంది ఇది తప్పిస్తే, ఇప్పుడు బావామరుదుల తలనొప్పికి వేరే సంజాయిషీ దొరకటం దుర్లభం

అనూరాధ విస్తుపోయింది. కాంతారావు రాననటంతో ఆమె పట్టుదలంతా కరిగి నీరైపోయింది

అన్నయ్యదగ్గర్నుంచీ ఈ సమాధానం వస్తుందని వూహించలేదు హేమ. ఆమెకు నవ్వాలో, ఏడవాలో అర్థంకాలేదు. కాని

ఒక విధంగా ఏడవాల్సిన అవసరం లేదని పిస్తోంది. ఎందుకంటే ఇంతదాకా – ఆయన రాకుండా తను వీళ్ళతో ఎలా సినిమాకు వెళ్ళటమా అని సందేహిస్తోంది ఆయన తలనొప్పి, స్వయానా కల్పించుకున్నదే నని తనకు తెలుసు. అయినా, ఆయనధోరణి అలా వున్నప్పుడు తను సినిమాకు వెళ్ళటం బాగోలేదు. ఆయన ఏమైనా అనొచ్చు. "నేను తలనొప్పితో భస్తుంటే నువ్వు టింగురంగా అని సినిమా కెళ్ళావు. నీకేం, మహారాజులా తీసుకెళ్ళే అన్నగారుండగా!" అన్నా అనగలరు. ఇది ఇన్నాళ్ళ సాహచర్యంలో తనకు అనుభవానికి వచ్చిన సత్యం

ఇప్పుడా సమస్య తీరిపోయింది అన్నయ్య రావటంలేదు కాబట్టి, ఆయన ఏమీ అనకపోవచ్చు ...

"అయితే శుభ్రంగా మానేద్దాం." అంది అనూరాధ, కాంతారావు గ నసటం వల్ల

"మానెయ్యడం దేనికి? వాళ్ళకు తలనొప్పయితే మనకేం నొప్పి? వాళ్ళింటాగులే • మనం వెడదాం" అని బలవంతం చేసింది హేమ.

# మనసులూ మానసులూ

ఇహ కాదనలేక హేమతో బాటు వెళ్ళింది అనూరాధ

## 5

చాలా రోజుల్నుంచి దుర్గమ్మ యింట్లో లేదు. మహబూబ్ నగర్‌లో వున్న పెద్ద కొడుకు సుందరం దగ్గరికి వెళ్ళిందామె

దుర్గమ్మ ఎక్కడవున్నా, ఆవిడ ఉనికి. ఇంట్లో వున్న వాళ్ళక్కూడా తెలీదు వంటా, వార్పూ మొదలైన నిత్యావసర విషయాల్లో తప్పితే ఇతర సంఘటనల్లో ఆమె ఎక్కువ కలగజేసుకోదు భర్త పోయి నప్పట్నుంచీ కొడుకుల, కుమార్తెల బాగోగుల విషయంలో ఆమె తన బాధ్యతలను అప్రమత్తతతో నిర్వహిస్తున్నా, వాళ్ళ జీవితాని కొక దారి ఏర్పరచటం వరకే తన బాధ్యత అనీ, ఆదారిలో అనుభవాలను పొగు చేసుకుంటూ వాళ్ళే మానాన వాళ్ళు ప్రయాణించవలసిందే గాని తను చెయ్యిపట్టుకు నడిపించాలనుకోవటం విజ్ఞత కాదనీ ఆమె భావం. 'నళినీ దళగత జలమతి తరలమ్' అన్నట్టుగా వుంటుంది.

తనకు గృహచ్ఛిద్రాల్లో మనశ్శాంతి వుండటం లేదనీ, కొత్త మాటసాయంగా వుండేందుకు అమ్మను పంపమనీ తమ్ముడికి జాబు రాశాడుసుందరం అది చూచుకుని బయల్దేరి వెళ్ళింది దుర్గమ్మ.

ఆమె వెళ్ళటం రమణకిష్టంలేదు. అతడు మొదట్లో వద్దన్నాడు. ఆమె వెళ్ళితే హేమ రెండుపూటలా వంట పొయ్యిదగ్గర కూచోవలసి వస్తుంది నిన్న గాక మొన్నవచ్చిన భార్యకు అంతపని ఒక్కసారి నెత్తిన పడటం అతడు జరగనివ్వలేడు. అందుకనే దుర్గమ్మను వెళ్ళొద్దని చెబితే, అతడి యిష్టానికి వ్యతిరేకంగా ఆమె వెళ్ళింది. రమణకు కోపం వచ్చింది.

ఆమె వెళ్ళిన మూడో నాడు, నిడదవోలులో వున్న తన రెండో అక్కయ్యను జాబురాసి పిలిపించాడు రమణ.

ఆవిడపేరు రత్నమ్మ తెంచుకొని అత్తగారింట్లోనే వుంది. తన భర్త బతికున్నప్పటి వైభవాలను మాటిమాటికి చాటుకుంటూ, ఆయింట్లో వ్యక్తులమీద నిర్బంధపు అధికారం చెలాయిస్తుంటుంది. ఆయింట్లో వాళ్ళందరికీ ఆవిడతో ఎక్కువ లోలూచీలు పెట్టుకోవాలంటే భయం. రమణ రాసిన జాబు చూడగానే ఆవిడ తమ్ముడి యింటికి ప్రయాణం కట్టింది. ఇప్పటి దాకా తను అత్తగారింటిని తీర్చి దిద్దుకువస్తున్నదని ఆవిడ స్వయంగా కల్పించుకున్న మనస్సంతృప్తి. ఇలా తీర్చిదిద్దగల వ్యక్తి గనకనే తనను రమ్మని తమ్ముడీగోజున రాశాడు. వాడికి అనుభవంతక్కువ. కొత్తకాపురం వెళ్ళి వాడికాపురాన్ని కూడా తీర్చిదిద్దాలి. ఆమధ్య వస్తుండినవుత్తరాలవల్ల – తమ్ముడియింట్లో అప్పుడే వాడి బావమరిది వొకడువచ్చి పీరం వేశాడని తెలిసింది. ఇది తనకేం ఆమోదయోగ్యంగా లేదు. ఇహ మరదలుపిల్ల ఎలాంటిదో! పెళ్ళప్పుడు చూడటమే తను. రవంత పెంకెతనం వున్నట్టు కనిపిస్తోంది ఆపిల్లనుకూడా తన పెత్తనంలోకి తీసుకుని తీర్చిదిద్దాలి.



(ఇంకా ఉంది)



# కాలక్షేపంలో నిక్షేపం 'కనకదుర్గ పూజామహిమ'

రంగత్తుంగ తరంగిణి అయిన కృష్ణానదిలా సాగిపోతూ నృత్యగాన హాస్య రసాలతో పట్టయిన కట్టుకథను ఆకట్టుకుంటూ నవంబరులో మద్రాసులో పట్టే ముసురు లాంటి 'సస్పెన్స్'తో సామాన్యులకు చక్కని కాలక్షేపం కొల్లలుగా అందిస్తూ విఠల్ ప్రొడక్షన్స్ వారి 'కనకదుర్గ పూజా మహిమ' ఇటీవల విడుదలయింది గోల్డెన్ స్టూడియోస్‌లో నవంబర్ 16వ తేదీ పత్రికా రచయితలు ఈ చిత్రం దర్శించారు.

వినోద ప్రధానమైన చిత్రాలలో కథ వెతకబోవటం భర్తృహరి సుభాషితాన్ని జ్ఞాపకం చేస్తుంది. పౌరాణిక వాసనలతో అల్లే కట్టుకథల్లో జిగిగల కథావస్తువుండదు. ఉన్నా, ఉన్నదని చిత్రకారులు చెప్పినా అది 'కథ' అని సాహితీపరులు అనలేరు.

కేవలం పూజాభాజనం మటలేదనే కని కొద్ది కనకదుర్గవంటి ఈ తనుదేవత కోపించడం మీద ఈ కథ ఆధారపడింది దేవతలలో రాక్షసత్వం పూర్తిగా చిత్రించి చిట్టచివర క్లయిమాక్సులో అదే దివ్యత్వంగా వ్యాఖ్యానించే కథలు కథలనిపించుకోవు. దాదాపు నేటి పౌరాణిక చిత్రకథలన్నీ ఇలాగే ఉంటున్నాయి అందుకు ఈ కథకూడా అపవాదం కాదు.

సరస సంగీత వినోదంలో మైమరచి ఆనందించే ఒక రాజు కనకదుర్గ పూజ రసాభాసమని భావించి తిరస్కరించగా ఆ జగదంబ ఆగ్రహం వహించి రాజదంపతులను విడదీసి అష్టకష్టాలపాలు చేసి చివరకు అందర్నీ కలిపిన కథ దీని ఇతివృత్తం.

సినిమా కథలన్నీ కనతగినవేగాని వినదగినవిగాను, వినగలిగేవిగాను ఉండవు వింటే బాగుండే కథలు కొన్ని చిత్రీకరిస్తే గా గుండక పోవచ్చు. అలాగే తెర కథలు వినాలన్నా, చెప్పాలన్నా పీచు మిఠాయిలా ఇతివృత్తం తేలిపోతుంది.

అయితే ఉన్న కథ ఎటువంటిదయినా ఆ కొస్త దాన్ని కథనంలో చమక్‌గా తయారు చేసి, మరికొన్ని ఉపకథలూ, హాస్యకథలూ జోడించి మొత్తంమీద తెరకథను అత్యంత ఆకర్షణీయంగా చిత్రించి కృతకృత్యులైనారు దర్శకుడు విఠలాచార్య

నాయకీ, నాయకులుగా కృష్ణకుమారి కాంతారావు నటించారు. ఇటీవలి చిత్రాల్లో తగిన అవకాశం లభిస్తున్న కాంతారావు తన పాత్రలను సంప్రదాయసిద్ధంగా, చక్కగా నటిస్తున్నారు. రాజనాల మిక్కిలినేని, ముక్కామల, ఆదోని లక్ష్మి, బాలకృష్ణ, మీనాకుమారి మున్నగువారు నటించిన ఈ చిత్రంలో తెరకు దగ్గరగా ఉండేవారికి కావలసిన 'మిర్చిమసాలా' అంతా ఉంది. టెంపో చెడకుండా, అమిత వేగంతో నడుస్తుంది దర్శకత్వం.

రాజన్, నాగేంద్ర సంగీతం తీసివేస్తే ఈ చిత్రం ఘోషించని సముద్రంలా ఉంటుంది. ఈ చిత్రంలో ప్రముఖ గాత్రధారణ సంగీతానిదే. "జీవనమే పావనం" అనే తొలి గీతం కుంతలవరాళి వీణాస్వరాళితో ఎంతో హాయిగా ఉంది. రెండు మూడు పాటలలో వాద్య పరికరాలకు చక్కిలిగింతలు పెట్టి చక్కని గమకం పలికించుకున్నారు సంగీత దర్శకులు. రచయిత జి. కృష్ణమూర్తి మాటలు వాడిగా వేడిగా కొంచెం వేడుకగా ఉన్నాయి. పాటల రచనలో రచయిత చూపిన మాటల పొందిక, పొడిమి మెచ్చుకో తగినదిగా ఉంది.



విఠల్ ప్రొడక్షన్స్‌వారి 'కనకదుర్గ పూజామహిమ'లో నాయిక కృష్ణకుమారి



ఎన్. ఏ. టి. వారి "సీతారామకళ్యాణం'లో మండోదరిగా బి. సరోజ, రావణాసురుడుగా యన్. టి. రామారావు.

అంజలీపిక్చర్స్‌వారి 'ఋణానుబంధం'లో అంజలి, నాగేశ్వరరావు.

# వార్తాభరణం

మోహరన్ థియేటర్స్ (సహస్రశిరచ్ఛేద అపూర్వ చింతామణి) వారు ఇప్పుడొక కొత్తరకపు సాంఘిక చిత్రం మొదలుపెట్టారు. దర్శకుడు సి. యస్ రావు, రచన సముద్రాల (జూ.)

*  *  *

కె. వి. ఆర్ట్ ప్రొడక్షన్సువారి సాంఘిక చిత్రం 'కన్నకొడుకు' సదాశివబ్రహ్మం రచనతో పూర్తి కావస్తున్నది. జగ్గయ్య, దేవిక, రాజనాల, రమణారెడ్డి, కృష్ణకుమారి, కె. వి యస్ శర్మ, బాలకృష్ణ, ఛాయాదేవి ఇందులో పాత్రధారులు, కృష్ణారావు దర్శకుడు, సంగీతం కోదండపాణి.

*  *  *

విజయగోపాల్ (గంగాగౌరీ సంవాదం) ప్రొడక్షన్స్ ద్వితీయ చిత్రం సగం పూర్తి అయింది ప్రసిద్ధ ఆంగ్ల నవలా రచయిత చార్లెస్ డికెన్స్ రచించిన 'ఆలివర్ ట్విస్ట్' ఆధారంగా వీరీ చిత్రం నిర్మిస్తున్నారు దర్శకుడు తిలక్, సంగీతం పెండ్యాల, నటీనటులు జగ్గయ్య, దేవిక, రాజసులోచన, కాంతారావు, రమణారెడ్డి, రాజనాల, సి.ఎస్.ఆర్, పట్టుంబరావు. సూర్యకాంతం, నవగాయకుడు బసవేశ్వర్‌ను ఈ చిత్రం పరిచయం చేస్తుంది.

*  *  *

తమిళంలో ప్రభుత్వ బహుమానం పొందిన 'బాగాపిరివిసై' సారథి స్టూడియోస్‌లో తెలుగులో ముస్తాబవుతున్నది ఈ చిత్రానికి 'కలసి ఉంటే కలదు సుఖం' అని నామకరణం చేశారు. సావిత్రి, యన్. టి. రామారావు, రంగారావు నటిస్తున్నారు.

*  *  *

'జల్సారాయుడు' నిర్మాతలు హైదరాబాద్ మూవీస్‌వారు తమ రెండవ చిత్రం ప్రారంభించారు. తిరిగి ఇందులో కూడా జమున, జగ్గయ్య నాయికా నాయకులుగా నటిస్తున్నారు.



## 'కనక దుర్గ పూజామహిమ'

కత్తియుద్ధాలు, పాము కాట్లు, మంత్రశక్తులు, ఎ· ·ంట్ల హంగామాలు, ఆకాశయానాలు, ·ాచాల మాయలు, పాతాళ గుహాలూ, కైలాస లోకాలూ, ఇవేకాక యుగళగీతాలు ప్రేమపాఠాలు, కనులపండువ చేసే కమనీయ దృశ్యాలూ

ఒక్క మాటలో 'కనకదుర్గపూజామహిమ' కాలక్షేపంలో నిక్షేపం వంటిది. దర్శకుడు విఠలాచార్య మహిమ కొంత ఇందులో అందరికీ తెలుస్తుంది.



# నవనవోన్మేషమైన జర్మన్ ఫిలిం పరిశ్రమ

## తారలతో ఇష్టాగోష్ఠి

చెన్నపట్నంలో పశ్చిమ జర్మనీ చలనచిత్రోత్సవంలో పాల్గొనేందుకు వచ్చిన ఫిలిం ప్రతినిధివర్గం వారితో స్థానిక ఫిలిం పత్రికా రచయితలు 15 వ తేదీ సాయంకాలం గంటకు పైగా ఇష్టాగోష్ఠి జరిపారు.

సమరంలో శిథిలమైనా పదిహేనేళ్ళలో పశ్చిమ జర్మనీ ఫిలిం పరిశ్రమ పునర్నిర్మాణం ఎంత చురుకుగా సాగినదో ఈ పిచ్చాపాటీ వల్ల వెల్లడయింది. జర్మను చిత్రాలు ఎంత త్వరితంగా తయారవుతాయో విన్నప్పుడు ఎవ్వరికైనా ఆశ్చర్యం కలుగక పోదు. అలానే తమ వేతనాలపట్ల తారల వైఖరి తెలుసుకొన్నప్పుడు కూడా కొంత విస్మయం జనించక పోదు.

ఈ సంగతుల వివర మిది

జర్మను ఫిలిం ప్రతినిధివర్గంలో నలుగురు తారలు-కుమారి సబైన్ సెసెల్మన్, శ్రీమతి మరియా నికోవ్, శ్రీమతి మిరియమ్ బ్రూ, శ్రీ హోర్స్ట్ బుకోల్జ్ వున్నప్పటికీ వీరిలో ఒక్కరు నటించిన చిత్రమయినా ఉత్సవ సందర్భంలో ప్రదర్శించకపోవడం విస్మయకరమే కాక విషాదకరం కూడా. బుకోల్ నాయకుడపాత్ర ధరించిన "దికన్ఫెషన్ ఆఫ్ ఫెలిక్స్ క్రల్' చిత్రోత్సవానికై తెచ్చారు కాని భారత సెన్సార్ అధికారులు దాని ప్రదర్శనకు అనుమతి ఇవ్వలేదు. ఇందుకు శ్రీ బుకోల్జ్, ఆయన సతి మిరియమ్ బ్రూ విచారం వ్యక్తంచేశారు.

ఈ ప్రతినిధి వర్గంలో మిగిలిన నలుగురు ఫిలిం వ్యాపారానికి, పుత్పవానికి సంబంధించిన వారు. ప్రతినిధివర్గం నాయకుడు డాక్టర్ గురెంటర్ ష్వర్జ్. భారత్ లో జర్మనుచిత్రాలు ధారావాహినిగా ప్రదర్శించబడేందుకు అవకాశాలను ప్రభుత్వం కలుగ చేయాలనే ఈయన కోరారు.

పశ్చిమ జర్మనీలో దాదాపు పదిమంది అగ్ర నటీనటులు వున్నారు వీరిలో ఒక్క కర్డ్ జర్గెన్సుకు ("దిరాయల్ గేమ్" ముఖ్యనటుడు) మటుకు చిత్రానికి రెండులక్షల మార్కులు(దాదాపుఐదులక్షల రూపాయలు) పలుకుతోంది తక్కిన మేటి నటీనటులకు చిత్రానికి రెండు, రెండున్నర లక్షల రూపాయలు ప్రతిఫలం మటుకు వుంటుంది లాభంలో వాటాలేదు. ఒక్కొక్క చిత్రంలో ఐదారు వారాలకు మించి షూటింగ్ పని వుండదు తడవకు నాలుగైదు చిత్రాలలో మించి నటించరు.

ఒక తార రెండులక్షల మొత్తం పట్ల అసంతృప్తి ప్రకటించింది ఇంత చిన్న మొత్తంతో హోదాకు తగ్గట్టు బ్రతకడం కష్టమని. అందుచేత ఎంత సేపటికీ హాలివుడ్, బ్రిటిష్ ఫిలిం రంగాలలో అవకాశం కోసం అర్రులు జాచుతూ వుంటామని చెప్పారు. జర్మను అగ్రనటీనటులు ఫ్రెంచి, ఇటాలియన్, స్పానిష్, స్వీడిష్ చిత్రాలలో కూడా నటిస్తూ వుంటారు

బొంబాయిలో ఒకటి రెండు పెద్ద స్టుడియోలను వీరు చూచారు. వీరితో జరిగిన గోష్ఠిబట్టి వారికి మహాగొప్ప అభిప్రాయం కలిగినట్లు లేదు. మర్యాదపూర్వకమైన సంతృప్తిమటుకు తొంగి చూచింది. ప్రస్తుతం బొంబాయిలో నిర్మాణంలోవున్న "సన్ ఆఫ్ ఇండియా" మరికొన్ని చిత్రాల రషెస్ వీరు చూచారు. పైచిత్రంలోని బాలనటుడు, లీలానాయుడు-వీరి నటనా, శాంతారామ్ దర్శక విజ్ఞానం వీరికి బాగా నచ్చినట్లున్నది.

పోతే పరిశ్రమ అభివృద్ధి గురించి రెండు ముక్కలు.

1946 లో జర్మనీలో 2125 సినిమా థియేటర్లు వున్నవి. 1959 కు మొత్తం 6884 సినిమా ప్రదర్శనశాలలు వెలసినవి. 1946 లో ఒకే ఒక కథాచిత్రం నిర్మించారు. 1950 లో 82 తయారైనవి. ఇప్పుడు 120 దాకా కథా చిత్రాలు, నాలుగైదు వందల డాక్యుమెంటరీలు తదితర చిన్నచిత్రాలు తయారౌతున్నాయి.

ఒక్క బెర్లిన్‌లోనే 15 స్టుడియోలు వున్నవి.

భారతదేశంలో చారిత్రక చిత్రాలు, బ్రిటిష్ హయాంలోని భారత ప్రజాజీవితానికి సంబంధించిన చిత్రాలు విరివిగా రాకపోవడంవల్ల వీరు అసంతృప్తి వ్యక్తం చేశారు.

న్యూవుడ్‌లాండ్స్‌లో విందు జరిగిన సమయంలోనే ఈ గోష్ఠికూడా ఏర్పాటయింది.





ప్రగతి ఆర్ట్ ప్రొడక్షన్స్ 'మా బాబు' లో సీనియర్ డాక్టర్ అశోక్‌గా నటించిన గుమ్మడి.



అన్నపూర్ణావారి ఆరవ చిత్రంలో రేలంగి, రంగారావు.

# బాగ్దాద్ గజదొంగ

తెలుగు తెరమీద ఓరుగల్లు, విజయనగరం, వంటి తెలుగు రాజనగరాలకు చోటు కరవు అయినా బాగ్దాద్ వంటి నగరాలు దేదీప్యంగా వెలిగిపోతూనే ఉన్నాయి. ఇది ఆశ్చర్యపడవలసినదే! అల్లా ఉద్దీన్, అలీబాబా వంటి చిత్రాలు ఇదివరలో వచ్చాయి. ఇప్పుడు టి.పి. సుందరం నిర్మించిన 'బాగ్దాద్ గజదొంగ' చిత్రం అదేకోవకు చెందినది విడుదల అయింది.

ఎం జి రామచంద్రన్, వైజయంతీమాల, టి ఆర్ రామచంద్రన్, ఎం ఎన్ రాజం నంబియార్, అశోకన్ నటించిన ఈ చిత్రం నవంబరు 17 న ప్లాజాలో ప్రదర్శించారు. మాటలు పాలగుమ్మి పద్మరాజు, పాటలు శ్రీశ్రీ వడ్డాది రచించారు. సంగీతం దివాకర్.

గజదొంగలుగా పేరుబడిన వారిలో గజం పేరయినా దొంగతనం లేనట్లు ధీరోదాత్తులుగా చిత్రించే అనేక కథలు తెలుగు తెరకు ఇదివరలో అనువదించారు. ఈ చిత్రం కూడా ఆ జాతిలోకే వస్తుంది.

## 'మొదటి పేజీలో కనిపించిన కథ'

గ్లామరస్ పాత్రలను విశిష్టంగా నిర్వహించిన రీటాహేవర్త్ వ్యాకుల భూమికను ధరించిన "ది స్టోరీ ఆన్ పేజ్ వన్" (పత్రికలలో ప్రథమ పుట కథ) అనే హాలీవుడ్ చిత్రం గతవారం మద్రాసులో ప్రదర్శితమైనది. రీటా భర్త త్రాగుబోతు తత్ఫలితంగా ఆమె మరొకరి సాహచర్యం పొందుతుంది అతనికి భర్తకు మధ్యజరిగిన కుమ్ములాటలో రివాల్వర్ పేలి భర్త మరణిస్తాడు. రీటాను, ఆమె ప్రియుని అరెస్టుచేసి అభియోగం నడుపుతారు. తుదకు వీ రుభయుల సాహచర్యం హత్యకు దారితీసే టంతటిది కాదనే కారణంపై ఇదరిపైనా కేసుకొట్టివేస్తారు.

చిత్రం ఎక్కువగా కోర్టుగుట్టాలతో సాగుతుంది వాటి చిత్రీకరణ "అనాటమీ ఆఫ్ మర్డర్" "విట్నెస్ ఫర్ ప్రాసిక్యూషన్" అంతరమణీయంగా లేకపోయినా వాదప్రతివాదాలు మటుకు కొత్తచిత్రంలోనే ఉద్రిక్తంగా సాగినవి. ప్రభుత్వపు తరపు న్యాయవాదిగా స్టాన్‌ఫర్ట్ మన్సార్ నటన, రీటా నటు విశిష్టం. శ్రీ హోవే ఛాయాగ్రహణం సాధారణం. దర్శకుడు శ్రీ క్లిఫర్డ్ ఓడెట్స్ 

## హాలీవుడ్ నటరాజు క్లార్క్ గేబుల్ మృతి

హాలీవుడ్ నటరాజుగా ప్రసిద్ధుడైన క్లార్క్ గేబుల్ నవంబర్ 16 వ తేదీ రాత్రి తనువు చాలించారు.

దాదాపు మూడు దశాబ్దాలుగా తొంభై చిత్రాలలో అనేక రకాల పాత్రలు ధరించి విశేష జనాదరణ పొందిన క్లార్క్ గేబుల్ నవంబర్ 6 వ తేదని గుండెపోటుకు గురి అయినారు హాలీవుడ్‌లోని ప్రిస్‌బిటేరియన్ హాస్పిటల్ లో 16వ తేదీ రాత్రి మరణించారు ఆయన వయస్సు 59.

1934 లో 'ఇట్ హాపెన్డ్ ఒన్ నైట్' చిత్రంలో చేసిన అపూర్వ నటనకు క్లార్క్ గేబుల్ 'ఆస్కార్ పతకం' అందుకున్నారు 'మ్యూటినీ ఇన్ ది బౌంటీ' 'గాన్ విత్ ది విండ్' చిత్రాలలో ఆయన నటన మరపురానిది ఈ చిత్రాలతో ఆయన స్త్రీ ప్రేక్షకులకు దేవతగా శిఖామణీ అయినారు. హాలీవుడ్‌లో గల పెద్ద ధనవంతులలో ఒకరు అయినారు

పెద్దమనిషి — ఓ బ్బాయీ, మీ తాతయ్య ఉన్నారు?

పిల్లవాడు — నాకు తెలియదు.

పె. మ. — పోనీ, మీ అమ్మమ్మగారు ఉన్నారు?

పి. వా. — ఉన్నది.

పె. మ. — ఏమి చేస్తున్నారు?

పి. వా. — వంటింట్లో మా తాతగారితో పోట్లాడుతుంది.

—ఆచార్య విజయ భాస్కరరావు (నాగపూర్

వుంటావు" నాగు మౌనంగా ఒకరి ముఖాల్లో కొకరు చూచుకుంటున్నారు. వారి హృదయాలలో పుట్టిన వియోగాంధకారం లోకాన్నంతటినీ క్రమ క్రమంగా వ్యాపిస్తున్నది.

"ఆనంద మహాశయా! కార్తీకమాసంలో తెల్లవారుజామున అందరితోపాటు అమ్మాయి గూడ స్నానానికి వెళ్ళింది. తల్లీ వాళ్ళకు ఆమె కన్పించలేదు. సఖీజనంతో ముందే వెళ్ళిందేమో అనుకున్నదట. తెల్లవారిన తరువాత ఆమె చెలికత్తెలు అమ్మాయికోసం వచ్చారు. అప్పుడు వెంటనే ఆమెను వెతికటానికి మనుష్యులను పంపినాము. నేను యజ్ఞదీక్షలో వుండటంవలన ఎక్కడికీ రావటానికి వీలులేకపోయింది. నిన్ననే మీ ఆశ్రమంలో ఆమె క్షేమంగా వున్నదని తెలిసింది. ఆమె నదిలో పడివుంటుందనుకో లేదు. ఏమైనా క్రూర జంతువులు అపకారం చేసినవేమో ననుకున్నాను. మీ ఉపకారానికి నేనెంతో కృతజ్ఞుడిని." మమత తండ్రి అన్నాడు.

"మహాశయా! మీ అమ్మాయి ఇక్కడ వున్నది కొద్దికాలమే అయినా మా అందరి ఆదరాభిమానాలకు పాత్రురాలైంది. ఆమెను తప్పనిసరి కాబట్టి పంపుతున్నాము." ఆనందులు అన్నారు. మమతా ప్రియవ్రతులిగువురు అప్పుడే చేరియొక వైపునించి ఆ సమూహంలోకి చేరినారు. రాత్రి భోజనసమయం కావటంవలన అందరూ అక్కడినించి లేచారు.

ప్రియవ్రతుడు పరధ్యాన్నంగా వున్నాడు. అతని మనస్సులో ఏమి వున్నదో ఎవరికీ తెలియదు. "గురుదేవా! మీ ఆదేశాలు నాకు మార్గదర్శకాలు. నేను గురుదక్షిణ నేరూపంలో అర్పింపవలెనో ఆజ్ఞాపించండి." ఒకనాడు ప్రియవ్రతుడు గురువులను సవినయంగా అభ్యర్థించాడు.

"బోధాచరణ ప్రచారముల ద్వారా ధర్మానుసరణమే నాకుగురుదక్షిణ." అన్నారు ఆనందులు. కాని ప్రియవ్రతుడు పట్టుబట్టినాడు. అయితే అవకాశం కలిగినప్పుడు నేనే అడుగుతాను. రేపు ప్రాతఃకాలం నీ ప్రయాణానికనుకూలం" ఆ గురుశిష్యులు ఒకరి కొకరు వీడటానికి బాధపడ్డా తప్పలేదు.

"చిరంజీవీ! నిన్న నీ వివాహ విషయం నాన్నగారు నాతో అన్నారు. వారొక సంబంధం చూచారట. వారితో వియ్యం మన కన్నివిధాలా యోగ్యం అని వారి అభిప్రాయం" తల్లి ఒకనాడు ప్రియవ్రతుని తల నిమురుతూ అన్నది.

"అమ్మా! ఇప్పుడే వివాహప్రసక్తిఎందుకు? కొన్నాళ్ళయిన తర్వాత..."

"నాయనా! మీ నాన్నగారి మాట సుగ్రీవాజ్ఞగదా! నేను సరే అన్నాను. మీ గురువుగారే ఈ సంబంధాన్ని కుదిర్చరట" మాతృ పితృ గుర్వాజ్ఞ లాతనిని బంధించినవి. హృదయంలో మమత తలుపులు తడుతున్నది. కాని

# మమత

(15-వ పేజీ తరువాయి)

అతడు అశక్తుడు. అతడు నిశ్చలంగా అలాగే వుండిపోయాడు. మమత ఉనికి గూడా అతనికి తెలియదు. ఆమెకు తెలపటానికి అవకాశం లేదు. అతనికి కర్తవ్యం స్ఫురించలేదు.

కన్యాదాత గ్రామానికి పెళ్ళివారు తరలి వచ్చారు. ఆ గృహస్థు వరపూజ చేసినాడు. గురువుగారు ప్రక్కనే వున్నారు. అనుకూలుడు ఇంకా ఇతర విద్యార్థులు ప్రక్కనే వున్నారు. ప్రియవ్రతుని చూపులు వీరినిదాటిపోయినవి. కనీసం గురువుగారైనా మమతను తీసుకొని రాకపోతారా అనుకున్నాడు. ఆశ్రమాన్నించి తండ్రితో వెళ్ళేటప్పుడు ఆమె తనవైపు చూచిన చూపు అతని కింకా గుర్తువస్తూనే వున్నది. "నన్ను అన్యాయం చేయకు ప్రియవ్రతా!" అని ఆమె అంటున్నట్లున్నది. అతని కన్నులలో నీరు కనిపించింది. అతను మనస్సులో ఏదో నిశ్చయించుకున్నాడు.

ప్రియవ్రతుడు విడిదిలో వున్నాడు. తెల్లవారుజామున వివాహం. రాత్రి వధూవరులు భోజనం చేయకూడదు. తక్కిన మగపెళ్ళివారంతా భోజనాలకు వెళ్ళినారు. అతనికేదో ఫలహారం పెట్టినారు. అనుకూలుడు అతనిని విడవకుండా వున్నాడు. కన్యాదాత ఆయనకుమారుల ముఖాలలో మమత పోలికలు కొద్దిగా అతనికి తోచినవి. కాని అది తన భ్రాంతి అనుకున్నాడు.

"నాయనా! ఇందాక నేను పెండ్లికూతురిని చూచాను. ఆ అమ్మాయి నీలాగే మౌనంగా వున్నది. వినయవిధేయతలు తెలివితేటలుగల పిల్ల." తల్లి సంతోషంగాఅన్నది. "పాపం ఆ అభాగ్యురాలికి ఏ బాధలున్నవో" అని అనుకుని ప్రియవ్రతుడు ఆ పిల్ల రూపురేఖలను గూర్చి అడుగుదామనుకున్నాడు. కాని అడగలేకపోయినాడు.

వివాహ కార్యకలాపాలు యథావిధిగా జరుగుతున్నవి. వేదమంత్రాలు సస్వరంగా శ్రావ్యంగా వినిపిస్తున్నవి. మధ్యమధ్య మమత అని అతనికి వినవస్తున్నది. కాని అది తన భావనావిశేషం అనుకున్నాడు. ముహూర్త సమయానికి వధూవరులు శిరస్సుల మీద జీలకఱ్ఱ బెల్లం వుంచుకున్నారు. వధూవరుల మధ్య తెర వున్నది. ప్రియవ్రతునికి ఆపిల్లను చూడవలెనని లేదు. తెర తీశారు. "అమ్మాయిని చూడు - నాయనా!" గురువుగారు మెల్లగా అన్నారు. అతడు మెల్లగా తల ఎత్తినాడు. తల వంచుకొనివున్న వధువు ముఖాన్ని తల్లి పైకెత్తింది. అయిష్టంగా అప్రయత్నంగా వారి చూపులు కలుసుకున్నవి. "మమత!" "ప్రియవ్రతుడు!" వారిద్దరు గొణుక్కున్నారు. ఆ వధూవరుల హృదయాలు లౌకికావధుల నతిక్రమించినవి, దుఃఖబాష్పాలను సంతోషబాష్పాలు నెట్టివేసినవి. అనురాగరంజితాలైన వారి కనులలో గురుదేవుల పాదాలు ప్రతిఫలించినవి. ఆనందుల చిరునవ్వు వెన్నెలలు వివాహ మండపాన్ని ఇంకా ప్రకాశింపజేసినవి. ఆనందుల ఆశీర్వాదాక్షతలు వారి తలలపై నిలచినవి! ★

## గళ్ళనుడికట్టు-27

## ఆధారాల పోటీ ఫలితం

క. తులసమ్మగారు (టి. ఫత్తూరు) పంపిన ఆధారాలు ఉత్తమమైనవిగా నిర్ణయించి ఆమెకు బహుమతిగా రు. 5 లు పంపుతున్నాము

తులసమ్మగారు పంపిన ఆధారాలు ఇవి:

8 అడ్డం: దగ్గర సామము రానిస్తే అందులోనే మంచి కనిపిస్తుంది.

(మేము ఇచ్చినది-చతుర్విధోపాయాలలోను మంచిది.) జవాబు- సామము.

16 నిలువు: ఓడించితిమి రంగయ్యాని; వానితల చీకట్లో కలిసిపోయింది.

(మేము ఇచ్చినది-చీకటి.) జవాబు- తిమిరం.

## 28-వ గళనుడికట్టుకు ఆధారాలు

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | 1 అ | | | | 2 ప | | | |
| | | | ను | | | | లు | | | |
| | | 3 కం | చు | 4 కం | | 5 అం | కు | 6 రం | | |
| 7 చ | వ | టు | | 8 ద | ను | జ | | 9 జ | న | త |
| | | 10 కం | 11 బు | కం | | 12 నం | 13 ద | నం | | |
| | | | ర | | | | బ్బ | | | |
| | | 14 మం | ద | 15 సం | | 16 క | ర | 17 క | | |
| 18 పొ | గ | డ | | 19 గ | భా | ల | | 20 టి | క | చీ |
| | | 21 పం | 22 జ | రం | | 23 క | 24 స | క | | |
| | | | ప | | | | ష్ట | | | |
| | | | ము | | | | ము | | | |

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

# గళ్ల నుడికట్టు-29




## ఆ ధా రా లు

### నిలువు

1 చిన్నబస్తీల్లో సంతతమూ లేక పోయినా వారానికోమారుండే బజారు.

2. తిమింగలం తినేది.

3 చంద్రబింబంపోలిన ముఖారవిందం.

4 సన్యాసి పొడరు.

5 నడికట్టులో గది పేరు.

6. మంచిబుద్ధిశాలే కానీ నూరుపైచిలుకు పద్యాల్లో నీతులు చెప్పించుకున్నాడు.

8. తువ్వాయిలే గలు గల్లున గెంతు తున్నాయి

9. అబ్బో! మీ రనుకున్న దానికన్నా ఎక్కువే.

11. మబ్బుల్లో తేలివచ్చి పడేవి.

14 నా హారంకాదు. అమాటకొస్తే మంచు

15. రెండు పరకలు

17 కాలిన దాని వాతపడితే పడేదే

18 వేమనని కొత్త అటూ ఇటూ చేస్తే పద్యాలన్నీ అటునించి మనవే.

20 మోక్షం కోసం మొకరిల్లిన ఏనుగు

21 కోదండపాణి మెడలో మాల

23 దప్పికే

25 పొద్దస్తమానం ఉండేది.

27 మనవాడు కాడు.

29 గాజులు తొడిగించుకో బోయిన మహా వీరుడు.

31 బంగారు కొండగాదూ!

32 మాధవుడులో లక్ష్మి ఎక్కడికో వెడితే భర్తమిగిలాడు.

33. ఆ ధరిమేనా వెళ్ళకండి. బీబీ పల్లకి వస్తోంది.

34. ఏరువాకలో ఏ రెండిపోయింది.

35. తినగా తినగా గారెలు ఏక్కడి ఏమిటో తెలిసినా తినేముందు కనరు.

36 ఆవుకి చిట్టుతోబాటు పెట్టేది.

39 మొగుణ్ణిచూడగానే తొందరపాటు తోబాటు కొత్త పెళ్లికూతురి మొహంలో దొంతర్లు పడేది

41. గోరోజనం పెరక్క ముందుమాలుగు- పెరిగాక ఇదీను—

43. నా దేవుడు.

44. 41 నిలువు తల నీదికాదు నాదనుకుంటే రెండు కొస్లు రైటే.

45. గుండె అనడానికి గుండే చెరువా మీరే చెప్పండి

49. 20 నిలువుని మకరి మింగేసరికి తల కిందులై పోయింది.

50 మావ కొడుకు, అక్క మొగుడు.

52. వడిగా పోకండి బండిదారి అడ్డం తిరిగింది.

53 నిన్నా నేడూ కూడా కొగు.

### అ డ ము

1 ఫేషన్‌లు మారిమారి మీసంగతి చివరి కిలా తయారయింది. దీనిలో విషయం ఏదో కనిపిస్తూనే వుంది.

4. ఈక్షణం వూదితే మరో క్షణంలో పేలి పోయేదే.

6. వాసు తన కూతురికోసం వెతుకు తున్నాడు. కనిపిస్తే చెప్పండి.

7 లేమి విపరీతమైనది.

9 నిప్పుకు మారుపేరు.

10. వాడి వాడితనం అంతా అటునించి వసేనే కనబడుతుంది.

12. విమానాలు తిరిగే వీధి.

13 ఈ నాటికి నీతి తారుమారయింది.

15. సగబాలలో సగంపోతే మిగిలేవి.

16 కనకంబుకన్న మోతగా వుండేది.

18. వడివేలు ఉంగరాలుండే చోటు.

19 దేవుడికి రోజూ పూజాసమయంలో ఇచ్చేది.

20. రకరకాల పువ్వులు కలగలుపయ్యాయి.

22. రగయిత ఉద్యోగం.

23 హారంలో ఈ చివరనుంచి ఆ చివర దాకా వుండేది.

24. అతని తాలూకా మూకదిరిపడింది.

26. పక్క సరిగ్గా వేసిలేదు.

28 6 నిలువులోని బుద్ధి.

30 ఎవరు వారంటే మేక చెప్పిన జవాబు.

32 అశ్వమేధంలో గుర్రం పారిపోయింది. మిగతాది గందరగోళం అయిపోయింది.

34 వాడు కనబడినప్పుడల్లా ఒక సిగ రెట్టు తీసుకోడం అలవాటు. దీన్ని మీ రేమన్నా సరే.

35 తన.

37. తిన్నగా పోయే దారి అని నిరూ పించండి.

38. గోదావరి పుట్టినచోటే ముక్కువుంది.

40. నాలుగందాల చేటు.

41. ఇంకెవరు - నువ్వే.

42. ఆరోజు, దేశంకూడా తలకిందులైంది.

44. నీరు పోసినవాడు పోసేది.

45. అపసవ్యంగా చూస్తే చెడే కని పిస్తుందికదా.

47. విశ్వనాథ సత్యనారాయణగారి ఒక నవలలో ఈ దొంగలున్నారు జేబులుజాగ్రత్త.

48 విలుకాడు పిట్టను కొట్టేముందు చూసేది.

50 ఝునక్ ఝునక్ పాయలు .....

51. దేవుడిల్లు.

53 రజకులు 46 నిలువుగట్టున పెట్టేది.

54 కండ్ల కౌటుక పెట్టె ... చంకౌన బెట్టె

55. వేడి గాలి.

★

# "ధర్మ ప్రభువు"

విడాకుల కోర్టులో ఒకరోజు వయస్సుమళ్ళిన భార్యాభర్తల కేసు విచారణకు వచ్చినది. భర్త తనను సరిగా పోషించక పరిత్యజించెనని భార్య ఫిర్యాదు. జడ్జి ఇరుపక్షములవాదము శ్రద్ధగా విని, ప్రతివాదితో, "నీవు గుణవంతురాలగు నీ భార్యను సరిగా పోషించక విడిచిపెట్టినందుకు, ఆమెకు నెలకు రూ. 25/- ఇవ్వదలంచినాను" అనెను.

ప్రతివాదియగు భర్త ఆ తీర్పు విని ఉప్పొంగి, "ధర్మప్రభువుల తీర్పు చాల ఉదారముగా నున్నద. నేనుకూడా అప్పుడప్పుడు ఆవిడకు ఒకటి రెండు రూపాయలు ఇవ్వదలంచినాను" అనివిన్నవించుకొనెను.

—సురేంద్రశింగ్ (నెల్లూరు)

* * *

# 'మా ఆయన అనుకొన్నాను!'

ఒక ప్రఖ్యాత రాజకీయ నాయకునికి షష్టిపూర్తి అయినా పెళ్ళి కాలేదు. ఈ రహస్యం అంతు తేల్చుకుందామనుకొన్న ఒక ప్రతికా విలేఖరి సరాసరి ఆనాయకుణ్ణే పోయి అడిగాడు పెళ్ళెందుకు చేసుకోలేదో చెప్పమని. ఆయన తాను పెళ్ళి చేసుకోకూడదనే నిర్ణయానికి రావడానికి గల కారణాన్ని ఇలా వివరించాడు:

"ఒకరోజున నేను బస్సులో ప్రయాణంచేస్తున్నాను. నాతోపాటు ప్రయాణం చేస్తున్న వారిలో ఒక లావుపాటి స్త్రీ కూడా ఉన్నది. బస్సులో జనం క్రిక్కిరిసి ఉండడంవల్ల నేనూ ఆమె నిల్చునే ఉన్నాం. ఒక-చోట కుదుపులో పొరపాటున ఆమె కాలు తొక్కాను. ఆమె ఉగ్రురాలై 'ఇడియెట్! కళ్ళునెత్తిమీదికొచ్చాయా? ఆమాత్రం చూసుకోనక్కర్లేదూ?' అని నాలుగూ దులిపింది. నేను పొరపాటుకు చింతించి "క్షమించండి! చూళ్ళేదు" అన్నాను.

"అప్పుడు చూసింది ఆమె నావైపు. ఆ తరువాత క్షమాపణ కోరే చూపుతో 'క్షమించండి! మా ఆయననుకున్నాను' అన్నది."

—హావిస్ (విజయవాడ-1)



చిత్రకారుడు : డి. రంగారావు (సికింద్రాబాదు)

## పొట్టి కథలు

* * *

# ముద్రా రాక్షసమ్

ఒక పత్రికలో ఇలా ప్రకటన పడింది:

"ఎంత దీర్ఘకాల వ్యాధియైనా సరే, మాచే తయారుకాబడిన దివ్యౌషధం వారం రోజులు సేవిస్తే నయమౌతుంది. (తులం ఖరీదు అయిదు రూపాయలు.) అలా కుదరదని రుజువు చేస్తే మీ జబ్బు మీకు వాపస్."

—భట్టారం రాధాకృష్ణయ్య (కోవూరు)

... Nageswara Rao Estates Private Ltd., by S. Radha Krishna at
The Andhra Patrika Press 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad

Regd No. M. 4479 Andhra Patrika Illustrated Weekly.